# శ్రీవేంకటరామకృష్ణగ్రంథమాల.

## ద్వితీయగుచ్ఛకము.



ఇందు

శ్రీపిఠికాపురసంస్థాన విద్వత్కవులగు

రామకృష్ణులచే

రచియింపఁబడిన

కోకిలకాకము, కవితావిమర్శనఖండనము,
ఖండనమండనము, (భారతము) శతప్రాసము, శతఘ్ని.
(శృంగభంగము, సత్యసందేశమును)
గలవు.

మొదటికూర్పు 600.

కాకినాడ.

శ్రీ సుజనరంజనీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.

1912.



ణాలు 12.

| పుట | పంక్తి | ఒప్పు. |
|---|---|---|
| 10 | 11 | సంతవట్టు |
| 11 | 3 | సైఁపన్ |
| | 10 | లెక్కింపఁ |
| 13 | 13 | ఉత్కర్ష |
| • | 18 | దానితోఁ |
| 15 | 9 | తండ్రి |
| 18 | 5 | యంచునకు |
| 26 | 10 | మరుత్తిచ్చె |
| 29 | 14 | లగువారు |
| | 17 | సర్థాను |
| 30 | 5 | రేఫార్థ |
| | 16 | సర్థాను |
| | | —శృంగభంగము.— |
| 2 | 10 | సైఁచి |
| | 18 | స్పతింబోని |
| | 32 | చల్లఁగ |
| 5 | 15 | జాతము |
| 6 | 7 | రామశాస్త్రి |
| | 10 | స్నేమని |

| పుట | పంక్తి | ఒప్పు. |
|---|---|---|
| 6 | 23 | వారలును |
| 7 | 2 | మెచ్చుఁగన్ |
| | 5 | తేటిచూడ |
| | 6 | లోఁగిటి ; |
| | 18 | శిష్యులును |
| 8 | 9 | వ్రాసివా |
| | 19 | వచ్చితిఁ |
| | 20 | రామశాస్త్రి |
| | 21 | తీర్చితిఁ |
| | 23 | లఁట |
| 9 | 18 | వెట్టఁగ |
| | | —సత్యసందేశము.— |
| 2 | 9 | యన్నఁ |
| | 19 | గోణంగు |
| 4 | 1 | కాఁకర |
| 6 | 5 | సంధి |
| | 7 | సామరస్య |
| | 8 | సేఁటికిన్ |
| | 10 | గారారు |



# కోకిల కాకము.



శా. ప్రాతఃకాలము వాయసంబుపణినా పత్యోక్తశాస్త్రంబులోఁ
దాతజ్‌స్థానులు సెప్పఁడెవ్వియను చందంబొప్పఁగాఁ గాకాయనర్
జాతుర్యంబలరార నుత్తరము విస్పష్టంబుగాఁ గోకిల
వారితంబిచ్చెఁ గుహూకుహూయని గృహారామప్రదేశంబునన్. 1

శ్రీనాథుఁడు.

గీ. బలునకుమఱంది; కృష్ణునిబావ; జెట్టి
యు నగు భీమునకోడి సుయోధనుండు
ధైర్యమును గోలుపోయి యొద్దానడాఁగి
నాఁడో యదియొండు ద్వైపాయనహ్రదంబు. 2

గీ. ఆమదువుచెంత నీరసంబైన చింత
కొమ్మపైఁ గూరిమ్మైఁగులాయమ్మొకండు
గట్టుకొనియుండుఁ బలుగాకి కాకియొకటి
లాతికవులొకకొన్ని గొల్వఁగవసించు. 3

క. కాకవులునాఁడు నాఁడును
నీకంఠస్వరము వ నీయుంబని త
న్నేకొనియాడఁగ నది నిజ
మే కద యని తలఁచి వాయసేశ్వరుఁడెగయున్. 4

గీ. క్రమముగా గర్వమధికముగాఁగ గాయ
కోత్తముఁడ నేనటంచు నూహూరఁ దిరుగు

కాకి పలుగాకి మూఁకలఁ గలసిమెలసి
కడకు గాయకబిరుదము గట్టుకొనియె. 5

సీ. ఒకసారిపాగరెక్క శుకశారికాదులఁ
గయ్యంబునకుఁబిల్చుఁ గాలుద్రవ్వి
యొకమాఱుకాకవిప్రకరంబు తనతీరు
వినుతింపమత్తిలు విఱ్ఱవీఁగి
యొకవేళ నెడఁగుబాలకులు గాలికి ముప్పఁ
గట్టమిన్నులుముట్టు గంతులైచి
యొకనాఁడు తనపాటలకు మెచ్చు పక్షులఁ
జేరి "కా" యని కూయు నోరుదెఱచి

గీ. వేళొకప్పుడు తనరూపవిభవమెల్ల
వాఱఁగనుఁగొని యచ్చెరుపాటునొందఁ
దలఁచి పటపట ఱెక్కలు దులుపుకొనుచు
నెక్కయెండినచెట్టుపై నెక్కినిక్కు. 6

క. ఏకడకు నేగినప్పుడో
రాకొమరుల సౌధశేఖరంబులవ్రాలుం
గాకవికటంబుగా మన
కాకేశ్వరుఁడంతమాత్ర గరుడుండగునే? 7

చ. కొలఁది యెఱుంగలేని యెల కోయిల యొక్కఁడు వాయసేశ్వరు
స్వలఁతియకాఁదలంచి తనవారలఁజీరికిఁగొక ముద్దుగాఁ
బలుకుసదయ్య గానమునఁ బాండితి నెక్కుడు సంగ్రహింపఁగాఁ
దలఁపునఁ జేసి వాయసపదంబున కేగె ముదంబుపెంపునన్. 8

ఉ. జ్ఞానములేని వాయసుఁడు గాయకుఁ డంచుఁ దలంచి వాసిఁ
గానమునభ్యసింపఁగఁ బికంబనభిజ్ఞత నేగుదేరఁగాఁ
దానునుగాయకుండనని తత్త్వముమార్పడఁజేసి దానికిం
గానముసెప్ప సిద్ధపడెఁ గాకము లోకమువారు నవ్వఁగన్. 9

క. లోకోత్తరమగు గానము
కోకిలడింభకము చదువుకొనవచ్చుట నెం
తో కులుకుచు మన్నించెను
గాకిగుణం బెవ్వఁడేని కాదనఁగలఁడే. 10

గీ. దినదినము వేఁతకై దేశదేశములకుఁ
జనుచుఁ గలవారి ముంగిళ్ళఁ గునికిపాట్లు
పడుచునుండిన విడువక భక్తితోడఁ
గొలుచుఁ గోయిలవిద్దెపైఁ గలుగుపేర్మి. 11

ఉ. గొప్పకు నెందుఁబోయినను గోయిలఁ బోకొనిపోవుగాని తా
నెప్పుడుఁ బొట్టకూటికొఱకే తిరుగాడుచునుంటనేమియుం
జెప్పదుకాకి కోయిలకుఁ, జెల్లి యొకప్పుడు సెప్పఁజూచినం
జప్పనికూతదక్క సరసంబగు పల్కొకఁడైన రాదుగా. 12

గీ. ఎన్నటికినైనఁ జెవులకు నింపు నింపు
నొక్కపలుకేని తెలుపదో కో యటంచుఁ
గోకిలము పుట్టిడాసతోఁ గొలిచెఁ గాని
యెప్పటికి దానికోర్కి యీడేఱదయ్యె. 13

క. ఎఱుఁగదు పికపోతము దన
గురువునకుం గలుగు విద్య కొలఁదిఁ బసితనం

బరిగిన పిఱుందనే య
త్తెఱఁగంతయు దానికొయ్యఁ దెలియఁగనయ్యెన్. 14

గీ. కాకి వైఖరి మనమెఱుంగనిదికాదు
కాకిగానము క్రొత్తదిగాదు మనకు
గండుగోయిలపిల్ల యకాలమందుఁ
బసితనంబాటఁ దెలియక భంగపడియె. 15

గీ. చాలకాలంబువిసిగి వేసారి తుదకుఁ
గాకపికి గానశక్తి యెట్లు గలుగుననుచుఁ
దెల్లమగుటయు మిగులఁ జింతిల్లి పికము
కాకమునువీడి తనవారిఁ గలసిమెలఁగు. 16

గీ. అంతఁ గోయిలపిల్ల వసంతకాల
మవతరింప రసాలమునధివసించి
సరసులెల్లరు మెచ్చ స్వజాతి సులభ
మయిన గానంబు కర్ణపేయంబుసేయ. 17

ఉ. కోయిలపిల్ల మేలు తనకున్ లభియింపక యుంటఁ జేసి య
త్యాయతమానసూయహృదయంబుఁ గలంపన హర్నిశంబు న
వ్వాయసమూర్తి భూమిఁగలవారికిఁ గోయిలపాటఁ జేదుగాఁ
జేయుతలంపునం జెవులు చిల్లులువోవఁగఁ గూయునీగతిన్. 18

గీ. విబుధవరులార! కోయిలపిల్లపాట
కర్ణపరుషంబు; మున్నునాకడనె విద్య
నేర్చె; దీనికొకింతయేనేరుపు; కల
కంఠములు గారవార్హముల్ "కావుకావు". 19

గీ. చాలఁగాలమునుండి ముచ్చటగఁబాడు
కాకములసొమ్ము గానము ; గాని మొన్న
మొన్న నాయొద్దనేరుచుకొన్న పికము
కలగవమ్ములు మధురముల్ ""కావుకావు''. 20

గీ. కాకియోర్వఁగలేక యిక్కరణినెపుడు
""కావుకా''వని కూయునకానిధరణి
నెఱుఁగగాకొ కలకంఠమునెల్లవారు
వినరొకో దానిగానము వీనులార. 21

క. కాకము వనకోకగుసనని
యేకోటులసెప్పునైన నేమియసూయం
జేకొని పికముంగాకం
బేకరణినొ నిండలాడ నేతలపోయుణ్. 22

గీ. కాకియొకనాఁడు కోయిలకడకువచ్చి
యౌర! పికపోత! నీగర్వమధికమయ్యె
తొల్లి గానంబునెల్ల నాతోడఁ జదివి
కృతమెఱుంగవు నీకింతకేవడంబె? 23

క. అంచుంగించుదనంబునఁ
జంచువుఁగదలించి వాయసముదన్నుణ్ యా
చించిన నెజ్జటికముఁ బ్రచు
రించెదనని కోకిలమ్ము రేపుణ్ మాపుణ్. 24

ఉ. తేఁకువగల్గువాఁడు పరదేశములం జరియించువాఁడతి
శ్లోకుఁడు వేఁపపండ్లుఁదిని చొక్కెడుకాకవి సార్వభౌముఁడే

నాకుగురుండు నమ్ముఁడనిరి మనకోకిల పాకమేలొకో
లోకమువారు నమ్మరదిలోపముఁ గాదుగ వారిబుద్ధికిన్. 25

ఉ. కాకము గాయకుండఁట పికంబునకుంగురువంట తన్ను సు
శ్లోకులలోనవాకొననిలోపము కోయిలపిల్లదంట తా
నేకడుధర్మవర్తియఁట యిద్ధగుణుండఁట వింటిరయ్య! యీ
సాకులటంచుఁ జెప్పుకొనసాగిరిలోకులు వింతవింతగన్. 26

క. కోయిలకుంగురుఁడను నే
నేయని యెప్పుడునుజాటు నెల్లెడలంగా
నీయేరును బాటింపమిఁ
బాయని రోసమునఁగలఁతవడు వాయసుఁడున్. 27

క. ఈయున్నతజేనిగంటుం
గోయిలకాకమునకునుంగుఁ గొంగంగనియెం
దోయెత్తిలినగెనఁటనది
యే యొకరంధ్రిముగవిగ్రహింపఁగఁదొడఁగెన్. 28

ఉ. కోకిలమట్లుకయ్యమునకున్మదిగోల్పదు ముద్దుఁగొల్పుఁగా
వాకొని యెల్లలోకులను వశ్యులఁజేసినదయ్య; నెప్పుడో
కాకమునొద్దనొక్కపరి గానమునేర్వఁగఁబోయియుండుటన్
గాకికిఁ గోకిలమ్మునకుఁ గయ్యము తియ్యము గాకయుండుటన్. 29

క. అదికారణమ్ముగాఁ ద
న్నెదురఁగ లేదనితలంచెనేమోఁ కాకం
బొదిగి పికకూజితమ్ముల
వెదకి వెదకి చూపసాగె వెట్టిదొసంగుల్. 30

చ. ఎఱుఁగదుగాక కాకమొకయించుకయేనియు నాత్మశక్తి; వా
దెఱవ నపస్వరంబులుగ దేతనకుం బొడసూపు! గాయకో
త్తరకలకంఠనాదమునఁ దానును దప్పులువట్టఁజూచినన్
గరుసగునేవికస్వర పికస్వర మెవ్వరికేని యంతలోన్. 31

క. కాకమొకవక్త్రకోయిల
మూకంబని మదిఁదలంచు మొఱకులఁదెలుపన్
లోకోత్తరమగుఫణితిని
కోకోయనికూయసాగెఁ గోకిలమంతన్. 32

ఉ. చేసెడుచేఁతయుత్తములచిత్తము నుత్తలపెట్టుచుండుటం
గూసెడుకూఁత కర్ణములకుం బరుసంబుగఁ దాఁకుచుండుటన్
వాసియువన్నెయుంగలుగువారలు "హూ"షనిపాఱఁదోలిసన్
నాసరివారు లేరనియె నమ్మునువాయసుఁడేమిసెప్పుదున్ ?. 33

క. కొంగొంగురనుచుఁ గూసెడి
కొంగను ముంగిళ్లులమెలఁగు కొంచెపుఁగాకిన్
బంగారు పంజరమ్మున
సింగారింపఁగ నెవండుచిత్తముఁ గొలుపున్. 34

కో కి ల కా క ము.

తెలిసినతాను గానమును దెల్పినదేయగుచోఁ
గొలువకయున్న దోసమది కోయిలపిల్లదెకా
తలఁపఁగరానికూఁతలను దత్త్వమెఱుంగక కో
కిలమునుదూఱివాయసము కీరితిఁజెందునొకో ? 35

శ్రీపీఠికాపుర సంస్థానవిద్వాంసులు,
వేంకటరామకృష్ణకవులు.

## టీక.

(2) బలునకు=బలరామునకు.

(3) కులాయమ్ము=గూఁడు, కవులు=జలపక్షులు.

(4) కాకవులు (కాక+వి) కాకిపిట్టలు.

(8) కొలఁది=పరిమితి, ఎలకోయిల=చిన్నకోయిల, వలఁతి=నేర్పరి.

(14) పికపోతము=కోయిలపిల్ల, ఒయ్యన=తిన్నగా.

(18) వాయసమూర్తి=కాకవ్యక్తి.

(19) కలకంఠములు=కోయిలలు.

(23) కేరడము=ఉపేక్ష.

(25) కోకిలపాకము=కోయిలపిల్ల.



# కవితావిమర్శనఖండనము.

చ. "గరళముమ్రింగి శంకరుఁడు కంఠమునందిడనీలకంఠుఁ డ
త్యురువిషభోజియౌ నెమిలియున్ విదితంబిల నీలకంఠ; మం
చిరవులముంగిటంగనవు టిక్కలఁబాఱెడు పుర్వుఁగ్రొవ్వు సం
హరణమొనర్చు పిచ్చుక! యహో! యగుదీవును నీలకంఠమే.

ఉ. పండితులెల్లరెల్లపుడు భావమునన్ గసికోత్తమాదరా
ఖండముధాభ్యులౌదు; గొకకాలమునం బ్రతికూలమొంద; రు
ద్దండత్రృషన్ వసంతమునఁ దద్దసుఖంబ్రతుపికమ్ముగూయ; నె
న్నండును గాకియాఋవ వినన్వలపొందరెయేవివేకులున్."

మాయాచార్యులుగారు భాషాభిమానుల వ్యుత్పత్తికొఱకు కవితావిమర్శనముసేయుచున్నారు. కాని మొట్టమొదట వీరు విమర్శనమన నేమో? యెప్పుడు చేయవలయునో? యెట్లు చేయవలయునో? విమర్శనములవలన భాషకుఁగాని సంఘమునకుఁ గాని కలిగెడు లాభమెట్టిదో తెలిసికొనవలసియున్నది. కాన విమర్శనపద్ధతి నొకింత ముందుగాఁ దెలిపి పిదప వారికిఁ గలిగిన సందేహములను దీర్చి యిఁక మీఁద సూత్రప్రాయముగ వారుచేసెడు విమర్శనములచ్ఛేద్యములుగఁ జేసెదము.

విమర్శనమన గుణాగుణములను వెల్లడిసేయుట. గ్రంథకర్తగాని మఱియొకరుగాని గ్రంథమును సమగ్రముగా నచ్చొత్తించి యందలి లేఖక ముద్రాపకప్రమాదములను దెలిపెడు శుద్ధపత్రికతోడను దమ యభిప్రాయములను దెలిపెడు పీఠికతోడను, ప్రచురించినవెనుక విమర్శనమున కారంభించుట యుత్తమము. లేక పత్రికలయందుఁ బ్రకటిం

పంబడు గ్రంథములను వెనువెంటనే విమర్శింపఁ గుతూహలమున్నచోఁ బైనఁ జెప్పిన ప్రమాదములను సాధ్యమైనంతవఱకుఁ దెలిసికొని వానిని విడిచిపెట్టుట యుక్తము. లేనిచో ముద్రాపకులకుఁ బ్రూఫ్‌రీడ రగుటయేగాని యావిమర్శకునకు విమర్శకపదవిలభింపదు. విమర్శనము సేయునపుడు గ్రంథకర్తలయెడల నసూయలేక తాను గ్రంథకర్తృహితుఁడు మువాఁడై మృదుమధురములైనవాక్యములతోఁ గవిప్రమాదములను దెలియఁజేయుచు గుణములను మాటుపఱుపక వర్ణించుచుఁ దన చాతుర్యమును జూపవలయును. ఇట్టి విమర్శనములు బయలు వెరిన యెడల వాని నాదరముతో నెల్లరును జదివి గుణదోషముల తెలుంగు తెలింగి తాము వ్రాసెడి గ్రంథములలో నట్టి దోషములకుఁ దావీయక గుణములను బొందుపఱచి భాషకును సంఘమునకును వన్నె దెత్తురనుటకు సందేహము లేదు. క్రోధముచే విమర్శనములను పేరు పెట్టి గ్రంథకర్తలను బూతులు తిట్టుచు వ్రాసినవ్రాతలు విమర్శములగునా? అవి యెవ్వరైన నాదరింతురా? వానివలన భాషకేమయిన నుపయోగము కలదా? గ్రంథకర్తల కంతమాత్రి లోపమువచ్చునా? ఏమియు లేదు. మీఁదుమిక్కిలి విమర్శకుని బుద్ధిమాంద్యము; క్రోధావేశము; అసహిష్ణుత; అశక్తి దుర్జనత్వము; మాత్రము లోకమునకు వెల్లడియగును. మాంగాచార్యులుగారు కవితావిమర్శనమున నీవిషయముల నెంతమాత్రము ను గమనింపలేదు. ఆచార్యులుగారూ! మేమిట్లంటిమని మీకుఁ గోపము రాఁజనదు. మీరు సేయు ఘనకార్యమును బలువురాదరించుటకై యిట్లంటిమి కాని మఱియొండు కాదు.

శాస్త్రిగారూ! కాదు; పొరపాటు. పోనిండు పొరపాటనేల: శాస్త్రజ్ఞానము కలవారు శాస్త్రిశబ్దమున కర్థుం లేమతమునుబట్టి మీకాచార్యశబ్దమే యుండవలయునందురా? చూడుఁడు. శ్రవణానందములోఁ

గథానాయకుఁడైన మధుసూదనాచార్యుఁడు పరమేశ్వర్యుపాసకుఁడైన ట్లు వర్ణింపఁబడియున్నాఁడు. ఈసందర్భమునఁ బరమేశ్వరీ శబ్దమునకుఁ గాళియనిగాని పరదేవతయనిగాని యర్థము చెప్పనొప్పు. కాళియని చెప్పినచో వైష్ణవుఁడు శైవుఁడగుటయుఁ బరదేవతయని చెప్పినచో నద్వైతుఁడగుటయుఁ ఘటస్థించును. దీని నెట్లోవిఱిచి లక్ష్మియని యర్థము సెప్పి యాచార్యత్వసాధకమని సో నది యెట్లుండునో మేము చెప్ప నక్కఱలేదు. కావున మతాంతరోపాస్యదైవతమును మధుసూదనాచార్యుఁడారాధించినట్లు మీరు శాస్త్రిపదమును స్వీకరింపవచ్చును. కాన మిమ్ముఁక శాస్త్రిగారనియే సంబోధించెదము. శాస్త్రిగారూ! మీవిమర్శనముఁ జూడఁగా మీకుఁ దిరుపతి వేంకటకవులయందుఁ బ్రామాణికత్వబుద్ధియున్నట్లు తోఁచుచున్నది. అదిమాకును సమ్మతమే. కావునఁ బలుచోట్లమీకావృద్ధకవుల గ్రంథములనుండియే ప్రత్యుదాహరణములఁ జూపెదము.

మఱియు మీవిమర్శమునందుఁగల నిందావాక్యముల మేము త్తరింపము. ముద్రాప్రమాదములను శుద్ధపత్రికయే పరిష్కరింపఁగలదు.

—: మదాలస-నాందీపద్యము :—

(1) కావ్యార్థ సూచనము స్ఫుటముగా నుండనక్కఱలేదు. "మనాక్కావ్యార్థసూచనమ్" అని యాలంకారికసిద్ధాంతము. మీయభిప్రాయము "వృద్ధకవులభారతీనాటకములలోని కొన్ని నాందీపద్యములరీతి నుండవలయు" ననికాఁబోలు! అట్లుండినఁ గావ్యార్థవాచనమగుఁగాని సూచనముగాదు. అశక్తిసూచనమైనంగానచ్చును. ప్రస్తుతకాలానుసారముగ నాందీప్రస్తావనలలో రాజాశీర్వచనాదికము సేయనువచ్చును. భావికుశీలవులు తత్కాలానుసారముగ మార్చుకొనను వచ్చును.

ప్రాచీనకవులుసైతమిట్లే వ్రాసియున్నారని యెఱింగి పూర్వగ్రంథము లలోఁ గలవానిని గాలానుసారముగ మార్చుకొనుట కంగీకరించిన మీరు దీనిని మాత్రము కాలానుసారముగమార్చుకొనుట కేల యంగీకరింపరాదు? పూర్వగ్రంథములలోఁగల రాజనామాదికముల కర్థాంతరములఁ గల్పింతురో? ఇట్టి వృథాగర్జితముల నెవరునమ్మెదురు?

ఇందు "ఏలు" అను విశేషణము ప్రధానముతో నన్వయించుచున్నది. ప్రధానమగునేక దేశముతో నన్వయించునపుడేక దేశాన్వయము లేదని యెఱుంగునది. విశేష్యమునకు విశేషణాంతరవ్యవధానము దూరనన్వయముగాదు.

దూరాన్వయమిట్టిది:— శ్రీకింకపేంద్రఘుటికాపంచాననవిద్వత్కవి బాల కళానిధి బాలసరస్వతీశతావధానితిరుపతివేంకటేశ్వరులచే, ఇందు శ్రీశబ్దము గంధద్విపశబ్దమునందలి గంధశబ్దమునలె శ్రీవిశిష్టవాచకమగుట నియతము. ఇది తిరుపతివేంకటకవులకు విశేషణమగునని వారాసించిరి. కాని "అవనాంతాద్గోదకాంతాత్" అను భాష్యోక్తన్యాయమున సన్నిధాన బలిష్ఠులగు కింకపేంద్రులే మాశ్రీనపహరించిరి. కావున నిది యసంభవదూరాన్వయము. శ్రీసీతారామ కరుణాకటాక్ష...శ్రీరామ చంద్ర చరణారవింద...శ్రీహనుమత్ప్రసాదలబ్ధ...ఇత్యాదుల యందభియుక్తుల శ్రీపదప్రయోగమునుజూచి యట్లె గ్రంథాంతగద్యముల శ్రీశబ్దము ప్రయోగింపవలయునను సంభ్రమముతో వీరిట్లసందర్భముగా వ్రాసియుందురు.

—: నాంద్యంతమున సంతోషముతో :—

2. నాంద్యంతమున సంతోషమున కేమికారణము గలదు? అని కదా మీకుఁ గలిగిన సందేహము "నాంద్యంతమున సంరంభముతో"...అని వృద్ధకవుల బాలరామాయణము. ఈసంరంభమునకు

# కవితావిమర్శనఖండనము.

—:0:—

మాత్రమేమి కారణము గలదు? "కర్ప్రితాంతా" యనుసంతనే కలహించువానివలెఁ దత్తరపడకున్న నీరెండిటికిని జక్కనికారణములు గానవచ్చును. కాని వక్ష్యమాణపద్యమునఁ జిత్రింపఁబడిన శాంకరిహా స్యాలంబనయగుటఁగాక ముదంబిడు కారణము లేదు.

"శ్రీయనువాణియున్ వలయుఁ రీతిని జామరముల్ గ్రహించి కై। సేయసమస్తనిర్జరవిచిత్రకిరీటమణిప్రభాసనవ। శ్రీయుతపాదపీఠమగు సింగ ముతత్తడిమీఁదనొప్ప భ । ద్రాయితమూర్తిశాంకరిముదంబిడు"

(శ్రీవణానందము)

ఇందు శాంకరి సింహవాహనారూఢయగునప్పుడు లక్ష్మీసరస్వ తులు వింజామరలు వీఁచుటయు; దేవతాకిరీటమణి శ్రీయుతమగుపాద పీఠముండుటయు; వర్ణింపఁబడినవి. సింహము నధిష్ఠించుట హయము నధిష్ఠించినట్లే. వారుసందర్శించిన నానారాజులలో నెవ్వరైన హయాధి రూఢులైనప్పుడు సైతము సింహాసనము నధిష్ఠించినప్పుడు పాదముల క్రింద నిడుకొను పీఠమును గాళ్ళకుఁ గట్టుకొంటయు; వింజామరలు వే యించుకొంటయుఁ జూచియుండిరికాఁబోలు! సింహాసనము నధిష్ఠించిన ప్పుడు పాదపీఠముండును గాని హయాధిరూఢులకుఁ బాదపీఠముండదు. రికాబులుండును. ఈరికాబులను పాదపీఠములేయని చెప్పుకొన్న నిట్టి పాదపీఠములు సమస్త...శ్రీయుతములని వర్ణింపఁజనదు. ఏన్గుమీఁదఁగట్టి నట్లు సింహముమీఁదను గుఱ్ఱముమీఁదను జోలుకట్టుట యుత్సవా దులఁ బ్రదర్శింపఁబడు లక్కబొమ్మలయందుఁ దక్కమఱియెందును లే దు. కాన నిటసింగఁపుగద్దియయని సవరించుకొనినచోఁ గొంతబాగు

గ నుండును. మఱియు నిందలి “ వలయురీతి ” యనునది యతికినవలయు రీతి. లేక యది “ అక్కఱలేని రీతినివీఁచుటలే ” దని యమూల్యమగు నర్థము నిచ్చుటకా ?

—: నటప్రవేశము. :—

(3) నటుఁడు సూచింపఁబడక ప్రవేశింపలేదు. సూత్రధారుఁడు “ కీతకాపురసంస్థానవిద్వాంసులే ” అని సామాన్యముగ వాకొనుట విశేషమును దెలుప నటప్రవేశమును సూచించుచున్నది. ముందు నటీప్రవేశముగూడ సూచితమే. వృద్ధకవులనాటకములలోని వాచనముల కలవాటుపడిన మీకు సూచనములు స్ఫురింపవు కాఁబోలు! వారాంధ్రీకరించిన బాలరామాయణనాటకములో “ (అని యాలోచించి యెదుటకుఁ జూచి) అది యేమిటి ?, పారిపార్శ్వకుఁడు— (ప్రవేశించి) అది యిదే ” అని యున్నది. ఇందు సూత్రధారుఁడు “ ఎదుటికిఁజూచి యదియేమిటి? ” అని యడుగుటయే పాత్రాంతరప్రవేశమును సూచించుచున్నది. అంతియకాని సూత్రధారుఁ డొకనిని బొట్టువెట్టి పిలువలేదు. మఱియు నిందు “ ఎదుటకు ” అనుచోనపూర్వమగు “ ట ” అను నూతనవిభక్తిక ప్రత్యయమాంధ్రవ్యాకరణాజ్ఞతను “ పారిపార్శ్వకుఁడు ” అనుచోఁ బ్రత్యయము “ న ” కారము తద్ధితమూఢతను గూడ సూచించుచున్నవి. శుద్ధపత్రికలో వీనిని దిద్దుకొనకుండుట నివి యజ్ఞానవిలసితములనుటకు సందేహములేదు.

నటుఁడు మమ్ము “ పిల్ల ” లని నుడివినాఁడు ఇదియసందర్భమా ? అసందర్భమెట్టిదియో వృద్ధకవుల బాలరామాయణమునందే మీకుఁజూపెదము. చూడుఁడు! “ నీ. (పూర్వోక్త విశేషణవిశిష్టుఁడై) చ। లంగు తిరుపతిశాస్త్రి తెలుంగుఁ జేసె ” అని సూత్రధారుఁడు స్వ

ష్టముగాఁ జెప్పినను బధిరత్వముచేతనో మఱి యేకారణముచేతనో తెలి సికొనలేక పారిపార్శ్వకుఁడు "ఇది రచించినవారొకరో లేక యిద్దఱు రో నాకుఁదెలియకున్నది కాన వేర్పఱచిచెప్పుము" అని వావిడిచి యడుగఁగా నెవరేదిరచించినను వారిరువురు రచించినట్లే వ్రాసికొందు రు" అని సూత్రధారుఁడు కూడ సూత్రప్రాయముగ మఱియొక సమా ధానమిచ్చి యాతని మఱింత సందేహాబ్ధిలో ముంచినాఁడు. స్పష్టముగా "తిరుపతిశాస్త్రి తెలుంగుఁజేసె" అని చెప్పినను దెలియని యాచెవిటి పారిపార్శ్వకునకు సూత్రధారుఁడుచెప్పిన సమాధానము తెలివితక్కు వచేతనే యైనను సరిపడియే యున్నది.

ప్రతిభానిధానులగు ప్రధానులును,
విక్రమోన్నద్ధులగు భటులును, షడ్ద
ర్శనీమండితులగు పండితులును,

(4) ఇట్లు ప్రధానులను వీరభటులను మొదటఁజెప్పుటను, పం డితులను బిదపనుడువుటను, పండితులకన్న ప్రధానులే గౌరవనీయులని గాని, వీరభటులే యెక్కుడువారనికాని, చెప్పఁజనదు. రాజసభలో వారువారు గలరని వర్ణించెడు కవులకు రాజసభామహత్త్వము నిరూప ణీయముగాని, "వారికన్న వీరుఘనులు, వీరికన్న వారుఘనులు" అను నంశము ప్రతిపాదనీయముగాదు. "దండనాయకగణంబు... చతుర్విధవేదతత్త్వజ్ఞులు... శాబ్దికచయంబు..." అని వాయుపురాణ ము, ఇటఁ జతుర్విధవేదతత్త్వజ్ఞులకంటెను, శాబ్దికచయంబుకంటెను, దం డనాయకగణంబు గౌరవనీయమనియా మొదటఁ జెప్పఁబడుట? నిపుణ ముగా నిరూపించువారలకు మఱియునిందొక యౌచిత్యము చూపట్టు ను అదిమీాకగోచరమైనది. కావుననే యీరాజసన్నిధియందుఁ బండి

తులకు బూజ్యతయంతగా శ్రేమి తేలుచున్నదని యవిశిష్టభటశబ్దమును గ్రహించి వ్రాయించితిరి. ఇదివిఫలమనోరథులగు కొందఱుపండితంమన్యులనుకొనుమాట.

—: “ ఆటపాటలు నేర్వని ” యనుపద్యము. :—

(5) ఇది విదూషకునోదాహృతముగాని యువరాజునకుఁ గొఱంత నీలేదు. విదూషకాశ్వాసనార్థము నటిచేఁ జెప్పఁబడిన యీయుపమానము యువరాజునకు మిథ్యాభిక్షతో నారోపించుననియునుంబలె విచ్ఛిత్తి విశేషమును భాసించుచున్నది. ఎట్టియుపమానముపమేయమునకు హైన్యము నాపాదించునో మీకుఁ దెలియఁ జేయుటకు వృద్ధకవుల పాండవవిజయము నొకసారి తెల్పుచెదము. “ చాలదే వేటకుక్కయొక్క పాలింబు ” ఇది రణశూరుఁడగు నభిమన్యుని పొగడ్తకై వ్రాయఁబడినయుపమానపదము. వేటకుక్కతో నుపమింపఁబడిన యభిమన్యునకు వచ్చుమహత్త్వము గర్హ్యము.

—: సాలువులు. :—

(6) “ సాలువులు ” అనుపాఠము దుష్టమనియు “ సేలువలు ” అని యుండఁదగుననియు మీరు వ్రాసినవ్రాఁత యజ్ఞానమూలకము. “ సంజవెదజల్లుచెంగావి సాలువులను ” భా 4 “ ఆ. ” “ సాలు ” అని కూడ పాఠాంతరము కలదు; కాని “ సేలువ ” అనునది చింత్యము “ సేలు ” అనుపాఠము కలదుగాని యప్రసిద్ధము. (చూ. శబ్దరత్నాకరము) ఈ రెండును వృద్ధకవుల గ్రంథములయందుమాత్రము కలవు. నా॥ సం. 43 వ పుట “ సేల్జోడు ” 57 వ పుట “ బరసుల్ సేల్వాలు ”

ఇంతకుమున్ను ముద్రితమైయున్న మా గ్రంథమాలా ప్రథమగుచ్ఛకమునందు “ సాలువులు ” అని యుండుటనుజూచి యిందలిశవర్ణఘటి

తపాఠము ముద్రాప్రమాదమని తెలియఁగలిగినందులకు మిమ్ముఁ బొగడవలసియున్నది.

—: నాలుగు గంటలలోఁ బ్రదర్శింపఁదగు :—

(7) నాటకప్రదర్శనము పదిగంటలకారంభింపఁబడి రెండుగంటలకుఁ (అనగా నాలుగుగంటలలో) బూర్ణమై ముగింపఁబడుట ప్రాయికముగాలేదు. స్వల్పకాలములోఁ బ్రదర్శింపఁదగిన నాటకములు ప్రభుసభాయోగ్యములు కావుననే మేము "నాలుగుగంటలలోఁ బ్రదర్శింపఁదగునట్లు" అని వ్రాసినారము. "ఏకవులు వ్రాసిన నిట్లేవ్రాయుదురిందేమి యతిశయమున్నది" యనికదామీకుశంక? వృద్ధకవులపాండవవిజయమును జూచినచో మీకట్టిశంకకలుగదు. అది నాలుగుగంటలలోఁ గాదుగదా యంతకురెట్టింపుకాలములోనైనను బ్రదర్శింపశక్యముగాదు.

—: తపస్వి :—

(8) తపస్విశబ్దమునకర్థము శాస్త్రిగారికిఁ దెలియలేదు. కావననే మునీశ్వరులు రాజాన్నమున శాసించువారా? యనివింతపడుచున్నారు. "మునిదీనౌతపస్వినౌ" అని యభిధానము. "తపస్వులకు=దీనులకు" అని యెఱుంగునది, ఇది పాత్రప్రవేశసూచనార్థముపయోగింపఁబడినది.

—: దయాళురు. :—

(9) ఇది నిర్దుష్టము. ఆచార్యులైనవారికి సయితము తప్పుగాఁ గోఁచుట హాస్యాస్పదము. ఇటమీఁదు "వెంకయ్యవ్యాకరణమెవరియొద్దికేని యనిచదువుకొనఁగు" ననిమాకుసాయముఁ జెప్పుటకంటెఁ గవిరాజులగు మీగురువులయొద్దకేగి మీరుబాలవ్యాకరణముఁ బఠించుటమంచిది. (చూ- బా. వ్యా. దయాళుశబ్దంబున కిల్లుశేషంబుగానంబడియెడి దయాళురు.)

—: స్వాగతము. :—

(10) ఇది యూర్బికమంత్రములో నున్నశబ్దమగుటఁ బ్రయోగానర్హమని యసమంజసముగా మీరువ్రాసినది యనువదించుటకును మాకు సిగ్గగుచున్నది. "స్వాగతంవ్యాజహార" "స్వాగతింతపోధనాయాః" అని కాళిదాసభవభూతులు. మనవృద్ధకవులును "స్వాగతంబుగదర్శనం" "స్వాగతంబే" అని ప్రయోగించియున్నారు.

—: మానులనైతమింతబహుమానము సేయుదురే నరేశ్వరుల్ .:—

(11) ఇది శ్రీరామన్మహారాజావిషయములోఁ దన్ను బహూకరింపఁగాలనమహర్షి తనలో ననుకొనినవాక్యము. అంతియకాని యితరులెవ్వరో "నరేశ్వరులను మానులు బహుమానింపఁదగినవారుకారు." అని చెప్పినవాక్యముగాదు తానెంతయు గౌరవనీయుఁడైనను మహాత్ములకుఁ దమకుఁ దమయందంతగామహత్త్వబుద్ధి యుండకపోవుట స్వాభావికము; ఉచితమును: కావుననే గాలవుఁడు మానులనైతము మహారాజులింతగా బహుమానింతురే యని వింతపడుట హృదయంగమము. మేమే పూజ్యులమని కొందఱు తమకుఁదామే తలంచుకొందురుగాక! వారినిగుఱించి మనము ప్రసంగింపనక్కఱలేదు. కాని "మునులు రాజులకుఁ బూజ్యులుకారా?" అని మీరువ్రాయుంచినది యిందలిస్వభావోక్తి రామణీయకము నెఱుంగమిచేయని చెప్పుచున్నవారము.

—: చ. "క్రతువులు సేయ" అనుపద్యము. :—

(12) ఇట వచ్చిరో యనునది వ్యాకరణవిరుద్ధమని "శేషేప్రథమః" అను సూత్రము నెఱుంగినవా రనుకొనరు. ఈప్రసంగమునవృద్ధకవుల గ్రంథములలోని వ్యాకరణవిరుద్ధములనేకములు జ్ఞప్తికివచ్చుచున్నవి. ప్రస్తుతమింతగాఁ గొన్నియుదాహరించుచున్నారము. (1) శ్రవణానంద

ములో రెండవయాశ్వాసమునందలి 56 వ పద్యమున వేశ్యమాతను వ
ర్ణించునపుడు " వ్యాఖ్యాత " " వంది " అని పుంలింగనిర్దేశముఁజేసి
యున్నారు అనియతలింగములగు నీశబ్దములకిట స్త్రీలింగప్రయోగమ
వశ్యకర్తవ్యము; పుంలింగప్రయోగము కేవలదూష్యము. మఱియు
నీయానందమునందే " గీ॥ విటులమోహింపఁజేసెడు ♦ వేళలందు । మ
చ్చుమందులబొమ్మనా ♦ మసలవలదె । సానిసానియసంగనే ♦ సంబరంబె ।
వేరురీతులదానిసం ♦ సారియనరె ॥ " అనుపద్యమున సంసారిణియను
టకు " సంసారి " యని యపప్రయోగించి " తొండకు వెలుగుసా
క్షి " యనునట్లు దానికిమఱియొక యపప్రయోగముఁ జూపి దానను
దృప్తిఁజెందక యచ్ ప్రత్యయాంతముపై జీష్ వేయవలయునని తమయ
సాధారణవ్యాకరణపాండిత్యమును లోకమునకు వెల్లడించిరి. శూద్రా
దులవలెఁ బుమాఖ్యగాని యచ్ ప్రత్యయాంతమగు సంసారశబ్దముపై
ఙీష్ ప్రత్యయము వేయుదుమనుటయు వైయాకరణప్రతారణార్థము. శ్రీకిం
కవీంద్రఘంటాపంచాననులును పూర్వశాకుంతలమును విమర్శించుచు
" స్త్రీలు బ్రహ్మవేత్తలని సంసారులని రెండుదెరంగులైయుందురు. "
అను చోట ", ఈస్త్రీలు స్త్రీలుకాక పురుషులై యుండనోపుదురు. కా
వేని " వేత్తలును సంసారులును " నెట్లగును. అనివ్రాసి సంసారిశబ్ద
ము దుష్టమని యొప్పుకొనిరి; కానితాముసట్లే ప్రయోగించియుండుట
చేత సంసారీశబ్దమునుమాత్రమెట్లో మఱియొకరు సాధింతురుగాక యని
యాశీర్వదించిరి. (2) పూర్వోక్తగ్రంథమునందే మొదటియాశ్వాసము
లో 72 వ పద్యమున " కళ్లు " అని ప్రయోగించిరి. కన్ను శబ్దమున
కు బహువచనరూపము " కన్నులు " అని యుండునుగాని " కళ్లు "
అనియుండదని తెలిసిన పండితులు చెప్పినపిమ్మటసైతము పలుచోట్లవేసి

యుండుటచే దిద్దుకొనలేక యది « లోకోక్తికనుకరణ » మని వ్రాసిరి.

« సీ. నాకళ్ళయెదుట మొన్నటిదాకఁ జెన్నతనంపుఁ జేష్టలసం
చరింపలేదొ
„ „ „ నున్నతిలేక నెట్టినాపిథపీథులవిజ్జపీఁగలేదొ
„ „ „ నెంతయువింతరఘువంశమును జంక బె
ట్టుక చనఁగలేదొ
„ „ „ నున్నతులెల్లనవ్వంగఁజిటిపొటిపద్యముల్
సెప్పలేదొ

గీ. యెంతలో నెంతివాఁడయ్యె నెంతబుద్ధి
వచ్చెనెటునంటిసత్కీర్తి వచ్చెఁజత్ర »
మనుచునాతని చర్యలే యభినుతింత్రు
పండితవరేణ్యులక్కడి భాగ్యమేమొ.

ఇక్కడి పరమేశ్వరోపాసకుఁడును విశిష్టాద్వైతమతస్థుఁడునగు మధుసూదనాచార్యుఁడే. నయభినుతించువారును సాధారణులుగారు పండితవరేణ్యులు. వీరివాక్యములయందలిదే « కళ్ళు » అను నపశబ్ద ము. దీనినేమనవృద్ధకవులు లోకోక్తికనుకరణమని వ్రాసిరి. ఇదిపద్య మునందలి పండితవరేణ్యుల వాక్యముగాక వాకనుకొనినలోకుల వాక్య మేయని యొప్పుకొందము, తక్కినపదములు వ్యాకరణ సమ్మతముగాఁ బ్రయోగించిన యాలోకులొక్క యీశబ్దమునే పాడుసేయుదురా? కా వున నిదితమ యనభిజ్ఞతను గోపనముచేయఁదలఁచిన విద్వత్కవులయు క్తియే యని నిష్కించి చెప్పుచున్నారము.

(3) అందే 65 వ పద్యమున « వేదసంతలఁ గాలమ్ము వెళ్ళఁబు త్తురు » అనికలదు. ఇది గ్రామీణోక్తియని సమర్ధింతురా? లేక మహా

# కవితా విమర్శన ఖండనము.

కవిప్రయోగమును జీవగఱ్ఱమున్న గువానిలోఁ జేర్చి యానందింపవలసి యున్నదా? (4) నీతియుక్తంబగునట్లుఁ గల్పించిన యామహాప్రబంధమునందే తృతీయాశ్వాసములో 70వ పద్యమున "పాపుగఁజేతురెంత" అని కూర్చిరి. "చేతురుక్కోతురిత్యాదుల సాధువులని యెఱుంగునది" యని చిన్నయ్యసూరి వాక్రుచున్నాఁడు. ప్రసక్తానుప్రసక్తిచేఁ జాలదూరము వచ్చితిమి.

—: చాలు! చాలు! :—

(13) ఇట సంధి సేయ నక్కఱ లేదు. ఏకవాక్యమునందే సంహిత వివక్షాధీన. ఇట భిన్నవాక్యము లవివక్షితసంహితములు. వెనుక నొక చో సమృద్ధి వాచక మగు చాలుశబ్దమును గ్రియాపద మనుకొని "చాలని" అనునది యెట్లు సాధు వగును? అని సందేహించితిరి. కావున నా వాక్యమునకుఁ బ్రతిపదార్థమును దెలుపుట యుక్త మని యట్లు చేయుచున్నారము. "చాలు నా కిఁకఁ జాలని" నాకుఁ- ఇఁకన్ - చాలు= సమృద్ధి (సంపద) చాలున్= పర్యాప్తము.

—: విదూషకుఁడు :—

(14) బధిరత్వపంగుత్వాదికములు విదూషకున కభినేయము లగుట నిక్కమే. ఇందలి వసంతకవాక్యములు నభినీతములే కావున నాతని పంగుత్వాదికమును యథార్థము కా దని యెఱుంగునది.

—: ఉత్తరరామచరితము శ్రీశబ్దము :—

(15) గ్రంథాదియందు శ్రీశబ్దమే ప్రయోగింప వలయు ననుట

కేవలాంధ్రకవినిదర్శనోన్మాదము. “వాగర్థావివ- అస్త్యుత్తరస్యాం- కశ్చిత్కాంతా-” అనునవి కాళిదాసత్రయమునకు మొదటి శ్లోకములే “జంభారాతీభ-” అని మయూరకవియు “నిపీయయస్య-” అని శ్రీహర్షుఁడును గ్రంథోపక్రమముఁ జేసిరి. ఆంధ్రకవులు సయితమంద అను శ్రీశబ్దమునే మొదల నిడి యుండ లేదు, “హరికి సమర్పితమగు-” మత్స్యపురాణము. “రాముని శుభచరితంబులు-” రామాయణము. మీ “వైదికచాదస్తము” ప్రకారము రేఫవర్ణ మగ్నిబీజము మొదల నిడ రానిదియే. నరకృతి యైన దైవకృతి యైనను శ్రీబద్ధమే మొదలఁ బ్రయోగింప వలయు నను నియమము లేదు. “దేవతావాచకాః” అను శ్లోకమును “శ్రీవాణీ” అను నప్పకవీయపద్యమును బఠించుకొనుఁడు. అప్పు డింకను మీ కిటఁ గల సందేహము లన్నియుఁ దీరును.

—: కౌసల్య- సుమిత్ర- కైక :—

(16) రాముని గన్నది కౌసల్య; తక్కిన రాణులును వాత్సల్యమున నట్టిరేయని తెలుపఁ గన్నవారే యని నుడువఁ బడినది. భవభూతియు “రామస్యమాతరః” అని యవిశేషముగఁ బ్రయోగించి యీ యభిప్రాయమునే ప్రకటించినాఁడు. “మాత- కన్నతల్లి” అని యే యర్థము. “మాతి వర్తతే గర్భో త్రి మాతా. మా మానే వర్తనే చ.”

—: విదేహరాజనందన :—

(17) ఇచ్చో నందనాశబ్దము తప్పని మమ్మాక్షేపించి, పిదప నే సహపాఠియో యొప్పని తెలుప సిగ్గుపడి, మఱియొకచో నున్న “నందిని” యను మా ప్రయోగమును జూచి, యభ్రాంతప్రతియో

గు లగు మీ యాక్షేపముపై దిద్దుకొనినట్లు పన్ని, యెన్నఁడు నమూ ఫలి యున్నట్లు రెండు రూపములును సాధువు లని, (ఈ యవ్యక్తపరి) సంగము నుండి విముక్తి గాంచుట చమత్కారముగానే యున్నది.

—: వసిష్ఠగురుత్వము :—

(18) "మీ కులగురుం డగు వసిష్ఠుండు నీతో నిట్లు చెప్పె మ నియె" అని యష్టావక్రుఁడు వసిష్ఠగురుత్వమును దెలిపియే యున్నాఁడు. ఉపకృతికిఁ దగినట్లు ఛాత్రులును, లోకులును జెప్పుకొన వలయు ను గాని తన గురుత్వమును దానే చెప్పుకొన వలయు నని యశిష్టు లాసించినట్లు వసిష్ఠుఁడు నాసించునా? స్వతస్సిద్ధముగా ఘనత యుండ వలయును గాని దానివలన నతని కేమి మహత్త్వము వచ్చును? కావు ననే "గురుర్వాయంచ" అను కవినిబద్ధవసిష్ఠవికత్థనవచనము విడువఁ బడినది. ఔచిత్యానుసారముగ మూలమును సరకు సేయక "క॥ క రుణించి యింకు నాకుం బురోహితుని గాఁగ మీ సుపుత్రిఁ బవి త్రుఁ । పరమతపోనైష్ఠికు భూ సురయమనియమాభిరాము సోమశ్రవ సుఁ॥" అని యాంధ్రీకరించిన నన్నయభట్టారకుని మార్గ మనుసరణీ యముగదా?

—: { తీర్థోదకం చ వహ్నిశ్చ నాన్యత శ్శుద్ధి మర్హతః
శుద్ధి యొనరింప వలె నటంచును గడంగి
నీరు నిప్పును గడిగెడు వారు గలరె?॥

(19) అవివక్షితతీర్థత్యాగ ముచిత మైనదియే వివక్షితము కా దని యవిశిష్టవహ్నిపదము తెలుపుచున్నది. వహ్ని యన నపవిత్రాగ్ని యెట్లు గ్రహింపఁ బడదో యుదక మన నపరిశుద్ధజలము నట్లే గ్రహిం

పఁ బడ వని తెలియ నగు. లోకమర్యాద నెఱింగిన నిందలి వైచిత్ర్యము మీకు గోచర మగును.

—: « అవధరించితివే వసిష్ఠాది » యనుపద్యము. :—

(20) అవధరించు= ఎచ్చరికపడు- అని శబ్దరత్నాకరము. ఆ యర్థ మిటఁ దగియున్నది. కాని « చిత్తరువు చూడఁ దగినది కాదు » అని మీరు వ్రాయించినది పరాకుమాట. చిత్తరువు చూడఁ దగినది గాక వినఁ దగినదియా?

వసిష్ఠాదులను గౌతమ=(శతానంద) ప్రముఖులు గౌరవించుచున్నా రనుట సమంజసము. మూలమునందు « గౌతముఁడు శతానందుఁడు » అని గౌతమశబ్దము విశేషణముగా నున్నను దానిని విశేష్యముగా నుపయోగించిన బాధలేదు. ఇట్టి శబ్దములు నిలుసినచో విశేష్యములుగను, విశేషణములుగను గూడఁ బ్రయోగించుకొనఁ దగిన వని యెఱుంగునది. చూడుఁడు! « సమసంవయత్ప్రముఖగౌతమాంర్పితః » అని భవభూతి గౌతమశబ్దమును విశేష్యముగాఁ బ్రయోగించినాఁడు. దీనికి « శతానందుఁడు » అనియే యర్థము. « గౌతమేనపురోధసాశతానందేన » అని వ్యాఖ్యాత. మీ రెవ్వియో నెత్తియూహలు గావించుకొని ప్రముఖశబ్దముచే శతానందాదులు వివక్షింపఁ బడి రనియు, సర్వజ్ఞానము లే దనియు మఱియు నే మేమో నిందించితిరి. గౌతమ + ప్రముఖులు వసిష్ఠ + ఆదులను గౌరవించుటకు వచ్చి రని తెలిసికొనుఁడు.

—: జనకరఘ్వన్వవాయ :—

(21) « సముద్రాభ్రాద్ఘః » అని పలికి పాణిని పూర్వనిపాత మనిత్య మని తెలిపినాఁడు. మీ కే సూచనము దెలియకున్నచో వ్యాకరణవేత్తల నడుగుఁడు.

—: ఊర్మిళారాణి :—

(22) ధర్మైకప్రవణ యైన మగఁడు గురుసేవ సేయ నామతించిన యూర్మిళయు, ప్రేయసిని వీడి కానలకుఁ ద న్ననుసరింప వచ్చిన తమ్ముఁడును శ్లాఘ్యు లని సాభిప్రాయముగఁ గరుణాత్మ రాముఁడు పలుక నది మీకు వెగటుగా నున్నది. « పైత్యదోషోదయంబునఁ బరుస నైనఁ జిహ్వకును బంచదారయుఁ జేఁదుగాదె ? »

—: తిండి కై తిరుగాడుచు !—

(23) అనుచోఁ « తిరుగులాడు, తిరుగాడు » అను రెండురూపము లుండుట వ్యత్యయము.

—: ప్రాజ్ఞుఁ డవమానసమ్ము :—

అనుచో నొక సకారము గళితము.

—: నయనగామృతవర్తి :—

—: జలధరము వసించునొకఁడు :—

అని సమీచీనపాఠములు. ఇది శుద్ధపత్రిక చెప్పఁ దగిన యుత్తర మే యైన ననమరూను యోగు లగు మీ సంభ్రమ ముడుప నిపుడే యుత్తరించితిమి. మీ వృద్ధకవుల గ్రంథములలో నిట్టివి పెక్కులు గలవు. కొన్ని శుద్ధపత్రికలో సవరించుకొని యున్నారు. వారు గమనింప లేనివి కొన్ని యింకను గలవు. దిద్దుకొనిన దొకటియు, ముందు దిద్దుకొన వలసిన దొకటియుఁ జెడ దిద్దిన దొకటియు మాత్రము ప్రస్తుత ముదాహరించెదము. (1) సరస్వతీపత్రికలోఁ బాండవవిజయమును బ్రకటించు నపుడు « ప్రేరణ రాలిపోయినవి ♦ తొంబదితొమ్మిది » అని యతి తప్పఁ బెట్టి గ్రంథము ముగిసినపిదప శుద్ధపత్రికలో దానిని « ప్రే

ణ రాలిపోయినవి. త్రికులుతోంబది" అని సవరించుకొనిరి, వీరు పీఠిక లలో మేము దేవీభాగవతమునఁ గాక తక్కిన గ్రంథముల రేఫద్వయ మునకు మైత్రి సేయు చున్నార మని వ్రాసికొనుచుందురు. యుక్తము; కాని ప్రేరణశబ్దములో నున్న లఘు రేఫమునకు యతి నిల్పుటకై లఘు గురు రేఫముల సమానార్థక మగు రేకు శబ్దముండఁ గా గురు రేఫాది కమునే గ్రహించుట రేఫవ్యభిచారనియమమును రక్షింపఁ బోలు!
(2) క॥ పురుషున కెప్పుడుఁ బ్రతిష్ఠా। కర ము దారచరిత మగును ♦ గా ని కులముగా। బా. రా. 31 పుట. లక్షణభంగ మైనది. కాని వా రు గమనింప లేకపోయిరి. (3) గీ॥ నాకు వ్యశనికి నట్టి ది ♦ నములు కొ న్ని। రాఁ గలవు కొన్ని వ్రాయెను ♦ గొన్ని వచ్చె॥ బా. రా. పుట 20. ఇందు యతి దప్పఁ బెట్టుటచే నిట్లు దిద్దుకొనిరి.

నాకు వ్యసనికి నట్టి ది ♦ నములు వచ్చెఁ
గొన్నికొన్ని రాఁ గల వికఁ ♦ గొన్నికొన్ని పోయె॥

ఇందు యతి దిద్దిన గణనియతి పోయినది. దోషాంతరమున కొ ప్పుకొని హంసపాదములో హంసపాదముఁ బెట్టి యొక కొన్ని తీసి వే య వలయును.

—: ప్రబోధచంద్రోదయము :—

* "ఇంతదనుక మా కత్యంతమిత్రుం డగు నీ కీర్తివర్మమహా రాజునకు దిగ్విజయమునఁ దోడుపడుట నుద్రేకము నొందిన కామక్రో ధాదులం బలు తెఱంగులగు ననిత్యసుఖము లనుభవించుట బ్రహ్మానందా నుభవము లేమి దినములు మలినములు వలె గడచెను. ఇప్పుడు మా కుఁ దీఱుబడియె. కావున నేనిప్పుడు శాంతిరసప్రధాన మగు నాటక మా డించి యుల్లాసము నొందఁ గోరుచున్నాను. కాఁ బట్టిపూజ్యు లగు కృ

ష్ణమిశ్రులు రచించి, మున్ను నీ కొసంగిన ప్రబోధచంద్రోదయ మను నాటకము నీ మహారాజునెదుట నాడుము. ఈ మహారాజును సభవారును నా నాటకమును జిత్తగింప ముచ్చట పడుచునే యున్నారు." ని * గోపాలుఁడు భరతాచార్యున కానతి యొసఁగెను. గోపాలవినోదార్థము రచింపఁ బడిన యీనాటకము ప్రస్తుతకాలమునందుఁ ప్రదర్శింపఁ బడునెడలఁ బ్రస్తావనయందు మార్పు నపేక్షించియే యున్న దని మా ప్రతిపక్షులు తెలిసికొందురుగాక! ఈసందర్భమునఁ గృష్ణమిశ్రులిట్లు వ్రాసినారు.

శ్లో॥ నీతాఃక్షయంక్షితి భుజోనృప తేర్విపక్షా
రక్షావతీక్షితిరభూత్ప్రధితైరమాత్యైః
సామ్రాజ్యమస్యవిహితం క్షితిపాలమౌళి
మాలార్చితం భువిపయోధరమేఖలాయామ్॥

దీని కిట్లు తెలుఁగు వ్రాయఁ బడినది.

సుగంధి. ఈ క్షమేశు దుర్విపక్షు లెల్ల సంక్షయింప, స
దక్షమంత్రిరక్ష, భూమి తద్వశాఖ్య మొంద, భూ
రక్షిమౌళి మాల్యపూజ్యరాజ్య మక్షతంబు గా
దీక్షఁ జేసి సాజముం దితిక్షఁ జెందఁ జెల్ల దే? ॥

చదువరులారా! మూలము ననుసరించి మూలమునందు బలె శబ్దాలంకార మొప్పు లొలుక నీ పద్య మెంతయు హృదయంగమము గా నున్నదిగదా! మా యాచార్యులుగారి కీ పద్యమున కర్థము తెలియ లేదఁట? కఠినముగా నున్నదఁట! కావు నిట్టి కవిత్వ మెందుల కని విచారించుచున్నారు. మఱియునిం దేని:—

ఆటకత్తె—(ఆశ్చర్యముతో) అవురవురా! ఆర్యపుత్త్రా! ఎతఁడట్లు—
అని యొకచోఁ గలదు.

ఇందలి "యెతఁడు" అను శబ్దమునకు నిఘంటువుఁ జూచినఁ గాని యర్థ మెఱుకపడ దనియు నిట్టి కఠినశబ్దము లుపయోగించి శబ్దము చెప్పుటకంటె నిఘంటువులే వ్రాయ రాదా యనియును వితర్కించు చున్నారు.

చ॥ ఎతఁ డనుశబ్దమ్మే తెలియ ♦ కెన్నొ నిఘంటులు చూడఁ బోవు పం
డితులకు వ్యాసమిశ్రకృతి ♦ చెప్పర మైకనుపట్టు నన్న స
మ్మతమె; మహాత్మ్యతత్త్వసుమ ♦ మావిష యేచ్ఛలు వారిఁ దన్పనూ
ర్జితమతివైభవం బెడలఁ ♦ జెప్పుదురే బుధుడక్కఁ పద్దెముల్ ॥

సీ॥ విద్యాంసులే మెచ్చ ♦ విష్ణుచిత్తీయమ్ము
రచియింపఁడే కృష్ణ ♦ రాయవిభుఁడు
హర్షనైషధకావ్య ♦ మాంధ్రంబు సేయఁడే
శ్రీనాథకవిరాజు ♦ తెలుగుబాస
ఘటియింపఁ జేయలె ♦ కఠినపాకంబున
రామకృష్ణుఁడు పాండు ♦ రంగచరిత
వీరభద్రుండు గా ♦ వింపఁడే నిరుపమ
ప్రౌఢి వాసవదత్త ♦ పరిణయంబు

గీ॥ కాకవులుసంతసింపరు ♦ గాక గాథ
శైలివిడి జల్లిపదములు ♦ సంగ్రహించి
గచ్చువిచ్చుగ నోటికి ♦ వచ్చినట్లు
సంతరించునె సాహిత్య ♦ చక్రవర్తి

# కవితావిమర్శనఖండనము.

చ॥ పనివడినారికేళఫల ♦ పాకమునన్ రచియించు కబ్బముల్
గనుఁగొని యీసడించెదరు ♦ కాకవులర్థ మెఱుంగ రామిఁ ది
య్యనియవి ద్రాక్షపండులకు ♦ నఱ్ఱులు సాచియు నంద లేక పు
ల్లని వివి యేటి కంచు నప ♦ లాపము సేయవొకో సృగాలముల్.

—: పరికీర్ణము. :—

వెఱ్ఱియాక్షేపముల కుత్తర మొసంగుట యనావశ్యకము. అయినను మా చదువరుల వినోదమునకై కొన్ని ఖండించి చూపెదము. పండితులార! "తలను బైకెత్తి యన్యకాంతలను గనఁడు" అని మదాలసలోఁ గలదు. "తలను వంచుకొని చూచును గాఁబోలు! అట్లని మఱియు దుర్మార్గుఁడుగదా?" అని దాని నాక్షేపించిరి. "తలయెత్తి చూడఁ డెవ్వాలనఁ బరస్త్రీల" అని పాండురంగమాహాత్మ్యము నందును గలదు. ఇట్టి జాతీయముల కానందింపక వెఱ్ఱియర్థములు కల్పించుకొనుట విమర్శకులకు విధి గాఁబోలు!

సంభావనలు ముట్టలేదని తగవులాడువారి శత్రుజిన్నరపతి యధిక్షేపించిన పద్యమునుగూర్చి:— "ఔరా! ఆ కాల మెంతదుష్కాలము. ఆ ప్రభు వెంత మహానుభావుఁడు. బ్రాహ్మణోత్తములు సంభావనకై తగవులాడ మీరు గ్రుడ్డివాండ్రును గుంటివాండ్రును గారు గాన మీకు సంభావనలు ముట్టఁగూడదని యుత్తర మీఁదగినవాఁ డా కాలమున నున్నట్లు గ్రంథములు చెప్పవు" అని సివమెత్తినట్లు నిందిం

చుచు నెవ్వియో వ్రాసిరి. సంభావనలు ముట్టినను ముట్టలేదని యసత్య మాడి కలహించు బ్రాహ్మణోత్తముల నధిక్షేపించుట తప్పా? కుంటి వాండ్రను గ్రుడ్డివాండ్రను బోషించుట దోషమా? కలహించిన నసత్య ములాడిన నట్టి మహాబ్రాహ్మణులే దానపాత్రులా? ఏమి విజ్ఞానము? ఇట్లే గ్రంథములయందును జెప్పఁబడియుండలేదఁట! చూడుఁడు! మహా భారతమునందుఁ బరీక్షిన్నరపతిపాలనమును వర్ణించుచు బాదరాయ ణుఁ డెట్లు వ్రాసెనో:—

శ్లో॥ సమ స్సర్వేషు భూతేషు । ప్రజాపతి రివాభవత్
బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః । శూద్రా శ్చైవ స్వకర్మసు
స్థితా స్సుమనసో రాజన్ । తేన రాజ్ఞా స్వధిష్ఠితాః
విధవానాథవికలాన్ । కృపణాంశ్చ బభార సః
సుదర్శ స్సర్వభూతానా । మాసీ త్సోమ ఇవాపరః॥

(అతఁడు) బ్రహ్మవలె సర్వభూతములయందును సముఁడై యుం డెను. రాజా! యాతనిచే బాగుగ నియమింపఁ బడినవారలై బ్రాహ్మ ణక్షత్రియవైశ్యశూద్రులు మంచిమనసుతోఁ దమతమ పనులయందుం డిరి. అతఁడు విధవలదిక్కుమాలినవారిని, వికలాంగులను (కుంటివాం డ్రు గ్రుడ్డివాండ్రు మొదలగువారిని) లోభులను బోషించెను. మఱియొ కచంద్రుఁడువలె సర్వభూతములకు దర్శనీయుఁ డయ్యెను.

శత్రుజిన్నరపాలకీర్తి బెక్కుదిక్కుల దాఁటెను గలదని పురాణవచనము లను జదివిరి. కవిసమయానుసారముగ నాటకమున శత్రుజిన్నరపాలుఁ డేకపత్నీవ్రతనిష్ఠగలవాఁ డని మేము నుడివితిమి. ఇట్లే యాయాసంద ర్భముల శ్రీరాముఁ డేకపత్నీవ్రతనిష్ఠ గలవాఁడని కొందఱును బహు దారలు గలవాఁడని మఱికొందఱును మహాకవులు ప్రయోగించిరి.

పడఁతి యనుకూల లైనఁ బురుషుఁ డెంతయు నభివృద్ధిఁ జెం దవచ్చు నను విషయమును బ్రతిపాదించుచు గంగ (స్త్రీ) తనలో నేకీ భవింపకున్న సముద్రుఁడు (పురుషుఁడు) అంత యభివృద్ధిగా నుండు నా? క్షీణించి పోవఁడా? యని యతిశయోక్తిగర్భితముగ వ్రాసిన దృష్టాన్తాలంకారమునందలి పొందెఱుంగక " ఇది పెద్దబొంకు సముద్ర మునకు గంగవలన నామరూపములు వచ్చినవా? అటయినఁ గొంచె మేని తియ్యగా నుండదా? యనుచుఁ గేకలు వైచిరి. అలంకారవిశే షంబులను బ్రకృతిశాస్త్రమర్యాదను దెలియని వారి కట్టిశంకలు వా డముట యొక సముచితముగాదు. గంగవలననే సముద్రమునకు నామ రూపములు వచ్చినవి. ఇప్పట్టున భాగవతమునందలి సగరచరిత్రము జ దువ నగు.

" నిలుము నిలుము నిన్ను బలియిత్తు" అను పద్యముక్రింద " ఇది కోమలాక్షరములతో నిండియున్నది. వీరరసమునకు భంజక ము" అని వ్రాసిరి. వీరాధివీరుఁ డగు రాజపుత్రుని వృత్తాంతమును దెలుపు నొక మునిదారకునిచే నీ పద్యము చెప్పఁ బడినది. ఋషిపు త్రుఁడు రాజపుత్రునిగతి భీషణంబు లగు భాషణంబులు నుచ్చరింపఁగల్గు నా? కాని యందలి యర్థమును గ్రహించి మునిదారకసులభంబులగు వాక్యములచే మాత్రము మఱియొకరికిఁ దెలుపవచ్చును. ఈ స్వాభావ చమత్కృతిని దెలిసికొనలేక యే మా విమర్శకులు నెక్కిరించిరి.

గౌతమునం దందియిచ్చిన మొదలగు కొన్నిచోట్లఁ బూర్వోత్తర సంబంధము నన్వయోపపత్తియు లేకుండనే " అశ్లీలము అశ్లీలము " అని గంతులువైచిరి. కామలునకు శంఖము పచ్చగాఁ దోఁచిన ట్లసూ యావిష్టుల కన్నియు నశ్లీలములే కనుపట్టును. చిత్రము!

« మామిడి తోఁపు » అను శబ్దము ప్రయోగానర్హ మని వ్రాసిరి. స్వాగతశబ్దమువలె నదియు శ్లాఘ్యమయినది య. « చెట్లుఁదోఁపు లఁ బాదుల » అని వృద్ధకవులును వ్రాసియున్నారు. ఇట్లే జామారు శబ్దమును శుద్ధమ. శుభ కార్యములయం దీశబ్దమును « పెండ్లికొడుకున కొక పట్టుజామారు పెండ్లికూఁతున కొక పట్టుచీర » అని యాచ్యులు పాడుచున్నారు. « సిద్ధి ర్లోకా ద్వృత్యా » మఱియు నిది యభిధానసిద్ధ మయినదియును. (చూ. శ. ర.)

« మంత్రములాడించు కీలుబొమ్మలు » అను కల్పనము వృద్ధకవుల పాండవవిజయములో నున్నదఁట ! మే మది సంగ్రహించితిమఁట ! (ఇది) « చలమునదుస్ససేనుఁడునుసౌబలుఁడున్మిముఁబట్టియార్పబొమ్మలక్రియనాడుచుందురు.» అని తెనుఁగుభారతము సంస్కృతమూలమ. సచివాయత్తసిద్ధి, భూపతి నీతిశాస్త్రమున నిట్లు పోల్పఁబడెను. « క్లైవుసేనాపతి యార్చినట్లాడుటకు మీరుకాసీము బొమ్మవంటికాఁడు.» అని యిండియాచరిత్రము. (గోదావరినిరే భూపయ్యకాలువకువచ్చె; నదియె వెంకమ్మ బిందెఁడు తెచ్చికొని, యందఱు నాజలమపహరించిరన్నట్లున్నది.) « ఎట్టిని కోకఁ గట్టుకొనినచో నా పెండ్లామే » అను సామెతగా నెద్దియైన వృద్ధకవుల గ్రంథములయందలి కల్పనమే. (ఈ విషయము వేఱొక గ్రంథమునందు విస్తరించి వ్రాసినారము.)

« ఆర్యుఁడా లేఁజని సంస్కృతాంధ్రముల లేవడి మాన్పిన న్యాసపండితుం డాజ » అనుచో « లేవడి » యనునది యతిక్లిష్టవేసిన పద మని వ్రాసిరి. సంస్కృతాంధ్రముల రెండింటను బరిపూర్ణపాండిత్యము గల బ్ర॥ వ్యాసమూర్తిశాస్త్రులువా రట్లు విశేషింపఁ బడుట క

ర్హుల. ఆంధ్ర దేశీయు లగు విద్యార్థులకు సంస్కృతమును గాని తెలు గును గాని నిరవగ్రహము గా బోధించుటకు నుభయభాషాపాండిత్యము గలవారే యర్హు లని మెచ్చింగిన విద్యాశాఖవారును రెండిటం బూర్ణు లగు వ్యాసమూర్తిశాస్త్రులను వేంకటరామశాస్త్రుల నే సేకరించి యున్నారు. కాన నది « దాఁదాత్పర్వ మెలర్పఁ బ్రోచు నల సీతారామనామాంకితున్ » అని యిట్లు యతిప్రాసపాదపూర్తులకు వృద్ధకవులు నిలుపు « తాను » « అల » శబ్దములవలె వ్యర్థమైనది కాదని నిశ్శంకముగాఁ జెప్పెదము.

ముద్రాప్రమాదంబున శవర్ణస్థానమున సవర్ణంబు బడిన నది మాప్రమాదమే యని విమర్శకులు సంతసించిరి. అంతకుమున్ను ముద్రితము లగు మాగ్రంథములఁ జూచికొనిన నవి ముద్రాప్రమాదములే యని సులభము గా వారు గ్రహింపఁ గలరు. వృద్ధకవుల శ్రీనివాసవిలాసంబున « అధికారి నా (శి) కాగ్రంబునఁ గేలు » సత్తముం డొనరించు శా (శ) సమ్మును » స్య (శ్య) మానఖినమ్ములును » (శి) తరుచికి » వారా (సి) బాలశిఁడ » ఇట్లొకచోఁ గా దనేకస్థలముల ననేకములు సభ్రష్టములు గలవు. ఇవి కవిప్రమాదములో ముద్రాప్రమాదములో తెలిసికొందురుగాక! అవియు; నివియును; శుద్ధపత్రికలోఁ జూచుకొనఁ దగినవియే.

చదువరులారా! నిందాసముద్రం బగు వారి విమర్శనమునం దుఁ గనుపట్టు తత్సందేహబు[illegible] నెల్లఁ జిదిమివైచితిమి. అసూయైకప్రభవంబు లగు న[illegible] చెదరియున్న దీని నంతయుఁ జదివిన మీరు వానిని సు[illegible] [illegible]లు. కాదు! అవియే

తమంత విరిసిపోవును. మా విమర్శకులీ గ్రంథములను జదువుకొని తమ సందేహములను దీర్చుకొందురుగాక! అకారణవైరు లగు వృద్ధులు ను దమ గ్రంథములయందు మేము సూపిన దోషముల కెవ్వియో వె ల్లిసమాధానములు లిఖియింపక పునర్ముద్రణం బొడగూడెనేని సవరిం చుకొందురుగాక!

:—— ముండనమండనము. ;——

మాకుఁ బరిచితులు నపరిచితులు నగు పలువురు పండితులు క వితావిమర్శనముఁ జూచినవారు “ అది కేవల మసూయతో వ్రాసిన ది గాని యందేమియు గుణము లే ” దనియు; “ దానికి మీరు బదు లు వ్రాయ నక్కఱ లే ” దనియు; వాక్రుచ్చిరి. మాకు నట్టియభిప్రా యమే యుండుటఁ దడ వూరకుంటిమి. కాని:——

ఉ॥ మన్యువిదూషితాత్ములును మా ప్రతిపక్షులు నైన పండితం
మన్యులు పల్కు ప్రల్లదము పద్ధతి దోఁచును నింక మీఁద సౌ
జన్యమ పూనియుండుట ప్రశస్తము గాదని యెంచి లోకసా
మాన్యులఁ దేర్ప వారల విమర్శముఁ ద్రెంచితి మూఁచముట్టుగన్.

వెండియు వారు వ్రాయు ఖండనముండనంబునందు:——

క॥ అ ప్పరమేశ్వరి యనువో । నప్ప రమేశ్వరి యటంచు ననద ర్థంబుల్ । జెప్పుదురఁట! మాయురె! యటు । తప్పులు వర్జింపనే కదా ! మా తలఁపున్ ॥

“ దీని నెట్లో విఱిచి లక్ష్మి యని యర్థము చెప్పిన నది యెట్లుం డునో మేము చెప్పనక్కఱ లేదు ” అని ముందే వ్రాసియుంటిమి. లక్ష్మి

సహస్రనామస్తోత్రాదులయందుఁ గల యిట్టి శబ్దములు విశేషణపర్యవసాయులు గాని విశేష్యములు గావు. విష్ణుసహస్రనామములందు "శివాయ నమః, శర్వాయ నమః" అని కలదు. దానంజేసి శివశర్వశబ్దములు విష్ణుపర్యాయములుగాఁ బ్రయోగించు వెట్లు లుండకుగదా?

"పసగత్త లేక బలాదూరు" అనునట్లు మమ్మును మా యభిప్రాయవిశేషములను నిందించుటతోనే ముగింపక యందు వా రెద్దియేని విషయము వ్రాయఁగలిగినచో దానింగుఱించి దోషసహస్రమునందు వివిధవిశేషములతోఁ జర్చింతుము.

—: కవితాప్రశస్తి. :—

ఉ॥ మాఱటన్నోరివార లయి మాపయి వైరము మిన్నుముట్టఁగా
బీరములాడి నేఁ డిటులు పెంపును దెంపును వీటఁబుచ్చి మీ
పేరక డాఁగియుందురటె! హా! యిఁక లెండు శతఘ్ని యల్ల దే
భారతనాటకంబుపయిఁ బడ్డది! తిర్పతివేంకటేశ్వరుల్!

ఉ. చాటుగ లేఖ నంపిరని చాటి ముదంపడినట్టినాఁటి మీ
పోటుఁదనంబు నేఁ డెటకుఁ బోయినదోటు? బుధుల్ హసింపఁగా
మాటున డాఁగి మాపయి విమర్శములం బచరించుచుండ్రు; మీ
పాటును బంతమున్ విఱిగి పాఱఁగ; నింతటి కాందిశీకులే?

ఉ. అంక మొకింత గల్గని మహాత్ముఁడు వ్యాసమనీషియున్ నిరాతంకుఁడు మల్ల సూరియును దాతలు సేమముఁ జూచుచుండఁగా
వేంకటసూర్యరాయపృథివీరమణుం డనుకూలుఁ డేలఁ గా
వేంకటరామకృష్ణకవివీరులగారఁపుబిడ్డ కైత క
డ్డంకులు వల్కు పోటరులు డాఁగక లోఁగక యుండు టెట్లగుణ్.

ఓ మ్.

# శతపాత్రసము.

చంపకమాలిక.—భారతము.

సిరి మన రావు సూర్యనృప ♦ శేఖరు నింట వసించుఁగాత సు
స్థిరముగఁ; దత్ప్రభుప్రజ ము ♦ దంబును జెందెదుఁగాతఁ; దత్కృపా
భరితులు పూర్ణ (కాములయి) ♦ భాసిలుచుందురుగాత; భూస్థలిఁ
బురి దగు హాస్తినాఖ్య; (ద్విజ ♦ ముఖ్యులు శూద్రులు మింతురచ్చటన్)
గనువుల నీడల న్నిలిచి ♦ తామరసాక్షులు పాడఁ; బంచమ
స్వరములఁ గూయఁ గోయిలలు ♦ చల్లని తెమ్మెర వీవ (మొల్ల) స
ప్తారమున నేత్రపర్వములు ♦ పూవులతోఁటలు మీఱు నెంతయున్
గరు లరదంబు లశ్వములు ♦ గాల్బలముల్ దనరారు నప్పురం
బరయికఁ జంద్రవంశభవుఁ ♦ డా ధృతరాష్ట్రుఁ డనంగ ఱేఁడు భా
స్వరగతి నేలు నానృపుని ♦ సద్గుణము ల్గణియింపఁ బన్నగే
శ్వరునకు నైన శక్యమె? ని ♦ జం! బతఁడేమని చెప్ప సూర్యభూ
వర! యతథోక్తులం బలుకు ♦ వారల (జారులఁ జోరు) లన్ మదో
ద్ధురులయి (యెల్ల వేళఁ) బర ♦ దూషణముం బొనరించువారి నా
దరమున గారవింపఁడు బు ♦ ధప్రకరంబుల మెచ్చు (నెంతో) స
చ్చరితుల నెంచు దీనుల వి ♦ చారము నూడనిఁ బాడఁ జేయు నా
నరవరు సద్గుణంబుల వి ♦ నంగను నీకును జెప్ప నాకు ని
త్తఱి నదియెంత యేనియు ము ♦ దంబగుఁగాని; నృపాల! గ్రంథవి
స్తర మగునింక ముందటికి ♦ థన్ వచియింతు వినంగదయ్య! యా

పరిబృఢుఁ డోర్వుమైఁ దనదు ♦ (బాహుబలంబు సెలంగ) నేలు నీ
ధరి ; నెడఁ బాండురా జనెడు ♦ దమ్ముఁడు దోడ్పడుచుండు నంత నం
తరమున నొక్కనాఁడు (కడు) ♦ దర్పము మీఱఁగఁ బాండురాజు భీ
కరముల దుష్టసత్త్వములఁ ♦ గాఱియ వెట్టఁగఁ గాన కేగి (బి
త్త్ర) మగు నేణరూపమున ♦ దారను గూడి రమించు కిందమున్
భవమతపోనిధిం దనదు ♦ బాణముచే హతుఁ జేయ నాతఁ డు
త్త్వరఁ దన ప్రాణము ల్విడుచుఁ ♦ దాపముతో నృపుఁ జూచి యిట్లు క
క్కరముగ శాప మిచ్చె "ననుఁ ♦ గాడఁగ నేయుటఁ జేసి కామసం
గరమున నీవు నీ సతి సు ♦ ఖంబుగ నుండినయప్డు పంచతం
బొరసెద" వంచు శాపహతిఁ ♦ బొక్కి విభుండు విరక్తచిత్తుఁడై
తరుణులతోడ నా వనప ♦ దమ్మున వాసముఁ గొల్పుచుండఁగా
ధరణిపయిన్ వసంత మవ ♦ తారము నొత్తె జను ల్నుతింపఁగా
నరుదుగ వృక్షము ల్లతలు ♦ నామని (రాల్చిచిగుర్చి) గోయిలల్
బోరిఁ బొరిఁ గూయసాఁగెఁ ద్రుతి ♦ పుష్పవనంబునఁ గంధవహుమైకల్
దిరిపము నెత్తఁగాఁ దొడఁగెఁ ♦ దేనియకై యొకకీరిఁ బాడుచుం
గరముల వీవన ల్విడుచుఁ ♦ గా నెడ మీయని యట్టియామనిన్
సరసిజపత్త్రిముల్ గనులు ♦ చంద్రుఁడు మో (ము ; హారంగుపైఁడి) బొం
గరము లురోజముల్ గళము ♦ కంబువు నొక్కులు వడ్డ చిన్నిముం
గురులును దేఁటిపిక్కలును ♦ గోమలతం దులఁదూఁగు మాద్రి ; చి
త్తరువగు నామనోహరతఁ ♦ దామరచూలికి నైనఁ జెప్పఁగాఁ
దర మనరాని యట్టియది ♦ తన్వి దరిన్ గనరా మనోభవా
తురుఁడయి పాండురాజు తమి ♦ తోఁ గవుగింటను గూర్చె ఘోరపువి
ద్రోర దురమందుఁ దీరుటయుఁ ♦ దోడనె కిందముశాపశక్తిచే
మరణముఁ జెందె నయ్యెడల ♦ మాద్రియు దుఃఖపరీతచిత్త యై

కరమును « కుంతి కుంతి ” యని ♦ క్రందనముం బొనరింప నంత నా
పె గయముతోడ వచ్చి పతి ♦ పృథ్వీ మృతుండయి (యుంటఁజూచి) చె
చ్చెర నిటు పల్కె మాద్రి! కసు ♦ చెట్ట మొనర్చితి వయ్యొ! భర్త ని
ష్కరుణతఁ జంపివైచితివి ♦ గా యని యేడ్వఁగ నంతయున్ సవి
స్తరముగఁ దెల్పి మాద్రి పతి ♦ శయ్య నొనర్చెను సాగుమానమున్
బరమమునుల్ తపోధనులు ♦ భవ్యులు కుంతిని శోకవిహ్వలన్
హాసువగు దేవతాంశములు ♦ నచ్చటఁ బుట్టిన పాండుపుత్త్రులన్
గరిపురి కంపి నచ్చటను ♦ గౌరవపుత్త్రులతోడ వారలున్
మురువగు విద్యలం గురులు ♦ మోదముతోఁ దెలుపంగ నేర్చుచో
నరయక ధార్తరాష్ట్రుఁడు మ ♦ హాబలు వాయుతనూజు, నర్జునన్
నిరుపమచాపశక్తిఁ గన ♦ నేరక భీమున క్రోగినమ్ములో
గరళముఁ బెట్టె నాతఁడును ♦ గానక మెక్కెనుగాని యా వృకో
దరునకు జీర్ణమయ్యె విత ♦ థంబుగ వారల యత్న మీగతిన్
బహుసములైన మార్గములఁ ♦ బాములఁ బెట్టియు వారి శక్తి క
చ్చెరువడి కర్ణముఖ్యులను ♦ జేరి విరోధము లెంచుచుండిరన్
సరసులు గానఁ బాండవులు ♦ నైతురు ధర్మపరీతచిత్తులై
యురక వసించిరన్ శకుని ♦ యున్ ధృతరాష్ట్రసుతుండు వారలే
పురకును వారి యాల్ ద్రుపద ♦ పుత్త్రికి నెగ్గుఁదలంచి చూడన
చ్చెర మగు మాయజూదమును ♦ బన్ని యుధిష్ఠిరు నాడఁ బిల్చి యం
గరమర నోర్చి వారల మ ♦ హాటవికిం బనుపంగ వారు ని
బ్బరముగ రెండునుం బదియు ♦ వత్సరముల్ మును లాదరింపఁ గా
నుగుచిరవేల నుండి యటఁ ♦ జోద్యముగా నెరు లెవ్వరైనఁ ద
మ్మెఱుఁగక యుండ వత్సరము ♦ నేకము ప్రొవఁగఁ జేసి పిమ్మటన్

వారిఁ గరుణామయుం డమరు ♦ నా ధృతరాష్ట్రకుమారపాళికిన్
సిరియుఁ గులంబు నిల్చు గతిఁ ♦ జెల్మియొనర్పఁగఁ గోరియంపఁగా
నురువడి ధార్తరాష్ట్రుఁడు మ ♦ హోగ్రతఁ గృష్ణుని గట్టఁజూడఁ గ్ర
చ్చఱ నది యంతయుం దెలిసి ♦ చక్రియు వారిఁ బరాభవించి క్ర
మ్మఱఁ జనుదెంచి వారికి స ♦ మస్తము సిక్కమ చెప్పఁ బాండవుల్
కరిపురనాథుతోఁ గలసి ♦ కయ్యము సే (సిఘనుండు) భీష్ముఁడున్
గురుసుతముఖ్య దేశికుఁడు ♦ కుంభభవుండును మేటి కర్ణుఁడున్
గురుమతి శల్యుఁడున్ మొదలు ♦ ఘోరపరాక్రము లైన వారి నే
ర్పెఱఁ బరిమార్చి యెంతయును ♦ దేజ మెలర్ప వెలింగి రంతటన్
జిరము నృపాలధర్మములు ♦ చెప్పిన భీష్ముని యాజ్ఞఁ బార్థుఁ డ
ధ్వరము లొనర్చి కిల్బిషముఁ ♦ బాసి యశంబు గడించె నాగశిన్
బరులను గెల్చి మిత్రులును ♦ బంధుజనంబులు సంతసింపఁగా
గురుకరుణాంతరంగుఁ డయి ♦ కోవిదసత్కృప నరక్తుఁ డై
దురితవిదూరుఁ డై వివిధ ♦ దుష్టభయంకరుఁ డై ప్రవృద్ధవీ
రరసనిధానమై యతఁడు ♦ రాజ్యము సేయుచునుండె నాతఁడీ
ధరణిని గాచుచున్నపుడు ♦ దొంగలు గొల్లబెట్టువారు లేరు ; కా
వరమున నన్యకామినులఁ ♦ బైకొనువారలు లేరు ; దీనులై
తిరుగుచునుండువారలును ♦ దేవుని మ్రొక్కనివారు లేరు త
త్పరులయి నిందలాడెడు స ♦ తజ్జ్ఞులు లే రధిరాజభక్తి లే
క రహిఁ జరించు మానవులు ♦ గానఁగ రారు వివేకహీను లై
నెఱివిడి భర్తలం దెగడు ♦ నీరజనేత్రలు గానరారు యం
దఱుఁ బరమేశుఁ గొల్చెదరు ♦ ధస్తవనీయచరిత్రు లందఱున్
బరమపవిత్రవర్తనులు ♦ భవ్యయథార్థలసద్వచోధురం
ధరులగువారలందఱును ♦ ధర్మమతుల్ నృప! యేమిచెప్పుదున్.

బరువడి నెల్లకాలమును ♦ బాడినదే మఱిఁ బాడుచుండు దా
సరుల విధంబుఁ గైకొనక ♦ చక్కనిపింత లొనర్ప నెంచి వే
గిరపడుచుంటి నీగతిని ♦ గీర్తివిశాల! వినంగదయ్యా! యి
ట్లిరవుగఁ గొన్నిపాదముల ♦ నే మును గబ్బముతాత సెప్ప స
బ్బురపడి తత్సభాస్థలిని ♦ బోరన గద్దియ డిగ్గి గండపెం
డెరమును గృష్ణరాయఁడు తొ ♦ డిగె నృపపుంగవ! నా కవిత్వమా
తెలుఁగున గర్ణపేయముగఁ ♦ దీయఁగ నున్నదొ? లేదొ? కాని కీ
ర్తిరమణ! యంతకంటెఁ బలు ♦ రెట్టులు నీసభఁ జెప్పినాఁడ ని
ప్పరుసున దత్ప్రసంగముగఁ ♦ బల్కుట నీ విటు సేయుమంచు నే
నురవుగఁ జెప్పుచుంటినని ♦ యూహ యొనర్పకుమయ్య! భూపురం
దర! బహుధాప్రసంగవశ ♦ తెగ వచియించితి నట్లు భూపతీ!

# తెలివిడి.

శతఘ్నిని కృష్ణాపత్రికలోఁ బ్రకటించినప్పుడు మూలగ్రంథము స్వల్పముగా వ్రాయఁబడినది. గ్రంథకర్తలు మఱలఁ దమ నాటకమును ముద్రించుకొనునెడల నీ తప్పులను దొలఁగించుకొనవలసియుండుటచే నప్పటి చదువరు లీ దోషస్థానముల గుర్తింపలేరేమో? యను తలంపున నేఁటి ముద్రణమునందు మూల మించుక పెంచి వ్రాయఁబడినది. మూలకవు లర్ధానుస్వారశకటరేఫ విషయమునందుఁ బట్టుదలగలవారగుటచే నా దోషముల సైతము తెలిపినారము. కాని యవి నేటి తప్పులు కావని తలంచు పాఠకులు ప్రథమగుళికలో నెం-1-2-4-6-10-11-14-19-20-35-40-43-50-52-53-54-56-57-59-62-66-70-71-72-74-76-77-81-84-సంఖ్య గల దోషములను; ద్వితీయగుళికలో నెం-1-2-9-11-12-14-17-18-19-20-21-23-26-27-30-31-34-36-42-45-47-49-50-సంఖ్య గల దోషములను; తృతీయగుళికలో నెం-1-3-5-6-7-8-9-10-11-13-16-18-19-20-21-23-25-26-33-37-40-43-45-47-48-53-54-55-56-58-59-63-64-67-70-71-80-81-82-85-88-91-93-94-95-96-100-105-సంఖ్య గల దోషములను వెరసి నూఱుదుష్టములను మాత్రము తప్పక పరికింతురుగాక! వృద్ధకవు లొకానొకచో "వివేకి" యని స్త్రీపరముగాఁ బ్రయోగింప నొకపండితుఁ డది తప్పని తెలుపుటయు నప్పటి కాయనతో నది యొప్పే యని గ్రుద్దులాడిరి కాని తరువాతి పాణిగృహీతలో "వివేకిని" యనియే చెప్పుకొనిరి. అట్లే యిప్పుడు కాశకుశల నవలంబించి యివి దోషములు కావని యసంగతవాదమున కుపక్రమించినను మునస్మన్ముద్రణమందు భవిష్యద్గ్రంథములందు నీ దోషములఁ జేరనీయ రని మాత్రము దృఢముగాఁ జెప్పఁగలము.



# శతఘ్ని.

## ప్రథమగుళిక.

"ఆర్జవం హి కుటిలేషు న నీతిః"

చ. "తిరుపతి! నీవు నాకయితి • తిక్షు వహింపు మటంచు" "వేంకటే
శ్వరుఁడు సహించెఁ గాని యిఁక • సైఁపఁడు తిర్పతి" యంచు రిత్తచి
త్తగువుల వ్రాయుచుం దమకుఁ • దామె ముదంపడి రజ్జులాడు మా
తిరుపతివేంకటేశ్వరుల • తీరును లోకమునారు సూడరే!

ఈ కవులు పీఠికలో "అచ్చుతప్పులను ఆయాయంకముల చిగురున వివరించితిమి గాని మఱికొన్ని స్వల్పములు లేకపోలేదు" అని వ్రాసికొని యున్నారు. మేమును వా రాయాయంకముల చివర వివరించిన యచ్చుతప్పులను ముద్రాప్రమాదములని చెప్పఁదగు మఱికొన్ని స్వల్పములను గూడ విడిచి ప్రస్తుతకవుల నేరమిచే దొరలిన దోషములనుమాత్ర మిందు వ్రాసినారము.

ఇందుఁ జ్యుతసంస్కారదోషములుమాత్రము పెక్కు చూపఁబడినవి. శాస్త్రసిద్ధములు పండితసమ్మతములు నగు నీ దోషములను దొలఁగింప; దిద్దుకొనుటకంటె మంచియుపాయము లేదు. "సరసతిరుపతివేంకటేశకవులు" నట్లే సేయుదురు. కావున నిఁక దీనిపై ఖండనముండనమండనములు పుట్టవు.

ప్రహసనప్రయోజ్యము లగు “ముక్కు తెగబారెడుచేసితి నిక్కమచ్యుతా!” మొదలగు పల్లెటూళ్లపట్టుదలమాటలను వారే యెఱిఁగి సవరించుకొందురు. వేఱె చెప్ప నక్కఱ లేదు.

1. చిగురున—తప్పు “చివర” అనియుండఁదగు. చిగురు=పల్లవము; లేఁత. చివర=కొన; అగ్రము. చూడుఁడు! శబ్దరత్నాకరము.

“ఉ. భారతసంగరాంతమునఁ ♦ బాంధుతనూభవులందు దుఃఖమున్
భారము దీర్చి వారల క ♦ పారపురాజ్యము నిచ్చి యుత్తరా
దారకు సేమ మారసి ప ♦ దంపడి వారల నశ్వమేధసం
చారులఁ జేయు కృష్ణుఁడు భృ♦శమ్ము యశమ్మనిశమ్ము శమ్మిడున్.”

2. ఇందుఁ గావ్యార్థము సూచింపఁబడక; వాచింపఁబడినది. “మనాక్కావ్యార్థసూచనమ్” అని యాలంకారికులు. కథ నంతయు సంగ్రహముగా మొదటిపద్యములో వ్రాయుట యశక్తిని సూచించును.

3. ఉత్తరాదారకు—ఈశబ్ద ముత్తర మగపిని బుత్త్రినిగూడఁ జెప్పుచుండుటచే నశ్లీలము. మఱియు “నుత్తర కృష్ణునిభార్య” యని యొక యపార్థము ఝటితి స్ఫురించుచున్నది. దారాశబ్దము నాకారాంతస్త్రీలింగమును పేరందందుపయోగించియే యున్నారు. (భృశమ్ము యశమ్మనిశమ్ముశమ్మిడున్) విశేషార్థాధాయకములు గాక తూనికరాళ్ళ వలె నొకటిమీఁద నొకటిగాఁ జేర్చి పెట్టఁబడిన యీ శబ్దములచే నీ పద్యము వెఱ్ఱితలలువేసిన తోఁటకూరచెట్టువలె నున్నది. ముందుముందెక్కడను జూపని యీవైచిత్రి నిందేల చూపవలయునో? మొదటి పద్దె మనియా? బాగు!

4. ఇదుగో—ఇది దుష్టము “ఇదిగో” నని యుండును. “ఇదుగో, అదుగో, ఇరుగో, అదుగో, అను నపభ్రంశము లీ నాటకము నందుఁ గలవు.

5. గురువులతో గుద్దులాడ మొదలు పెట్టితివే?—తప్పు. "గ్రుద్దులాడ" అనియుండును.

6. భారతగురువెవరు? ద్రోణాచార్యులా యేమి?—గురువు, ఏకవచనము. ఎవరు, బహువచనము. ఇది "వాఁడెప్పుడువచ్చినారు" అనునట్లున్నది. "గురువెవరు?" అనిగాని "అతఁడు, ఇతఁడు, ఎతఁడు, పూజ్యవాచకములు" అనుట "గురు వెతఁడు" అనిగాని సవరించుకొనఁదగు. ఇందుఁబలుచోట్ల "స్వాములుప్రవేశించును" "వ్యాసులుప్రవేశించును" అనివచనచ్యుతి గానఁబడును.

7. (యోజించి)—దీనికిఁ "గూర్చి" అను నర్థము గలదు. "యోచించి" అనునర్థము కర్తృవాంఛితము "వెంకాయపిచ్చికొండ" యైనది.

2 పుట.

8. నాకితఁడు లక్ష్మయా—"లక్ష్మఁడా" అని యుండఁదగు.

9. బినతల్లి చెవులు బీరపువ్వులును గావఁట—తప్పు. బీఱపువ్వులు.

10. మాయింటి యజమానిపుట్టింటిపనుకరు—"యజమాన" అనిగాని "యజమానురాలు" అనిగాని యుండును. పుమాఖ్యగాని పుంలింగముపై జీష్ వేయఁగూడదు. "నఖ్యమాణేత్యతి" అను భట్టదీక్షితనిర్వచనము నీకవులు తెలిసికొందురుగాక!

11. అఁడువాండ్లు మాటలనుబుచ్చుకొని మనము—ఇదినింద్యగ్రామ్యము. "అఁడువాండ్ర" అనునది శాస్త్రసిద్ధమని యెఱుంగునది.

12. నీకుచితమని తోఁచినదా?—అరసున్న విడుచుట యుచితమని మీకుఁ దోఁచినదా?

13. ప్రకృతముమరచితినే—ప్రకృతముగాదు మఱచినది శకట రేఫము.

14. సూత్ర—ఈనాఁడు మనము ప్రదర్శింపఁదగిన నాటకమెయ్యది?

మారి—పాండవాశ్వమేధమని యూహించితిని.

సూత్ర—ఎట్లు?

మారి—మీరొనరించిన నాందినిబట్టి.

సూత్ర—చక్కఁగాఁ బోల్చితివి.

ఈ సూత్రధారుఁ డెంత తెలివిగలవాఁడో చూచితిరా? గురుపుత్త్రుఁడగు మైత్రేయుఁడు తన పిల్లలు నిదురించునప్పు కొట్టఁగాఁ దన భార్య కోపించి యందులకు జరిమానాగా నాతని శిరోభూషణముఁ దెమ్మని పట్టుపట్టినదనియుఁ వా నాతనికి «కలహముకూడదు. నీ శిరోభూషణ మిమ్ము అని కబురంపితి» వనియు నసందర్భముగా నస్వాభావికముగాఁ గథాసూచనకై మారిషుఁ డుపన్యసించుచున్నను దెలిసికొనలేక «ఈనాఁడు మనము ప్రదర్శింపఁ దగిన నాటకమెయ్యది?» అని మారిషు నడుగుచున్నాఁడు. ఇంతియకాదు! అంత గూఢముగా సూచ్యార్థముగల యానాందిని బట్టి పాండవాశ్వమేధము ప్రదర్శింపఁ దగినదని యూహించినందులకు «ఎంతచక్కఁగాఁ బోల్చితివి» అని మారిషునిగుఱించి సంతసించుచున్నాఁడు. ఇంత కుశాగ్రబుద్ధి ప్రదర్శించిన యీనాటక మెంతచక్కఁగానుండునో చూతము!

15. ఈగ్రహింపువలననేకాబోలును—ఈపె పము లెక్కఁడివి?

3 పుట.

16. కవులప్రశంస బొత్తుగా సభాస్తారులకు—తప్పు. బొత్తిగా

17. శ్రుతపఱపము—కాదు. పఱుపము.

18. ఈకవులంగుఱించి వేఱే మనము చెప్పనక్కర లేదు—నిజమే నిజమే "అక్కఱ" అని యుండును.

19. అదుగోచూచితివా?—ఆఁ! చూచితిని శబ్దము పాడైనది. సంధి చెడినది. "అదిగోఁజూచితివా?" అనియుండవలెను.

20. మైత్రేయుఁడు గాఁడు అశ్వద్ధామ—అశ్వధ్ధామయును గాఁడు. అశ్వత్థామ.

21. అశ్వద్ధామ కృపకృతవర్మలతోఁ బ్రవేశించును—పై యజ్ఞానము నిది స్థిరీకరించుచున్నది.

## 4 పుట.

22. దుర్యోధన! ఇదుగోనీమనమ్మున—తప్పు—పై—

23. వార్తకేనినోచవేమో—నోఁచవు.

24. వారల వెదుకకత్వరగా—తప్పు. వెదకక

25. జరిగినవట్టువినిపింప వచ్చితిని—ఇదియపహాసము. "జరిగినంతవట్టు" అని దిద్దికొనునది

26. ఉ. ఆయితమైతినీకొదువయున్నది నాకిఁకనుండకుండుతన్—కొదవ.

27. చ. ప్రహదమునడాగెనంచు నృపునారడికూఁతుఁలు—ఆఱడి.

28. మిమిత్రుఁడు శేషము మిగుల్చువాఁడనుకొంటిరే—విశేషములేని "శేష" శబ్దమిటననన్వయదోషమును దెచ్చిపెట్టినది.

29. శా. చంపీచంపనిరీతిఁ జంపితినిధృష్టద్యుమ్ను సైన్యమ్ములన్—ఇది "యెటఁగియెఱుఁగని" రీతిగానున్నది. నింద్యగ్రామ్యము.

30. నిన్ననరేనిఁ దేరిపాఱఁజూడఁ—తేఱ

31. మరల నడుగుచున్నాడను—"వాఁడు" అనుచోఁ దక్క—నిట్టిరూపభేదమ్ముల నరసున్నయుండునని కవియెఱుంగఁడు. ఇఁకను ముందు చూడఁదగు.

32. ఆంబికేయున కెఱిఁగించి యూరడింపుమనుగాక!—ఊఱడింపుదురు.

33. రారాజుతో నిందాక నీమాటచెప్పితినా?—ఈ "దాక" లో నరసున్న వేయుఁడు.

34. క కష్టములువెట్టి తుదకు ని, కృష్టంఘ్రంజంపుజంపె ♦ కెడ పితినసుమీ—ఇందలితబ్బిబ్బులను దిద్దుకొందురుగాక!

6 పుట.

35. తక్కిన రాజులనందఱినిగూడ నడిగితి—అందఱను సాధురూపము.

36. నీవిక్రోధావేశముచే నిప్పుడు మరచితివి—ఱ—పై—

37. సూర్యుఁడుదయించినాఁడే?—పై—

38. క. మందేహులనెడి రక్కసు, లందఱినింమనిమిరక మది తనదేహం—పై— ఈ "యది" యెందులకువచ్చినయది! యతిభిక్షకుఁ గాఁబోలును!

39. చనియెడినడుగో—పై—

(40) (దృష్టినిగుడ్చి) అదుగో—తప్పు. "నిగిడ్చి" అని యుండు. బాలవ్యాకరణమురామినిట్టితప్పులుగలుగక మానవు.

41. (ఖడ్గము బారవైచి పరిక్రమించి) ఇదుగో—బాఱ

7 పుట.

42. అశ్వద్ధామనుగిశ్వద్ధామను—పై—

43. గీ. అతఁడు చిరజీవివివిధశస్త్రాస్త్రవేది—"అస్త్రశస్త్రవేది" అని ప్రయోగింపఁదగు. "అజాద్యదంతంపూర్వమ్" అను సూత్రము నెఱుంగునది. పూర్వనిపాతమున కనిత్యతనొప్పని యీ యాచార్యులు సవరించుకొనుట యుక్తము.

8 పుట.

44. కృపాశ్వత్థామలు నల్వురును—గ్రుడ్డివానిచేతి ఱాయి వలె నొకప్పుడైనను సూటిపడలేదు. వీరికిశబ్ద స్వరూపమే తెలియదు.

45. అదుగో ద్వైపాయనాశ్రమము—పై—

46. దృష్టినిగుడ్చి—పై—

47. వెదుకవలయును—పై—

9 పుట.

48. అదుగో యొక పిన్నసన్యాసి—పై—

49. కాదు కాదు అశ్వత్థామ—పై—

50. (అశ్వత్థామ ప్రవేశించును)—ఈసంధియెక్కడిదో?

51. (పండ్లుపటపటగొరుకుచు)—శకటరేఫముగొఱికఁబడినది.

52. ఉ. ని। ప్రాణులఁజంపి దొంగవలెఁ దాపసివై యిట కేగుదెంచితే—అపశబ్దము "తపసి" యనిగాని "తాపసుఁడు" అనిగాని యుండును.

53. (ఊరకొనును)—ఇది ప్రకృతి ప్రత్యయజ్ఞానములేక వ్రాసినది. "ఊరక+ఉండును" అనుదానికీపాటువచ్చినది.

54. గీ. గురుసుతుండవటంచూరకొందుమనుచు—ఇది పైయజ్ఞతను స్థిరీకరించుచున్నది.

55. మనమూరకున్నను ఈతఁడూరకొన్నట్లులేదు— పై—

10 పుట.

56. దేవ్పునై। గురువునునై యునుంగతిని—మొదటి యనుకరుణము తప్పినది. రెండవది వ్యాకరణజ్ఞానశూన్యతను దెలుపుచున్నది.

57. బ్రహ్మశిరంబు నరంపఁబూఁడె మహీదేవసుతుండు నించె— అస్త్రమునింపఁదగినదిగాదు. (చూ. శ. ర.)

58. దగ్గరనుండియు నిట్టిపని చూచుచు నూరకొంటివేమి— దగ్గఱ.

59. క. ఇప్పటికి నెన్నియుద్ధము। లిప్పుడమింజరిగె నెవ్వరేనియు దీనిం। గుప్పిరె— 'బాణములుగుప్పిరి' అని వాడుదురు. 'బాణము గుప్పిరి' అని విజ్ఞులు ప్రయోగింపరు.

60. సేనాయస్త్రముగ్రిమ్మరింతు—ముందు లఘు రేఫమును గ్రిమ్మరింపుఁడు.

11 వ పుట.

61. గీ. పనికిఁజొరనేని బీతులఁజెనకనేని—తప్పు.

62. ఇదుగో యుపసంహరించు—పై—

63. పరగుసుయోధనున్—పరఁగు.

64. లోకమిాశరము బాతికిఁ దాగుఱి గాకయుండుతన్—బారికి.

12, 13 పుటలు.

65. అస్త్రమును బ్రజ్వలింపఁజేయుచు—ఈయజాగళస్తనమేల?

66. ఉ. కర్ణుఁడు దుర్ణయుండగుచుఁగౌరవనాథునిఁబాడుచేసె— వృత్త్యనుప్రాసమువచ్చినదను సంబరమే, కాని పాపము! చ్యుతసంస్కారము నెఱుంగరైరి. "దురషత్వ" అనువార్తికము జ్ఞప్తికి వచ్చిన నీపాటురాకుండును.

67 విరమింపనెంచుకొన్నాఁడను—చేతికివచ్చినట్లు వ్రాయుదురు గాని నిశ్చితశబ్దస్వరూపజ్ఞానములేదు—పై—

68. ద్రుపదునాత్మజ నూరడిలంగఁబల్కుఁడు—పై—

69. ఏమునుబోయెద మిచ్చకచ్చుగా—ఏమి యన్వయాను గుణ్యము? వెఱ్ఱియర్థమును జెప్పుటకంటె దిద్దుకొనుటయుక్తము.

చ. విదురునియింట విందనుచుఁ బెట్టితి సంధిచెడంగ—ఈవాక్యము భ్రష్టమే.

14 పుట.

70. ధర్మరాజును ద్రౌపదియు బ్రవేశింతురు. వ్యాసాదులు నిష్క్రమింతురు—ఇది రెండవయంకమా? లేక రంగమా! పూర్వనాటకములయందుఁ దక్క నంకమధ్యంబునఁ బూర్వప్రవిష్టపాత్రముల నన్నింటి నొక్కసారిగాఁ ద్రోసిపుచ్చి, మఱియొకమేళమును బ్రవేశపెట్టుట సమయసిద్ధముగాదు. నాటకలక్షణమును వెక్కిరించుచున్న యిదినాటకమా? బూటకమా?

71. కృపాచార్యులైన బోధింపకపోయె—తప్పుదిద్దుకొనునది.

72. కృపాచార్యులు ప్రవేశించును—పై—

73. ఊరడిల్లుమూరడిల్లుము—పై—

15 పుట.

74. అన్నిఁటికిని భగవంతుఁడేమూలము—"అన్నింటి" అను రూపంబున నెఱనున్నయుండుటంజేసి "అన్నిఁటి" అనిరూపాంతరము వ్రాయు నీకవుల యాంధ్రజ్ఞానము పూజ్యము.

75. ఇట్లు వృథావిలపించెదమ్మ!—వృథా-ఇది యశ్వత్థామ వంటిది.

76. ఉ. ఆలములోని గురునాత్మజుఁడేమిటి కల్గఁగావలె—దీని కర్థమేమైనఁగలదా? గురుపుత్రుఁడాలమునలేఁడా? అప్పటికాలమే లేదా? ఈబీఱపీఁచు పాకము నెట్లో విడఁదీయుదురు కాఁబోలు! కానిండు చూతము.

77. చ. కుపితమనస్కుఁడై యితఁడు కోలుమసంగెను సైన్యమెల్లఁ—కోలుమసంగెను=మిక్కిలివిజృంభించెను. 'చంపెను' అను నర్థము లేదు. 'ఇతఁడు సైన్యమెల్లను మిక్కిలి విజృంభించెను' ఏమి యన్వయానుగుణ్యము ? 'వడపూపములు, దళదాడిమములు.'

16 పు ట .

78. దుష్కృత్యము నుగ్గడించుచున్నాడే—పై—

79. ఇదుగో యాతని శిరోరత్నము—సంధించెడినది.

80. నీప్రతిన నెరవేర్చుకొనుము—నెఱవేర్చు.

17 పు ట .

81. సా । ధ్యమయినవట్టుఁగామనలఁ దాకకయే బవరం బొనర్చె—అయినంతపట్టు. ఏమియుందోఁచకున్నపుడు వీరికిఁ 'దా' ప్రత్యక్షమగుచుండును.

82. తాకకయే—ఇందరనున్నగలదు.

83. ఇట్టియుత్తముఁడు తటస్థమానె ?—"తటస్థుఁడాయెనె" అని దిద్దుకొనునది.

84. ఒకరా యిద్దరా, అయిదుగురు కొమరులు—సంఖ్యావాచకము నిత్యైకవచనాంతముగాన 'ఒకఁడా' అని యుండును. ఇద్దఱా.

18 పు ట .

85. నాలుగుఱుకొమరులు వ్రాయిన—తప్పు. నాలుగురు.

ఇది శ్రీవేంకటరామకృష్ణ ప్రయుక్తమగు శతఘ్ని

ప్ర థ మ గు ళి క .

# శతఘ్ని.

## ద్వితీయగుళిక.

చదువరులారా! వినుండు. మా వృద్ధకవులు:—

శా. కాఱుల్ వల్కిరి; కల్ల లాడిరి; యసత్కల్పంబులన్ వ్రాయఁగాఁ
బ్రారంభించిరి మాఱువేసముల; సైపన్ వచ్చునే? వారి దు
ర్వారాటోపవిజృంభమాణకుకవిత్వప్రాభవోద్రిక్తని
స్సారగ్రంథనిబంధనమ్ముల యథేచ్ఛన్ జించి చెండాడకే.

తొలుదొల్త మేము నూఱుతప్పులను మాత్రమే చూప నెంచి 'శతఘ్ని' యను నామముతో నీ గ్రంథముఁ బ్రారంభించితిమి. 'దోసములగని' యనఁదగు నీ నాటకమునందు మా తలంపు మొదటి యంకమునందే నెఱవేఱినది. కొండొకచో రెండేసితప్పుల కొక యంక మిడకున్న నెనుబదికిఁ బైగా లెక్కఁబడిన యీ తప్పులు శతసంఖ్యను దాఁటినవియే. అంత 'నిఁక ముందెట్టి దోసము లుండునో చూత' మను నొక విశేషాభిలాష వొడముటయు మేము మఱలఁ దక్కిన యంకములఁ గూడఁ బరీక్షింపఁ దొరకొంటిమి. ఇప్పుడు 'శతఘ్ని' యను పే రన్వర్థము గాదని తలంపవలదు. 'శతం సహస్ర మయుతం సర్వ మానంత్యవాచక' మ్మని యుండుటఁ బూర్వోక్తనామము సంఘటించునదియే. ఇందౌచిత్యప్రధానము లగు దోసములు ప్రథమపరిగణనీయములే యయ్యుఁ బేర్కొనఁబడలేదు. వానిఁగూడ వ్రాసిన నిదిమఱల నా భారతమంత కావలసివచ్చును. సజాతీయము లగు దోసములు రెండుమూఁడుసార్లు లెక్కించుట పూర్వోక్తదోషనిర్ధారణార్థ

మని యెఱుంగునది. ఇఁక ముందు పూర్వాగుల్ల క్తదుష్టములు కొన్ని గణింపకపోవుట గ్రంథవిస్తరభీతిచేతనే. విశేషము గోరువారు (దేవీ భాగవత) దోషసహస్రము నరయఁ బ్రార్థితులు.

19 పుట.

1 ఆయభిమన్యుఁ డిట్లనే। యయ్యకునమ్మకుంగడుపునందు—'ఇట్లే' అని యుండును. 'ఇట్లు + అ + ను + ఏ' అని యొక వెఱ్ఱిచ్ఛేదము సేయుదమన్నను ఏవకారార్థకములగు అ, ఏకారములు రెండేల ? సముచ్చయనుకార మెక్కడకు ? పాశ్చాత్యులు 'ఇట్ల' అట్ల' అని పలుకుదురు. అది ద్రుతాంతమనుకొని వీరిట్లు తప్పిరి.

20 పుట.

2 'సర్వేజనాస్సుఖినోభవంతు' అందఱును సుఖముగా నుండవలెనని యెవరు కోరుదురో—ఈ రచనాచమత్కార మెక్కడిది ? ఇది నాటకనిర్మాతల ఫక్కియా ! లేక వ్రతకల్పముల కర్థముసెప్పు గ్రామపురోహితుని ఫక్కియా ?

3 సీ। త్రెల్లినవార్తవింటిఁ గడ తేరితిఁ జచ్చితి—శకట రేఫము గడ తేఱినది.

21 పుట.

4 ద్రుపదాత్మజాత నన్యాయముసేయఁగాఁదగదురా—ఈనకారద్విత్వ మజాగళ స్తనము.

5 గీ॥ తెల్లమాయె వృథామాట ధీరులనరు—వృథా.

6 వృథాగ్రహముల్ తుది ముప్పానర్పవే—పై—

22 పుట.

7 వ్యాసులు ప్రవేశించును—పై—

8 తామిద్వారిం దేర్చి యనుగ్రహింపవలయు — ఇదితప్పు. దీని వివరణము దోషసహస్రిమందుఁ గలదు.

23 పుట.

9 వంశపుం! గురువగు ద్రోణుకన్న ననఁగూడదుగానియొరుల్ వలంతులే ?— ఈ వాక్యము విరామశయ్యామాత్రపూరకమును, విపరీతార్థప్రదమును.

10 ఉ॥ఐదుగురైదుగుర్గలిగియట్లనయుండిరిసోదరాత్మజుల్ — పై

11 ఒం! డొరులునశింతురే ? కడుపులొక్కటఁ గాలిన నన్నద ముత్రలై— ఈతబ్బిబ్బు దిద్దుకొనునది.

24 పుట.

12 ఆత్మవిఘాతృకత్వముల్! దెచ్చునెసద్గతిఁ, వలదే ? లేఁకువ— 'విఘాతకత్వముల్' అని యుండఁదగు. "లవపతేత్యాదినా ఉక ఇణ్"

13 ఇయ్యెడ వృథావిలపించెద రింతయేటికిఁ — పై— ఈ శబ్ద స్వరూపము వీరికిఁ దెలియదనుట కింక వ్రాయనక్కఱలేదు.

25 పుట.

14 ఎందటికీవుతండ్రివో మఱెందటికిందనుజుండవో— 'ఎందటికి' అను రూపము దుష్టము. 'ఎందఱకు' అని దిద్దుకొని దానితోబాటు 'రాజసుండవో' అను నర్థమిచ్చు 'దనుజుండవో' అనుదాని నిగూడ సవరించుకొనుట యుక్తము.

15 చిందరవందరఁజేయ నాయమే—తప్పు, చిందఱవందఱ.

16 ఎప్పటికప్పుడే మరచియీగతి—పాడగుచున్నది.

17 కులానఁగళంకునించు న! కొడుకులు గొడురు లే—ఇది విశ్వామిత్రసృష్టి. 'కళంకము' అని యుండు. (చూ. శ. ర.)

26 పుట.

18 విదు. మనముగూడ నయ్యెడకుఁ దక్కుంగలజనులతో నరిగి యొకసారి చూచి యుచితక్రియలు నిర్వర్తించుటయే కర్తవ్యము. (నిష్క్రమింతురు)—గాంధారియు ధృతరాష్ట్రుఁడు విదురుఁడు వ్యాసుఁడు రంగము శూన్యముగఁజేసి యొక్కసారి నిష్క్రమించిరి. పిదపఁ బాండవులు కృష్ణసహితముగఁబ్రవేశించిరి. ఇదివిష్కంభమా: కాదు. విష్కంభమునందుఁ బ్రధానపాత్రప్రవేశ ముండరాదనునంతవఱకు వీరలకుఁ దెలిసియేయున్నది. అంకమధ్యమున సర్వపాత్ర నిష్క్రమణము గూడ దోషమని యింకముందు తెలిసికొందురుగాక !

19 మోమోట మొకింత దక్కి ముది తొక్కల—ఇదియును "కళంకు" వంటిదే. "ముదివగ్గుల" అని సవరించుకొనునది.

20 సైన్యముఁ । బొచ్చెముమైవధింపుటకుఁబుచ్చినదుర్మదు—వధించుట. ఇది యాంధ్రవ్యాకరణజ్ఞానప్రాగభావమును దెలుపునది.

21 దు। శ్చరితులుచచ్చియుఁ బగఁబిశాచములైకనఁజేతురు—'చేతురు, కోతురు' ఇత్యాదు లసాధువులని యెఱుంగునది.

ఉ. చేతురు పోతు రంచుఁ దమ చేతికి వచ్చినయట్టిరీతిగా
బూతులు వ్రాసి భాగవతముఁ రచియించితి మంధ్రభారత
ఖ్యాతి నెసంగు నిద్దని జగంబునఁ జాటినయంతమాత్ర వి
ద్యాతిశయంబు గల్గిన మహాశయు లౌ నని సమ్మతింతురే ?

దోషసహస్రము.

27 పుట.

22 క॥ తల నెరసినంతనే పెద్దలె?—నిక్కమే. తల నరసినంతనే పెద్దలుగారు. విశేషజ్ఞులు వృద్ధులనంబరఁగుదురు. 'న తేన వృద్ధో భవతి। యేనాస్య పలితంశిరః। యోవాయువా ప్యధీయానః। స్తం దేవాః "స్థవిరం" విదుః.

28 పుట.

23. కృష్ణ—(దృష్టినిగుడ్చి) ధర్మనందనా! అరుగో విదురధృత రాష్ట్రు లిట వచ్చుచున్నారు—ఇది తప్పు. 'నిగిడ్చి' అని యుండును. బాలవ్యాకరణముపఠించునది.

24. విదు. అన్నయ్యా! అదేపాలికలను దగ్గరకు వచ్చినార ము—దిద్దుకొనుఁడు.

25. శా. ఐదూళ్ళనియుఁజాలునంచుహరినీవంపింపఁగాలేదే?— ఎవనిచేనంపించినాఁడు? అంపఁగాలేదే? అనుఁడు.

26. తండ్రీ! నీ। వేదిక్కేమని నిన్నుఁగూడఁజెలుప న్నెంతునో పుత్త్రికా! —సంధిజ్ఞానములేమి యతినడపులపాలుసేసిరి. "లుక్సంశ్లేషానాచి" అని శబ్దానుశాసనమూల సూత్రము.

29 పుట.

27. ధృత—నాయనా! ధర్మనందనా! భీమన్నయేడోయి ?— "ఏడనోయి" యనిసాధురూపము. పీరుకళలెవ్వియో ద్రుతప్రకృతికము లెవ్వియో తెలిసికొని మఱి కబ్బముచెప్పిన బాగుండును.

28. క. క్షితియెల్లను నెుక్కటైనఁ జేసెడిదున్నె—విభ్యాదుల లోఁజేర్చుటకంటె దిద్దుకొనుటమంచిది.

30 పుట.

29. గీ. అన్నకన్నను బలవశులవని లేర। యనుచుననుకొంటి— ఇదిగ్రామ్యోక్తి. "బలవంతు" లనినచో బాగుండును.

30. దు। ర్ధీమహితున్ మదగ్రజుని బేరిరణఁజేసి పరామృశింపఁ గా—ఇదిగుణములేమిఁజెడినది. వెంకయ్య వ్యాకరణము విడిచి బాల వ్యాకరణముఁ బట్టుదురుగాక!

31. భగవంతుఁడెట్రిఁగి గుడ్డివానిఁగాఁ జేయఁబట్టెగాని—గుడ్డివాఁడుగా నని సవరింపుఁడు.

31 పుట.

32. ఉ. భూమినిబుట్టిచుట్టరికమున్ మము బోటులతోడ— తప్పు. వ్యాకరణము! వ్యాకరణము!!

33. మ. ఎమటంజెప్పఁగరాదుగాని యితఁడేపృథ్వీభరంబోక్కటా।—తప్పు—పై— ఇట్టివికవులకశ్లీలములా.

34. మొక్కఁదగున్ వాఁడనుకోకుమీతఁడుజగత్కల్యాణ శీలుండు మొక్కఁదగున్ వాఁడును—వెనుకనొకచో "అనుంగతి" అనివ్రాసిరి. వహ్వా! ఇప్పుడు 'తగున్ వాఁడు' అనివ్రాయుచున్నారు. ఈదుర్గతమేయబ్బాయి నాయఁడుగారివ్యాకరణము వలన సిద్ధమగునో? "వాఁడు కృష్ణుఁడు మొక్కఁదగుఁ అనుకోకుము." అనియొకయాభాసాన్వయముఁజెప్పరుగదా?

32 పుట.

35. ఉ. మున్నొకసారిఁ జూచితిని ముద్దులుమూటలుగట్టఁజాలునీ। యున్నవహరూప—"అల్పరూపము" అని యర్థము. "విశ్వరూపము" అనునర్థము రాదు.

36. దయయుంచుము భక్తపరా! పరాత్పరా!—ఇది దుష్టము. సంస్కృతజ్ఞానములేనివారిది యేకపదమనుకొనియుఁ మఱికొంద అంతర్మఖు 'లలుకన్నమాన' మనుకొనియు వాడుదురు. పరాత్—పరా.

37. ఒక్కసారి దగ్గరగాఁ దీసికొనిపోయి చూపింపుము—ఒకచోనైనను దిన్నఁగాఁ బడలేదు.

38. చ. విరిగిన తేరులా! యివి, భువిఁ బడిపోయిన గారుబారులా! — శకటరేఫము విఱిగినది.

39. సురిగిన తూపులా! — అరసున్న సురిఁగినది.

33 పుట.

40. నా। దౌర్భాగ్యమకాక నీకురిపుల్గాన్నా? గడ్డిపోచల్గదా! — అరసున్న లేమి గడ్డిపోఁచలే.

41. ఉ. అన్నప్రతిజ్ఞఁదప్పుటకునైచనియే బ్రతిమాలుకొందు — "క్రేవాంగు"లన్నట్లున్నది. "బతిమాలు" అనిసాధువు. (చూ. శ. ర)

42. ఉ. ఒక్కరో యిద్దరో శతముసొక్కమొగిఁ బలియిచ్చి — ఈమూఁడు తప్పులను దిద్దుకొనఁదగు.

34 పుట.

43. రణముత్సంరంభపరాధిఁగఁ జూచి — పై —

44. నిష్కృతిపనమ్మిఁక లేదుగదమ్మ యెమ్మెయిఁ — ద్వితీయచతుర్థవర్ణజ్ఞానము లేదు.

45. భవత్సుతుండు ఘు। ష్టరమునవల్వాలొల్చుతఁజిఁ — 'ముష్కరతను' అనియుండును. 'ముష్కుఁడనిధర్మము ముష్కరత' అనియెఱుంగునది.

35 పుట.

46. ఉ. కూ। కటివేళ్ళఁద్రోఁడఁ గుఱుకోటికుఱుట్పటలిఁ — కోటి, పటలి రెండేల? కుఱుట = వృక్షము. ఎంతచక్కనిపదము పయోగించినారు! ఈనాటకమునకుఁ దగియే యున్నదిలెండు!

47. భరంబటంచేఁ దలపోతు — తప్పు — పై —

48. కృష్ణు. (లేనిసంతోషముతో) అత్తా! నీవునాకుశాపమిచ్చినను—దీని నన్వయించుటకెన్ని పదములధ్యాహార్యములు కావలయును "సంతోషము నభినయించి" అనుటయుక్తము.

49. శాశ్వతమ్ము। గానిలుచువా<u>రలంచు</u>జగానఁ గలరె? —ఈ యాంచునకుఁ దరిలేదు.

36 పుట.

50. అంజలినినోదార్చి యుచితక్రియలు నెరవేర్పఁ బోవుదము—పై—

ఇది శ్రీవేంకటరామకృష్ణ ప్రయుక్త శతఘ్ని
ద్వితీయగుళిక.



# శతఘ్ని.

## తృతీయగుళిక.



చదువరులారా! వినుండు! సింహావలోకనన్యాయంబునఁ బూర్వోక్తదోషములు కొన్ని పద్యరూపంబున మఱలఁ జమత్కరింపఁబడుచున్నవి.

సీ॥ తద్ధితజ్ఞాన మింతయును లేదని యొత్తి
పలుక "నశ్వద్ధామ" ప్రబలసాక్షి
ఆగమధీ పూజ్యమని చెప్ప "మ్రొక్కఁద
గుఱ వాఁడు కృష్ణుండు" గొప్పసాక్షి
ధాతుపాఠము విస్మృతంబని నిష్ఠించి
యన "దుర్ణయుఁడు కర్ణుఁ" డధికసాక్షి
దురితకళావేద మధోగతం బని పల్క
"భీమన్న యేహోయి" పెద్దసాక్షి
గీ॥ వచనహానికిని సాక్షిగా వలయునేని
"గ్రామ్యులంతఁ బ్రవేశించుఁ" దలఁప నిట్లు
సరసతిరుపతివేంకటేశ్వరులఁ దెలుప
భారతమ్మంతయును సాక్షి భావమందు॥

ఇట్లే యీ నాటకమునం దెన్నియేని బూటకములు గలవు. వానినన్నిటిని లెక్కించుటకు మాకును జదువుటకు మీకును విసుగగు

చున్నది. కావున నిఁకఁ బుటకు రెండేసి మూఁడేసి తప్పులు మాత్రి మీఁక్రిందిపట్టికలో వ్రాయుచు నీగ్రంథమును ముగించెదము. కొన్ని దోషములకు మాత్ర మించు శిక్ష వ్రాయుదుము. తక్కినవి సుగమములు.

37 పుట.

1. ఎగిరిమీఁదఁ । బడిశపించునుగాని దు ర్వానులకట । కొం పలీఁతకుఁగాక తా గుంతికేల—(1) వచనచ్యుతి (2) పరిహాసనపు మాటలు (3) పాదపూర్తి పరదేనఁతా'.

2. పోనివచ్చినవాఁడను రానేవచ్చినాను—రెండుతప్పులు. బాల వ్యాకరణము చదువమిఁగలిగినవి.

38 పుట.

3. సూతతనూజునిగాఁగఁ జూచు స । ర్వాతిశయుండు సోదరుఁడౌ —ఇక్కడ నీద్వితీయ కేవలము దుష్టము. మఱియొకచోనేని " ఔపదే శిక ప్రాయోగిక యోరాపదేశిక స్యైవగ్రహణమ్. " అనుట భావార్థక యోగంబునఁ బ్రథమయే కర్తవ్యము.

39 పుట.

4. మున్నరికంపుమాటల సముద్ధతిఁజూపితిఁ బాపినైతినా । య న్నయటంచు—మున్నరిక= " ధైర్యము " సాధువు. వృద్ధకవుల మత ముచే " కంపు " అనుచో నశ్లీలము.

5. నా । యన్నయటం చెఱుంగక మహాత్మ ! కదుం జెడిపోతి నింతకుఁ—పై—

6. మా । యన్నయజాతశత్రు గని నప్పటికన్నను—జడంబు గామి " అన్న " అనుప్రథమ ( అజాతశత్రుఁ' అను ద్వితీయతో న న్వయింపదు.

7. సభామధ్యమున నన్ను (నెకసక్కెపుమాటల) గేలిసేయ న దియేమో—కుండలిత మక్కఅలేదు. పునరుక్తి.

40 పుట.

8. బ్రిహ్మాదులుదా ! మేరుపరచిరిట విఘ్నము ! నారదుఁడొ నరించెననుచు నాపైఁబడదే—(1) 'ఏరుపరచిరి'. తప్పు. (2) 'అను చు' వర్తమాన ప్రత్యయమనన్వితము.

9. కుంతీమహాదేవియా ! జ్ఞస్నికేమును మున్న భార్యయగు పాంచాలిక గురుప్రోహితే—ఇది యసందర్భము. 'కుంతీదేవి దాని మీఁగేవు రుపయోగింపుఁడని కొడుకుల నియమించి' అని భారతము. అప్పుకర్ణుఁడాపె మదిలోనేనిలేఁడు.

41 పుట.

10. గీ. నాకొక్కకప్పుడు మనమునసూహ సేతు—పై—

11. ఉ. పాతకినైతిముక్కు తెగబారెడు చేసితి నిక్కమచ్యు తా!—పరిమాణార్థకమగు 'నెడు' లో నర్థబిందువు గలదని యెఱుం గునది.

42 పుట.

12 గీ. కోరి బ్రణిమాలిరాధతోఁ గొంతచెప్పి—పై—

13. మీరు "రాజ్యమువదలి యరణ్యమునకుఁ బదుం" డనిన —ఇది గ్రామ్యక్రియ. (చూ. బా. వ్యా)

14. ఉ. అన్నగదా మనందఱికి నాతనిమాటకు నడ్డువారమే— పై—

43 పుట.

15. ధర్మజుఁ డించుక దూర—పై—

16. "నేను గపటముగాఁ గర్ణునిఁ జంపించినా" నని—పై—

44 పుట.

17. శిశు వెక్కడ నేని యరాకొట్టునా? యరాకొట్టునేయనుఁడు—ఇది సర్వత్రి పాడైనది.

18. చిగురుసంగతికి నేను త్తరము చెప్పఁజాలను—నిజమే.

19. గీ. అతని కతమునఁ బుడమికే యడరుగల్గు?—అడరు=ఆధిక్యము. ఇది యిక్కడ సరిపడదు. ఎడరు=భంగము; ఇది తగునుగాని యతి సెడును.

45 పుట.

20. వచింపలేము కా! నీ వినుమొక్కమాట యెదియేనియు—కానీ. ఇది కానియొక్క రూపము. వడి సెడినది.

21. కడచినదానికిఁ వగచి కార్యము లేదు—'వగవ' అనిన నర్థవంతమగు.

46, 47 పుటలు.

22. ఆమెయుఁ బుట్టెకుదుఃఖములో నున్నది—పై—

23. గీ. దానిపై నిన్నికష్టముల్ దాపరించి—'దాఁపరించు=దాఁగిలించు.' శబ్దము చెడినది. అర్థము కుదిరిగివది కాదు. ఇంకేమికావలెను?

24. గీ. కడువిర క్తిని నన్నుకారడవి కేగ—పై—

25. నే నెక్కడ యాతఁ డెక్కడ? యినీ—ఏమిసంధివివేకము! ఇది ప్రైమరీపరీక్షలోఁ గృతార్థుఁడు కానివానికిని దెలియునదే. "ఏనెడ నిందాత్రను లేడ" భారతము.

48—53 పుటలు.

26. 'వట్టిపినాసి' వీఁడనెడువాడెటు నేమెడఁ గట్టికొందునో—'పినాసి' ఇది యపశబ్దము.

27. అంత నొకపురుషుఁడు ప్రవేశించును. 'ఇదుగో' యని ఉత్తరమిచ్చును—పై—

28. ద్రాప. (తనలో) అమ్మయ్యా! ఇప్పటికి బ్రదికితిమి—అమ్మయ్య, అయ్యమ్మ ఇవి యనాకరములు. (మూ. శ. ర.)

29. అర్ధరథునిజేసి యవమానపఱచి—పై—

30. విన్నను దరుగవు—రెండుతప్పులు.

31. ధర్మ- అట్లనే యొనరింపుము—పై—

32. ఎ। ట్టిట్టులునేరి నేరిఁదనియింపుటయొప్పగు

54 పుట.

33. ఎక్కడికేగిరన్ శిశువులే నృపతుల్ కవితారసాయనం। బె క్కడ? కల్జలెక్కడ! యిసీ యిటులందఱిరాజులన్—ఇందు మూఁడుతప్పులు. (1) ఎక్కడికి (2) ఎక్కడ యిసీ. (3) అందఱి. ఇవి యజ్ఞానవిలసితములే, ముందు ముంపు కనుఁడు.

34. చ. కృతయుగిమాది నిప్పటికి నెందఱురాజులుగారు

55 పుట.

35. ఇంతటిరాజు లేనేలేఁడు

36. ఇక్కడికిఁ బద్యముకుదిరినది. రిక్తహస్తములతో రాజుం జూడఁగూడదు. (వృష్టినిగుడించి) అదుగో!—రెండుతప్పులు.

37. వర్త. ఏమయ్యా? పిల్చినావు—ఇది నిక్కానాము జాతిలోనిది.

38. వర్త. ఇదిగో కొనుండు—పై—

39. ఇంతమంచివారెక్కడను లేనేలేరు—పై—

40. కవి. ఏమి యెక్కడికివెళ్లినారు—పై—

41. కవి. ఇక్కడికి వచ్చినను మన దారిద్ర్యదేవత వెంబడినేవచ్చినదే—పై—

42. నాకీఫలము లక్కరలేదు—పై—

56 పుట.

43. ఏ। యాపదలేక భూమిప్రజలందఱునుఁ సుఖమందుచుండిరి—భూమిపదలక్ష్యార్థమును «ప్రజలందఱు» అని వాచ్యముచేసియుఁదనియక వేసిన సముచ్చయద్వయము వ్యర్థము. దీనిఁ «పునరుక్తిమాలిక» యనిచెప్పవచ్చును.

57—62 పుటలు.

44. ఇ। య్యాక్షుని నిట్లొనర్చితినహా! మము నిర్వారదూరు టొప్పగుఁ—ఒప్పుగాదు. తప్పే.

45. ఉ. చక్రముకేలఁ గైకొని విశాంపతులందఱిసీయిసీయిసీ। యక్రమమఁచుదూర— ఇది చామకూరవెంకన్న శిరసావహించు ప్రయోగము. దానింబట్టి యిట్టియతిచారములు పండిత సమ్మతములుకావు.

46. సహింపఁగలమా? దయయుంచు మటంటి—పై—

47. గీ. «మీరలుండి» రనెడి కారణమ్మునని—మీరలకుఁ బ్రథమపురుషప్రయోగము గూడునే.

48. మాన్యత నీవంటిమేటి మానిసులేరీ— «ఇదుపోత్తమోత్తమానాం» అను సూత్రముఁ జదువుకొనునది.

49. ననుజ్ఞ। గొంటి నాపరమున నెందుఁ గొదువలేదు—పై

50. పోయెద దయయుంచు పురుషపుంగవ స్వాహారీ?—
న్య చకారంబుల ' కనుసూత్రము నెఱుంగుననెమోషదే.

51. విదు. (అట్లనేచూచి) ఓహో! — పై.—

52. వ్యాసులు ప్రవేశించును——పై——

63 పుట.

53. కృష్ణు- అదేభాగీరథీతీరము. మనమందఱమును నిప్పట్ల నప్పరమపావనియందు స్నానంబొనర్చి యిమ్మహామహుని కనంతరకృత్యములు నెరవేర్పనుంకింప వలయునటుచనుండు. (అనిపరిక్రమింతురు.) (గంగ ప్రవేశించును.) ఇట్లువీరందఱు పరిక్రమించి గంగయొద్దున కేగుట యు గంగ ప్రవేశించినదనికదా యిందుఁజెప్పఁబడినది. చూడుఁడు! 67పుటలో «కృష్ణు- మనమిఁక నిమ్మహాభాగునకు నుచితకృత్యములు నెర వేర్పభాగీరథికింజని స్నానమ్ములాచరింపవలయును. (అని అందఱునుని ష్క్రమింతురు.) ఈవాక్యముపై దానికెంత సంబంధించియున్నదో? అందే గంగానిష్క్రమణ మెంతచక్కఁగ జరిగినదో! కనుఁగొనుఁడు. అందే «తండ్రీ! విదురా!" యని వ్యాసుఁడు విదురవృత్తాంతమును జెప్పఁగ డఁగుటకాయన నెవ్వరు ప్రశ్నించిరో? తెలియుఁడు!

63—66 పుటలు.

54. ప। మనివగతుఁగొంతి కొడుకే। మనినిన్నువధించె—
‹ కుంతీ ' శబ్దభవము «కొంతి" యని వీరికిఁ దెలిసినది.

55. హరశిష్యుండైన జామదగ్న్యునికన్న—యతి యడవుల పాలయ్యె. « అగ్న్యు " యనివిడదీయ నాధారమెందున్నది. ?

56. కృష్ణు. దేవీ! విష్ణుపాదోద్భవీ! —నందనాశబ్దము తప్ప నుకొన్న యాచార్యులు «శుద్భవి" అని వ్రాయుట వింతకాదు.

57. అదినీవు గుఱుతింపఁగలవా ?—పై—

58. ఎట్టిపాతకుల నేనిఁబవిత్రులఁ జేతువెమ్మెయిన్—పై—

59. పంచమాంకము—ఈయంకమందు చరిత్రమున్నను నాయకుఁడగు యుధిష్ఠిరుని ప్రవేశములేదు. ఇది నాటక సాంప్రదాయమును వెక్కిరించుచున్నది.

68 పుట.

60. గ్రామ్యులు ప్రవేశించును—ప్రథమకబళే మక్షికాపాతః.

61. అందఁగలపాతరలన్ బెకలించి—రెండుతప్పులు.

62. యాగమునొనర్చుట , కొదువింకమీఁదటన్

63. కొదువయేమి? మను తిచ్చెఁ గొల్లగాఁగ—శబ్దస్వరూపము తెలిసినదికాదు.

64. ఇప్పటి సుకృతమామరుద్భూపాలునిది. "తప్పర్వమరుద్భ్యామ్" అను వార్త్తికము తద్ధితలలోనిది. వీరు తద్ధితలుచదువనివారు. అశ్వత్థామ మరుత్తులుతద్ధితాద్యంతాపరిజ్ఞానమునకుసాక్షులు.

69—72 పుటలు.

65. ధర్మరాజుగారి యెదుటను—ఔపవిభక్తికజ్ఞానము సహాధ్యాయిత్వానుగుణముగానే యున్నది.

66. గృహాసనంబులగ నప్పటప్పటకి.

67. ఎక్కడేమగునో? యెవ్వరెదురుకొందురో ?

68. పిలువనంపింప వచ్చితి పిలుపుగొనుఁడు—ప్రేరణాద్వయము వ్యర్థము.

69. బందుగులంచుఁ బల్కితివి బందులుగారె ? సుయోధనాదులు— ఇది వెఱ్ఱివ్యాకరణజ్ఞానము.

7౩ పుట.

70. బాలకుఁడవయ్యు మెచ్చంగ వచ్చునిన్ను—ఇట్టి యసందర్భవాక్యములింకు పెక్కులు!

71. బాలకుడనంచు నన్నేలగేలిసేసె?— ఇది పైదానికిఁ దోఁబుట్టువు.

72. యజనమఃటులుంచు మిప్పుడీ యాజిచూడు.

74—80 పుటలు.

73. చూడరమ్ము బవరమేడ పొమ్ము.

74. (దృష్టినిగుడ్చి) అదుగో—పై—

75. రథమునుమాత్రము నురుముచేసినాఁడు—పై—

76. అశ్వమునువీడి యసుగుమా? యపులకనఘ!

77. పెదవి విరచి.

78. రా। టూసనుఁడు లేకున్నకొదువ—పై—

79. అరయనైతి। తరుణినన్నెంతదూరునో? —పై—

81—92 పుటలు.

80. “ పుత్రాదిచ్ఛేత్పరాజయమ్” గనుక, అదుగో తండ్రిగారు —పై—

81. భీము. ఈమె యెవరో?—పై—

82. ధర్మ. దేవి! చిగురుమాట నీవువింటివికదా?—ఇందుఁ బీఠికమొదలు “చిగురు” అనియే యగార్థమునఁ బ్రయోగింపఁబడినది. చమత్కారాతిశయములేని యిట్టిపట్టులఁ బ్రయోజనములేక లాక్షణికార్థము సెప్పుట హాస్యాస్పదము.

83. ఇంతకు మాయిరుపురికిని రణము.

84. ఇదుగో యాశీర్వచనము—పై—

85. ఒక్క రేకాదు యిరువురును ద్రెళ్ళవలసినవారే—పై—

86. ఒకరిశక్తి నొకరు పరీక్షించుకొనుటకు.

87. దాచుచున్నావు.

88. పరివర్శింపుచుంటివి. ఇది వెంకయ్యవ్యాకరణ జ్ఞానమే.

89. నన్నక్కడికి—పై—

90. అదుగో కొమరుఁడు ఇదుగోనాధుఁడు—పై—

93—104 పుటలు.

91. ధర్మ. దేవీ! యూరడిల్లుము. ఎందేని సరిగాలేదు.

92. ఇక్కడికిఁ గొంత తేలినది—పై—

93. గీ. ఒక్కవసునంశమగు భీష్మునోర్చుటకుఁ ద । రంబుగా దయ్యె మునుసమరమున మనకు । నట్టివారేగురట—ఏగురనఁగా నేడుగురుఅని యర్థమురాదనియు వసువులెనమండ్రు అనియుఁ దెలియునది.

94. క్షమాపణ కోరుకొనుము—ఇది నింద్యగ్రామ్యము.

95. అరిగెఁదురంగమమ్మ వెనుకర్జనుఁడు—ఆహా! సంధిజ్ఞానము!

96. నకు-దేవీ! అసహాయశూరునకు సహాయమొందులకు?.

97. రక్కసుల బారిఁ జిక్కకుంటహాళక్కి—ఇది హాళిక్కి.

98. ద్రౌప. అమ్మయ్యా! ఇక్కడికి బ్రతికితిమి.

99. హింసజరుగకుండ నెరవేరినది—పై—

100. భీము. చిన్నవాఁడైనను దాత తండ్రిపేరు నిలుపక పోలేదు.

101. అన్నరానేవచ్చుచున్నాఁడు—పై—

102. అట్టులుంచుము.

103. హా! కుఱుగల సభనవమానము! పఱపఁడె?—పై—

104. అబ్బె మీకెల్లరికిని—పై-

105. ఇది శ్రీకింకపేందవ్ర.

చదువరులారా! క్రమముగా విసిగి పుట కొక దోషమును మాత్రమే యీపట్టికలో వ్రాసినారము. మొదటినుండియు నాత్మ స్తోత్రపరనిందాపరాయణులై నన్నయభట్టీయాద్యాంధ్రగ్రంథములఁ బఠింపకుండుటయు గాసటబీసటగాఁ జదివిన సంస్కృతవ్యాకరణంబేని సమయానుగుణముగా నుపయోగింపక పోకడఁబెట్టుకొనుటయు మేమే కవులమను నహంమతిఁ గొని కొందఱఁ బండితులఁ గేలిసేయ జగత్ప్రాజ్యులగు "వీరలెవ్వరో నేమి" యని యూరకుండుట నది యాత్మప్రభావస దృశంబే యని విఱ్ఱవీఁగుటయు వీరిగ్రంథమునం దిన్ని దోసములు గలుగుటకుఁ గారణములు గా నున్నవి. మాకవితలో నెల్లెడఁ జక్కఁగా నున్నవయ్యు నర్థానుస్వారశకటరేఫము లొకానొకచోట లేఖకప్రమాదమునన వ్యత్యస్తమ్ములుగాఁ బడుటయు నరయక వీరు పెడమొగమ్మున మమ్ముఁ బరిహసించినవారగుటచేతను వీరే రచించిన పూర్వశాకుంతలవిమర్శనమునందు "వ్రాయువారికి శకటరేఫ మేదియో నెచ్చట నర్థానుస్వారములుంచవలయునో తెలిసినంగదా ముద్రాపకులు పాడుచేసినారని వ్రాసికొనుట. ముద్రాపకులు మనము వ్రాసి యిచ్చిన యక్షరములను గొంచె మెచ్చుతగ్గుగఁ గూర్తురుగాని శకటరేఫముల

ను, అర్ధానుస్వారములను మనమున్న గ్రామమునసనే నిలువనీయము నువారి వ్రాఁతలో నెక్కడనుండిసంపాదింతురు? "తెనుగు" ఇందర్ధబిందు వేలలేదో ? "ఆరంకములు" ఇటశకట రేఫ మెందులకుండదో ?" అని వ్రాసి యందుఁ దమకుఁ గల యసాధారణపాండిత్యమును వెల్లడించి నవారగుటచేతను నిందు గురు రేఫార్ధబిందు భ్రంశములు పెక్కులు చూపఁబడినవి. అవియును దక్కిన చ్యుతసంస్కారదోషములునిందేకాక వీరిలో రెండవకవిచే వ్రాయఁబడిన పాండవజననప్రవాసాదులయందు నెక్కుతీరుగనేయున్నవి. పండితులు పరికింతురుగాక! పూర్వశాకుంతలవిమర్శనమునందే మీరు "ఇవి యచ్చుతప్పులు కాఁగూడదా? అని తాము శంకింపవచ్చును. అందులకు సమాధానము వినుఁడు. ఏదేని యొక పద మనేకస్థలములయం దొక్కటేతీరున నచ్చులోఁ దప్పు పడదు. అనేకస్థలముల ననేకవిధములుగాఁ దప్పుపడినచో నచ్చుపొరపాటని మనము నిర్ణయింపవలయును. ఇదిగాక శుద్ధాశుద్ధపత్రికయున్నది గదా ? అందేలదిద్దలే" దని వ్రాసినవారగుటచేతను, శుద్ధపత్రికయందుఁ దెలిసినంతవఱకు "23-2 కుగా- కుఁగా, 44-17 మర్ధిం-మర్థిం" అని ద్వితీయచతుర్థవర్ణవ్యత్యాసమును సర్ధానుస్వారాదికమును సవరించుకొనియున్నవారేయగుటచేతను నేఁడు వేఱొక లాగునఁ జెప్ప సాహసింపరని తలంచెదము.

పాండవజనన, ప్రవా, సాశ్వమేధములు మూఁడును కథాప్రవచనమాత్రవిశ్రాంతములై నాటకలక్షణమున కందక, సంస్కృతాంధ్ర వ్యాకరణములకు లోఁగక పాణిగృహీతాప్రబంధమువలె యథేచ్ఛావిహారములై యున్నవి. మొదటికవి పాండవవిజయము కథాసంవిధానమునందు రాజశేఖరబాలరామాయణము ననుసరించియు యతిప్రాస భావార్థకల్పనములందు నాంధ్రభారతవేదము ననుగమించియు వ్రా

యఁబడినదగుట బాగుగనేయున్నది. కాని పునర్ముద్రణమునందు దోసములఁ దొలంగించుటకు బదులు నిర్హేతుకముగాఁ గొన్ని యంకములు విడఁగొట్టియుఁ గొన్నియంకములు గలిపియుఁ గొంత పూరించియుఁ జెఱుపఁబడినదగుటచే నదియు నిట్టి దుస్థితికే వచ్చినది. కాన నీ శతఘ్నిచే బాలరామాయణముద్రారాక్షసమృచ్ఛకటికరూపకములు దక్క తక్కిన నీరి నాటకములన్నియుఁ బ్రత్యాఖ్యాతములయ్యె నని చెప్పనొప్పును. మొదటికవి బుద్ధచరిత్రాదిగ్రంథములందు నిందుఁ జెప్పినదోసములు గానరావు గాని యాయన పుస్తకముల వేఱొకతెరగతి తప్పులు గానవచ్చుచున్నవి. కాన నాకవి గ్రంథములందలి యొప్పులచే నీయన తప్పులుగాని యీకవి గ్రంథములందలి యొప్పులచే నాయనతప్పులుగాని ప్రత్యాహతములు కానేరవు. దుర్ణయాదిదుష్టములకు శేఖరాదిగ్రంథములఁ జదువమి నెవ్వరో సమాధానములు వ్రాసిన నవి మఱింత యజ్ఞానమునే వెల్లడించును. కొన్ని యెట్లో సమాహితములైనను గోమయపాయసీయన్యాయమునఁ బరిహాసాస్పదములే యగును. వేయేల? మేము చూపిన దోషములలో నొక్కటియైనఁ ద్రిప్ప శక్యముకాదు.

చ. తిరుపతివేంకటేశ్వరుల తిక్కటమక్కటనాటకమ్ములన్
దొరలినయట్టిదోసములు తొంబదితొమ్మిదియున్న, వవ్వి యె
వ్వరు పనిమాలి దిద్ది యిడవత్తురు? మేము కథాప్రసక్తి ద
త్సరణి యొకింత సూపితిమి సర్వము నిట్లె యెఱుంగఁగాఁ దగున్.

ఇది శ్రీవేంకటరామకృష్ణప్రయుక్తమగు శతఘ్ని
తృతీయగుళిక.



# పీఠి

"ఏదేశము మీకు సమ్మతము?" అని వ్రాయించిన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు "హూలెంకు!" అను మాటమీఁద మాగ్రామమునకు దయచేసి యీక్రిందిచర్య సంతయు నడపిరి. ఇందసత్యలేశముగాని, యతిశయోక్తిగాని, లేదనుట కిందుఁ బేర్కొనఁబడిన విద్వచ్ఛేఖరులే సాక్షులు. కవిసమయసిద్ధమగు నేకవచనప్రయోగాదిక మిందుఁ గలదు. పండితులకది హర్షదాయక మగుననియే తలంచెదను.



## శృంగభంగము.

క. నారాయణునకు గురునకు
భారతకవయితకు వ్యాసపండితునకు జో
హారు లొనరించి కవితా
భారతికిన్ మ్రొక్కి జయముఁ బఠియింపఁదగున్.

మ. ప్రశమం బబ్బ విరోధికృత్సమ మహావైశాఖశుద్ధత్రయో
దశినాఁ డీర్వ్యారుబందువుల్ సమపఁ బత్రిగ్రంథ దుర్లేఖలన్
దశలోనం గదియించి వేంకటకవీంద్రశ్రోత్రి యే తెంచె దు
ర్యశముం బాపుకొనంగ గెల్పుగొనఁ గారావల్లి మత్తల్లికిన్.

వ. అట్లు బహుపండితమండితంబును; కృష్ణకవినివాస గ్రామంబు;

నగు కాఁకరపర్తికి శకటారూఢుండై యరుగుదెంచి సంపన్నుఁడును, బంధువునగు నొక్క గృహస్థునియింట విడిసి యిష్టాన్నసంతృప్తుండును సుఖశయితుండు నయి——

ఉ. కాఁకరపర్తిపండితశిఖామణి మండలి వేలువేల నా
లోకన మాచరించి, తమకోపము లేదని తెల్పి, రాముపై
వాకొనినాఁడ గీరతము వచ్చి వినుండని పిల్చి, యొక్క సు
శ్లోకుని సౌధమెక్కి తనశ్లోకములం బఠియించు నత్తఱిన్

ఉ. వ్యాసకవీశ్వరుం డతఁడె వాఁడని, కబ్బములోన నేడ నా
తోసరివారు లేరనియుఁ దోఁచినకీర్తిఁ బ్రగల్భమాట రా
గా సభవారు సైచి రది కర్ణకఠోరమె యైన బంధుతం
జేసి, విడంబనముల్ మఱియుఁ జెప్పఁగ సాగె నతండు వేలిమ్మడిన్.

చ. పలువుర వేంకటేశ్వరుఁడె ప్రార్థనఁ బిల్చెఁ దనంతఁ; గొండఱన్
బిలిచెను దత్సభాపతియుఁ బిల్వఁగ లేదొకరైనఁ గృష్ణు; న
బ్బలి ననుఁ బిల్వఁబంచెనె? సభాపతిగారని, దూత లేదనన్
గలహము నాత్మనెంచికవిగండరగండఁడు రాఁడు మేడకున్.

వ. మఱియు గీరతవ్యాఖ్యానమునందు « గురువులతోడం గూడియేని జయింపరాదు" ను నర్థముగల యొకవికత్థనవాక్యముం జదువుచు నెదుట బృహస్పతిబోనివాని నారాయణబుధేంద్రుంగని నెఱచఱచి

చ. ఎఱుఁగనుమీమహత్త్వ మిదమిద్ధమటంచును, దెల్లమయ్యెనేఁ
బోరపడి రజ్ఞలాడితిని, పోఁడిమి గల్గిన రామకృష్ణులన్
గురువులతోడఁ గయ్యమునకుం జనుదెందని తప్పవ్రాసితిన్
శరణది తీసివైతు నని చల్లగ దాఁటె యథార్థభాషలన్.

ఉ. మేకుబిగింపుగర్వమును, మేలగు నీశ్వరవేరుగర్వమున్,
గేకలమందలింపనగుగర్వము, జేలుగుబెండుగర్వమున్,

స్తోకము శాంతిగిర్వాణమును, జొప్పదువాసినిగన్నగిర్వాణమున్,
గాఁకరపతిఁగిర్వాణమును గైకొని పాడె నతండు వేడుకన్.

క. కల్లరివారలజాబుల
నల్లరిపద్దెముల గీరతాక్షేపములో,
బొల్లుల నుల్లాసంబునఁ
గొల్లలుగా నతఁడు విబుధకోటికి వినిచెన్.

వ. అంత దివాకరుం డస్తాద్రి కేగుటయు నాఁటికిఁ గొలువు చాలించి యందఱుఁ దమతమవిడిదలకుం జనిరి, వేంకటేశ్వరుండును నిజనివాసంబున కరిగి కతిపయసుహృజ్జనపరివృతుం డై "కృష్ణకవి బీరమ్ము గలాఁడేని యెల్లి నాతో నవధానము సేయఁగూడదు" ననియు, "నేటికొల్వున నారాయణబుధుఁ క్షమింపఁగోరుట వినయార్థం" బనియు నిచ్ఛానుసారమ్ముగఁ బద్దులాడుటయు నదియెల్ల నాప్తముఖమ్మునం దెలిసి శ్రీనారాయణబుధేంద్రుండు కృష్ణకవి రావించి యిట్లనియె.

ఉ. వింటివె? రామకృష్ణ! మన వేంకటశాస్త్రివచోనిరూఢి, న
ట్లింటికి వేగివెంఁడియును నెప్పటిమాటయె యాడుచున్న వాఁ
డంట! యెదుర్చ మీ నృపునిమానతి యున్నదియొక్కొ? నాఁగ, నా
డంట భవన్నియుక్తి నవధాన మొనర్పఁగ మెచ్చు తేఁడనన్.

వ. క్రమమ్మున నారేయి గడచుటయు మఱునాటినాఁడు పూర్వాహ్ణమ్మునందు.

సీ. అగ్రహారికుఁడు విద్యాధికుండు సుగుణ
శాలి సుందరరామ శాస్త్రిగారు
ఘనకీర్తి హితకారిణీనిగురుండును సాధు
మతి వ్యాసలింగపండితుఁడుగారు

ధవళాద్రిలో నుపాధ్యాయుండు సౌభ్రాత్ర
శాలి సీతారామశాస్త్రిగారు
గానవిద్యను బేరుగలవాఁడు చర్లాబ్ధి
చంద్రుండు లక్ష్మణశాస్త్రిగారు
వేదులాన్వయవార్ధి విమలశీతాంశుఁడు
సూర్యనారాయణసూరిగారు
అవధాని సంస్కృతాంధ్రాఖ్యాయి కాకర్ల
సూర్యనారాయణ సూరిగారు
తుని రాజుగారియుద్యోగి పండితపుర
స్సరుఁడు బ్రహ్మానందశాస్త్రిగారు
చళ్ళపిళ్ళాన్వయసాగరేందువు కవి
శశి చిన్న వేంకటశాస్త్రిగారు
సంస్కృతసత్కళాశాలలోఁ బ్రాజ్ఞస
జ్జననుతమతి రామశాస్త్రిగారు
సాహిత్యధురీణుఁడు శాస్త్రప్రసక్తుం డభి
జాతుఁడు వేంకటశాస్త్రిగారు.
మఱియుఁ బండితులును గవుల్ మఱియు ఘనులుఁ
చిన్నలును బెద్దలును గూడియున్న సభను
చళ్ళపిళ్ళ వేంకటకవీశ్వరుఁడుగారు
గీరతము విప్పి వెండియుఁ గేలిసేయు.

వ. కతిపయచ్ఛాత్రసహితుండై యాసభావేదికకు విచ్చేసియున్న నా
రాయణబుధేంద్రుం డది సహింపఁజాలక సముచితభాషణమ్ముల
వేంకటేశ్వరు గీరతపాఠమ్ము నాఁగి.

ఉ. మీరు రచించుచిత్రముల మీఱి రచించును గృష్ణశాస్త్రి నా
కూరిమిశిష్యుఁ; డెచ్చటనొ గొప్పలు సెప్పుదు రేమికార్యమో?
ప్రోడఁడి యాతనిం బిలువఁబుత్తు నటంచు గురుండు వల్క నా
ధీరుఁ డిఁకేమి సెప్పుదును దెత్తెతె పెప్పెపె మెమ్మెమే యనెన్.

క. ఎవిరెమో బీరము లాడిన
నవధానము సేయఁ గృష్ణు డరుదేఁడు యశం
బవల సుసాథం బనుమతిఁ
గవి వేంకటశాస్త్రి రేయి గరువము సూపెన్.

చ. తిరుపతిశాస్త్రి వచ్చునెడఁ దీర్సరి యాతఁడు సేయుఁగాని నే
మఱచితి నేమెఱుంగ ననుమాట యిదేమిటి? నిన్న రేయి యే
పురుషుఁడయేని కృష్ణకవి పోరెడివాఁడని యంటిరంట; నా
నురకయ పల్కినాఁడ నని యోషినతంషు వచించె నద్దిరా!

ఉ. వాదలల్లోనఁ గృష్ణకవిశిష్యుఁడు మాద్వాయమందు నేనెపో
శ్రీసుఁడనంచు నల్లరకుఁ దెల్పుచునుండుటగాన నిర్వురున్
ప్రోఢుఁడు మీవధానములపోఁడిమిఁ జూతుమటంచుఁ బల్క నా
నేసపుకాఁడు మాఱెడఁడు నివ్వెఱఁజెందఁగ సభ్యులందఱున్.

శా. నాఁకున్ శిష్యుఁడు రామశాస్త్రికవి కొన్నాళ్ళేము మీచెంత నే
దో కాలక్షయ మాచరించుటయు నోహో శిష్యుఁడం చెప్పుదున్
మీకబ్బమ్ములఁ జెప్పుకొందు రది మేలౌనా? మీరెట్టులా
శ్రీకృష్ణున్ గవిరాజుఁ జెప్ప? రన నిస్సీ? మాటరా దచ్చటన్.

న. అంత.

ఉ. కాముదిఁ జేతఁబట్టి నయగారపుమాటల రామశాస్త్రి మీ
రేమి యెఱుంగువారో? యిపు డించుక సెప్పుఁడటంచు వేఁడఁగా

నామహనీయమూర్తి యదియంతయు విస్మృత మయ్యె నిప్పుడే
నేమియుఁ జెప్పలే ననియె నెల్లరు విజ్ఞులు బిట్టు నవ్వఁగన్.

ఉ. వ్యాకరణమ్మున న్గెలుతు వాదమునం దని రిత్తపద్దెముల్
గోఁకి ; యిదేమి ? నేఁడిటులు కొంచెము లేదని నిక్కమాడుటల్
నాకు సతీర్థ్యు లాకవులు, సజ్జదివింపఁగ లేనిమీరెటుల్
వాకొననేర్తు రావిబుధవర్యులయొద్ద ; విడంబ మేటికిన్.—

ఉ. కౌముది సెప్పుఁడం చడుగఁగా మఱివేదులరామశాస్త్రి ; య
ద్దామహితుండు పుస్తకము నంది పడంపడి కొంత సూచియ
య్యా ! మతిలేదు విస్మృతమె యయ్యెను సర్వము చెప్పలేను న
న్నేమనియాడువార లిఁక, నింత నిజంబనె వెల్లవోవుచున్.

చ. సరగున రామశాస్త్రియుఁ బ్రశంస యొనర్పఁగఁ జెప్పనేరమిన్
గినుకయి యాకవీశ్వరుఁడు క్రిందులు మీఁదులు సూచుచున్నచో
గురుఁడిటు పల్కె శబ్దకృతిఁగూడ నెఱుంగనియట్టివార ల
బ్బిరుదులు వ్రాయనే మసినఁ బెప్పెపె మెమ్మెమె చెప్పలేననెన్.

ఉ. తామువచింపఁగావలెఁ బ్రతాపచరిత్రముఁ దెచ్చినాఁడ నిం
దేమి పఠింపఁజేయుదురో ! యిట్టని రామబుధుండు పల్కఁగా
నామహనీయుఁడున్ దిరుపతయ్యకవీంద్రుఁడు గాని యిందు నే
నేమియుఁ జెప్పఁజాల ననియెన్, నిజమాడినఁ దప్పులేదుగా ?

చ. పెరుఁగును బువ్వయున్ మెసవి పెద్దసహోదరుఁ దోడఁ గొంచు స
త్వరముగ వత్తునందనుక తాళుము నిల్వుమటన్న వచ్చునాఁ
దిరుపతి వెంటరా నరుగుదెంచెద శ్రావణమాసమందు నే
మరల బలమ్ము మీఱ, సన మార్కొని బుచ్చివధాని యిట్లనెన్.

చ. తలనరియంగ వారలను దాతలుదంద్రులతాతలై మఱిన్
గలహము సేయవచ్చెదరుగాని, యిదిట్లెపుడయ్యెఁ జాలు లెం

డలయిక నంద నేమిటికి? నల్కవహింపకుఁ డింక మీఁద మీ
బలమును వారిశక్తియును బాహ్యములయ్యె జగమ్ము మెచ్చగన్.

వ. ఇట్లు పరాజితుండగుటయు నొకసభ్యుం డిట్లు లేచి:—

ఉ. వ్యాసకవీంద్రుఁ డింతయనువాఁడవె? నీవును బట్టుపద్దెముల్
జేసినయంతమాత్రమునఁ జెల్లునె? యాయన తేరిచూడ నీ
కూసుకవిత్వ మెంత? యిదిగో ననలోగితి; కారవేల్లకున్
మీసము లప్పగించి చనుమీ! యిఁక మాటలువేయు నేటికిన్.

క. ఘనులు శిరసావహించెదు
సనర్ఘ రాఘవముఁ దూలనాడెదు దానిన్
గనుఁగొని నీయిష్టమువ
చ్చిన దొకపద్దెమ్ము విప్పి చెప్పంగలవే?

వ. అనియుల్లంబుచ్చిపోనాడె నిట్లుకొలువు ముగియుటయు దుండగీలగు
బాలకులు కొందఱు కరతాళంబులు వైచిరి. మధ్యాహ్నం బగుట
యు నెల్లరు భోజనమ్ములకై తమతమ నెలవులకుం జనిరి. వేంక
టకవీంద్రుండును:—

చ. స్థిరపడి ప్రశ్న కుత్తరముఁ జెప్పఁగ నేరక కుఱ్ఱవారల
ల్లరి యొనరించిరించు నపలాపము సేసెదునంట బాపురే!
గురుఁడును కుఱ్ఱ, శిష్యులను గుఱ్ఱలు, నూటికి నెంచిచూడఁగా
నిరువదియెన్మిదేండ్లకు నెక్కుడుప్రాయము లేద యేరికిన్.

వ. నెండియు సాయాహ్నమ్మునందు సీతారామశాస్త్రి గౌరీపతిశాస్త్రి
పురస్సరులగు బుధేంద్రులు కొలువైయుండ సతీర్థ్యసంఘమ్ముతో
వల్లమరాజు రామబుధుం డచ్చటికి విచ్చేసి వేంకటకవివరు నుపల
క్షించి "పూర్వాహ్ణమ్మున వారందఱు దూయఁబట్టుకొనుట నేన

ట్లుంటి నని పల్కిరఁట, నిక్కంబే" యనుటయు, నక్కవివరే
ణ్యుండును నది యథార్థమ్ముకాదని ప్రతిపాదించె నంత మఱియు
నొకప్రధానచ్ఛాత్రుం డయ్యెపండితుల సాక్షులుగాఁ బలికె:—

మ. అవధానమ్ముసయందు, వ్యాకరణమం దధ్యాపనమ్మందు, నే
వివిధప్రక్రియలందు, మీకుఁగలప్రావీణ్యంబు సూపింపుఁడీ
వ్యవధాన మ్మికఁ లేదు కృష్ణుఁడిదిగో వచ్చెన్ బుధా! యన్న న
క్కవి పూర్వోక్తమె నిర్వచించెను వినంగాఁ బండితుల్ వెండియున్

చ. కల్లలు పల్కినార లని గ్రంథములన్ లిఖియింప నేలొకో?
కొల్లలుగాఁగ దోషములఁ గోవిదులొప్పిన వానివ్రాసి నా
రెల్లడఁ జిమ్ముచుండి, రవియేబుధుఁడున్ గనియుండుఁ, గాదనన్
జెల్లునె? వాని దిద్దుకొనఁ జేఁదె? యథార్థము తా మెఱుంగరే?

ఉ. వారు శతఘ్ని వ్రాసిన పవార్యములోటను దిద్దుకొందుమం
చీరు వచించినారుగద? యిన్ని యబద్ధము లున్నగ్రంథ మె
వ్వారలు సూచి యాఁడ, రిఁక వారలగ్రంథము మీఁద నెవ్వరో
దూఱులువ్రాసి నార లవిదోసములే? పర గొడ్డు వోయెనే?

వ. కాదేని ముఖాముఖి వాదించి సాధించుకొనుం డనుటయు నాకవి
శేఖరుండందుల కియ్యకొనక:—

ఉ. తిరుపతిశాస్త్రి పల్కఁబడెఁ దిర్పతియంచును రామశాస్త్రిచేఁ
బరపతినిల్పు నేనిటకు వచ్చితి, దప్పదికాదొకో? యనన్
సరసులు సభ్యు లిట్లనిరి చాలును వేంకటరామశాస్త్రి నా
తిరుపతిరామయా! యనినఁ దీనదె? తిర్పతి దిర్పతీ! యనన్.

ఉ. వేంకటరామకృష్ణకవివీరులు రిత్తలు వ్రాసిరంచు మీ
రంకము సేసినారలటయయ్య! యశ్లేచ్ఛగ, నెందు మీకు శ్రీ

కింకవిరాజమత్త గజకేసరినామము నెవ్వఁడిచ్చి నాఁ
డింక వచింపుఁడన్న, నది యేను ధరించితిమంచుఁ జెప్పనో
వేంకట నేత ! వారిపన వేడ్కయె ? మే! లనిరెల్లవారలున్.

వ. అట్లు సభముగియుటయు నాఁటిరాత్రి వేంకటకవీంద్రుండు భాష్య
కారబుధేంద్రుం గని యెల్లని సంఖినడపుఁ డనిక్లోరి వేకువకడలేచి
సబంధుండై తమగ్రామమ్మునకు విచ్చేసె, నంతనిక్కడఁ బౌరులు.

గీ. శతవధానముఁజేయఁగఁజాలసన్న,యతనికింతవిడంబమే మనెడువారు
కౌముదిమఱచిపోయినఘనున కింత,యల్లరింజేయ నేమిటికనెడువారు

ఉ. తారె శతావధానులఁట ! తక్కినవారలు పేరు పెట్టుకొ
న్నారఁట! లోకమంచుఁ గవినాయకు లందఱు జన్మిదమ్ములో
వారఁట! రండు పొందులఁట వహ్వారె! శ్రీంవిడనాడి యాశున
బీరము లన్నియున్ ముగియఁ జెప్పిపెమెమ్మెయె యయ్యొ నేఁటికిన్.

ఉ. తారును కృష్ణుఁడున్ శతవధానము సేయఁగ మెత్తుమన్నచో
నేరనటంచు నిబ్బడిగ నిక్కము వేంకటశాస్త్రి చెప్పె, నిం
కారయ నెన్నియెన్ని యయథార్థము లాడిన నేమియయ్యెడున్
బీరమువోయె, గీరతముపిప్పియె సారములేదు దానిలోన్.

వ. అనిచెప్పుకొనసాగిరి.

ఉ. శౌర్యముగల్గువాఁ డనిప్రజల్ జయవెట్టగ దన్నుసింగమం
చార్యులు నవ్వ లేళ్లనుచునన్యులఁ జెప్పిన కల్లరీఁడె ద్రో
వీర్యముసూపు చెళ్లపిళ వేంకటశాస్త్రిది మేఁకపోతుగాం
భీర్యమటంచు నెల్లరకు వెల్లడియయ్యె ; నిఁకేమికావలెన్

## ఫలితార్థము.

చ. వినుకలి గిల్లికయ్యముఁను బెట్టిన వేంకటశాస్త్రి యోడిపో
యెను, గురుపాదభక్తుఁ డగుకృష్ణునకున్ జయమబ్బె నింకమీఁ
దను జెళపిళ్ల వేంకటవధాని యెదేనియు వ్రాయ వానితోఁ
బెనఁగఁగ రామకృష్ణకవిసింహులకుం బనిలే దొకింతయున్.

By

CHERLA VENKATACHALAPATI SASTRI,
KAKARAPARTI.



# శృంగభంగము.

## సత్యసందేశము.

### మొదటిసర్గము.

వేదమూర్తులు దివాకర్ల తిరుపతిశాస్త్రిగారికి.

క. చూచితివి శృంగభంగము
 చూచినదానికి ఫలమ్ము ♦ సూపట్టదు నా
 కీచురవమ్మది నీ వా
 చాచాతుర్యమ్ముకంటె ♦ సంతసమొనఁగున్.

చ. సరసులు పండితోత్తరులు ♦ సభ్యులు సూచుచునుండ నిచ్చటన్
 జరిగినవేంకటేశ్వరు ప్ర ♦ సంగము సర్వమువ్రాసినాఁడ ద
 బ్బరలలిఖింపలే; దతని ♦ పై నభిమానము లేకపోవలే;
 దరయక తూలనాడె దక ♦ టా! వికటంబుగ; నెట్టివాఁడవో?

ఆ. వె. జరిగినంత వట్టు ♦ సత్యమ్ము వ్రాయఁగాఁ
 గొంకనేల మాకు ♦ జంకనేల?
 ఓడి లేదటంచు ♦ నోరులతోఁ జెప్పఁగాఁ
 గొంకవలయు నతఁడు ♦ జంకవలయు.

సీ. అవధానమొనరింపు ♦ మని కోరనావల్లఁ
  గాదన్నమాట ని ♦ క్కంబుగాదో?
 శబ్దశాస్త్రి ప్రశం ♦ సయొనర్పుమన నాకు
  జ్ఞప్తిలేదనుట ని ♦ క్కంబుగాదో?
 చదివింపుము ప్రతాప ♦ చరితమ్ము నా నద్ది
  . యనధీతమనుట త ♦ థ్యమ్ముగాదో?
 నారాయణ బుధేంద్రు ♦ నాతప్పు సైరింపుఁ
  డని వేడుకొనుట త ♦ థ్యమ్ముగాదొ?

ఓడితినటంచుఁ జెప్పిన ♦ నొక్కపెట్ట
వినినవారలుదన్ను న ♦ వ్వాదరటంచు
సిగ్గుచే నాతఁడేమేమొ ♦ సెప్పఁబోలు
నిందు నిక్కంబుగాని దిం ♦ కేదిగలదు?

ఉ. చుక్కలురాలనేల రవి ♦ సోములపోకడ మాఱనేల న
ల్దిక్కులుగూలనేల జల ♦ ధిజ్వాలనంబుబుకంగనేల యీ
పక్కి కవీశ్వరుంగెలువ ♦ బాలకులేగద దిట్టలైరి నీ
మక్కువమాటలున్ బయిసి ♦ మాలినవ్రాఁతలు గట్టిపెట్టుమా.

ఉ. పేరిమిఁ గీర్తివాంఛదొకొ ♦ పెప్పెపె మెమ్మెమె యన్నగీతిరా
జాలునొకో విడంబములు ♦ సల్పి పరాజితుఁడైన యాతఁడే
మూలనొడంగ నీవతని ♦ బూసికొనన్ ఫలమేమి సెప్పుమా
దూలియదేల నీకు విబు ♦ ధుల్ పరిహాసముసేయరే నినున్.

క. తిరుపతిశాస్త్రీ! వేంకట
పరివృఢునకు బంధుమిత్ర ♦ పండితసభలో
జరిగినది శృంగభంగము
జరిగినదానికి నిఁకన్ వి ♦ చారంబేలా?

చ. ఎఱుఁగవు దూరమందునికి ♦ నిచ్చటివృత్తమసత్యమంచు వే
గిరపడి వ్రాయుచుంటి విది ♦ కేవలసాహసమండ్రు వేంకటే
శ్వరకవి చంద్రుఁడొక్కరుని ♦ జాటుగఁ బిల్చిగొణంగు మంతయుం
గరబదరయ్యెగా నెదుటఁ ♦ గాదననేరఁడతండు సత్యమున్.

క. చుట్టములఁ జూడవచ్చిన
యట్టియతని కిచటఁ ♦ జెట్టలాడఁగనేలా?
దట్టుఁడగునేని చప్పటఁ
గొట్టక నెనుదీయనేలొ ♦ కో? చెప్పఁగదే?

ఉ. వేంకటశాస్త్రి గిరత క ♦ విత్వపవిత్రిత కీర్తి యెచ్చటన్
బింకములాడు వాఁడిచట ♦ బీరముఁబోరము డించియేఁగి యీ
వంకకుఁ జూడకుండె ; బల ♦ వంతుఁడ నేనని బూకరించి నీ
వింకను రిత్తయుత్తరము ♦ లేటికి వ్రాసెద వూరకుండుమీ.

క. ఓరిమిగల్గిన వాఁడవు
సారాచారుఁడవు ♦ నీవు సైతమయారే !
సీరాము నేనయనుచుం
బోరాటము వెంచెదేల ♦ పో ది. తి. శాస్త్రీ!

ఉ. వీరకవిప్రవేకుఁడగు ♦ వేంకటనాయకుఁ డేగుదెంచి మా
యూరనెదెద్దిసల్పె సది ♦ యున్నదియున్నటులే లిఖించిరిన్
వారును మీరునున్ మనసు ♦ వచ్చినయట్టులు గ్రుద్దులాడుఁడా
వ్వారికి మీవిచారము వి ♦ వాదము మోదమె బాంధవాళికిన్



# సత్యసందేశము.

## రెండవసర్గము.

ఉ. కాకరపర్తిలో నటులు ♦ గర్వముసర్వము ఫ్రావనేగి నీ
వేకరణిం దెగించి తల ♦ యెత్తికొనంగఁదలంచి తెందునో
దాఁకొని యద్దియంతయును ♦ దబ్బరయబ్బురమంచు వెండియున్
లేకయొకండు వ్రాసియువ ♦ లేపముసూపెదు వేంకటేశ్వరా!

ఉ. దుర్భరమౌపరాభవము ♦ ద్రోయిడిమాటలఁ గొల్ల వెట్టఁగా
నిర్భయవృత్తిఁబూని మఱి ♦ నీవు లిఖించినయట్టిలేఖలో
నర్భకులేమిసేయఁగల ♦ రంచు వచించెద వట్టులైన నీ
కార్భటియింతయేమిటికి ♦ హా యిదియెవ్వరువిన్న నవ్వరే.

చ. పలువురు పండితోత్తముల ♦ పజ్జపరాభవమందిరేగి యా
వలనను గొట్టవచ్చిరని ♦ పల్కఁగనోరెటు లాడెనోయి? యీ
పెలుచనికాఱులేయనృత ♦ పిష్టమునాఱుటగాదటోయి? నీ
తెలివియుఁ దేటయుంబ్రజకుఁ ♦ దెల్లములయ్యె నిఁకేలడంబముల్.

ఉ. జంకనివాఁడవేని తెర ♦ చాటున డాఁగఁగనేల? నీదు శ్రీ
కింకవిరాజమత్తగజ ♦ కేసరినామములోఁగనేల? నీ
పొంకముబింకమున్ గెలుపు ♦ పోడిమియుంగనుఁ గొంటిమింకనున్
అంకెలువేయ నేమిటికి ♦ అంతులుగంతులు సాగివచ్చునే?

ఉ. పాపము! నీమదింగలుగు ♦ భావమువెల్లడిసేసినాఁడ వీ
వోపఁగలేమి నిక్కమని ♦ యొప్పితి వంతియచాలుమాకు; నీ
వీపయిఁ గొట్టవచ్చిరది ♦ యెల్లనబద్ధమటంచుఁ జెప్పుటో
లోపములేదు లే వెడఁగు ♦ లోకులుకొందఱు నమ్మకున్నచోన్.

సీ. ధర్మాత్ముఁడైన సీ ♦ తారామవిబుధుఁడౌ
ననిమెచ్చి చిఱునవ్వు ♦ గొనుటచాలు
శ్రుతిమౌళి రశిగారి ♦ పతిశాస్త్రి యిదివోలు
నని హాసరమ్యాస్యుఁ ♦ డౌట చాలు
సన్నుతాచారుండు ♦ చిన్నవేంకటశాస్త్రి
తసలోని దానను ♦ కొనుట చాలు
పక్షపాతము కల్మి ♦ బైకిఁ జెప్పకయున్న
వీరరాజియ్యాది ♦ వినుటచాలు
కాశికాపురికెనవచ్చుఁ ♦ గొంరవల్లి
పండితులు సమవర్శ్యనుల్ ♦ బంధుగులును
గొట్టవచ్చిరటంచు నీ ♦ వట్టిచెప్ప
నెవ్వరో నమ్మరేని మా ♦ కేమిలోటు?
గీ. తొలుతఁ దిరుపతి చౌక్కాయఁ ♦ దొడుగనేమి?
పిదప నాచార్యు నడ్డుగాఁ ♦ బెట్టనేమి?
మొదటినుండియు నీపేరు ♦ మూలఁబెట్టు
నెద్దికారణమో వచి ♦ యింపు మయ్య!
చ. అరమరయింతలేక నమ ♦ యానుగుణంబుగ మాటలాడఁగా
నెరవరివౌదువౌరయి బుధ ♦ వీధులుద్రొక్కిన వాఁడవేకదా?
తిరుపతిపేరువెట్టుకొని ♦ తెయ్యకలాడెదవేల తొంటినీ
బిరుదు తనమ్ముగుంటువడి ♦ పెప్పెపె మెమ్మెమెతోడఁ బోయెనే.
చ. తిరుపతిపేరఁ గచ్చియను ♦ దెచ్చినవాఁడవు నీవయౌటమై
మఱచి యథాయథేచ్ఛము వి ♦ మర్శనువీవలిఖించియుంట సం
బరపడి వెఱ్ఱిగీరతము ♦ వ్రాసెడువాఁడవు నీవయౌటని
దఱిమిన నీదునచ్చెలి వ ♦ థానని బర్హణనీతినోడఁడే?

ఉ. నీయపకీర్తి కజ్జలము ♦ నిల్పఁగనే మహానీయుఁడాడఁగా
నే యెడనుద్భవించినదో ? ♦ యీశ్వరవేరనుది వ్యాసార్థకం
బాయెభవద్ధృధాంధ్యమడు ♦ గంటఁగవెల్గెను గారవల్లిలో
జేయనకింకనీవెడఁగు ♦ సిగ్గిలకున్నద దేమి పగ్గయో ?

ఉ. సంధికొనొనప్ప వచ్చియును ♦ జక్కని సేతలు సేయవైతి దు
ర్గంధముగల్గియుండియును ♦ గయ్యము సేయఁగఁ జాలవైతి హృ
ద్బంధురసామ నస్యపరి ♦ పాటిగనుంగొనరానియట్టి నీ
బంధువిరోధి నామమది ♦ బైటికివచ్చెఁ గదయ్య నేటికిన్.

శా. నీజెండాఁ దెగవ్రేయనెంచవు, నినున్ ♦ నిందింపఁగాఁబోవు, నీ
గాజుల్ వ్రాసినయట్టి పుస్తకములన్ ♦ ఖండింపఁగాఁబోవు, నీ
రాజుంజూడవు, రామకృష్ణకవులౌ ♦ రా ! నీవు నన్నోడఁగాఁ
బూజల్ సేయవటంచుఁ గొంచెపుమతిం ♦ బోరాటముం బెంచెదే?

చర్ల వేంకటాచలపతిశాస్త్రి.

ఇంచలిసారము.

ఉ. గీరతదుష్కృతియాధిగత ♦ కిల్బిషపూర్ణపదార్ణవుండవై
వారునువీరునుం గలసి ♦ వచ్చినరండని బూకరింతువా
హా ! రమణీయ ; మెంతటి మ ♦ హాకవివాదువు ? మిమ్ముగెల్వఁగా
వీరునువారు నేల ? కవి ♦ వీరుఁడు కృష్ణుఁడొకండు సాలఁడో.

ఉ. బీరముతోరమున్ విఱుగఁ ♦ బెప్పెపె మెమ్మెమెయంచుఁ బోయినీ
పూరకయుండలేక, యిక ♦ యుత్తరమున్ లిఖియించిపంపెనీ
హీ ! రహిమొంత ! పీఠపురి ♦ నీశ్వరవేలున్ వసించువారు నీ
యూనును బేరునుం జెఱిచి ♦ "హ్యూష్షు" నితో లెద రేగిఁవాలుమీ.



కవితానుబంధము. 2.

# భోజమహారాజచరిత్రము.



(ప్రథమ భాగము.)

ఇది

శ్రీ పీఠికాపురసంస్థాన విద్వత్కవీశ్వరులు, శతావధానులనగు

రామకృష్ణులచే

నాంధ్రీకరింపఁబడినది.

మొదటికూర్పు.

కాకినాడ, శ్రీసుజనరంజనీముద్రాక్షరశాల.

1911

వెల 0-4-0.

# ఉదాహారము.

నిరుపమాన మగు పాండిత్యముచేతను, నిరతిశయ మగు దాతృత్వముచేతను; నిరంకుశ మగు ప్రభుత్వముచేతను భోజమహారాజునకు సాటివచ్చువా రా కాలముననేకాక యీ కాలమునందు సైతము వేఱొకరు లే రని నిశ్శంకముగాఁ జెప్ప వచ్చును. ఈతని తండ్రి సింధులుఁడు. తాత యమోఘవర్షుఁడను నామాంతరముగల వాక్పతిరాజు. వాక్పతిరాజునకే ముంజుఁడనియుఁ బేరున్నట్లు కొన్ని గ్రంథముల వలనఁ దెలియ వచ్చు చున్నది. మఱియు నీతఁడు ధనికపండితపుత్త్రుండగు వసంతభట్టున కొసంగిన దానపత్రమునందలివిక్రమార్క-శకము 1031 సంవత్సరమునకును; జైనమతస్థుఁడగు నమితగతియతిచేఁ దన సుభాషితరత్నసందోహమునందు "విక్రమార్కుఁడు దివికేగినది మొదలు 1050 సంవత్సరములు గడచినపిదప, ముంజనృపతి ధరణిని బాలించు చున్నపుడు నే నీ గ్రంథమును ముగించితిని" అని వ్రాయఁబడిన ముంజమహీపతి రాజ్యసమయమునకును స్వల్పభేదమే కలదు. కావున వాక్పతిరాజునకు ముంజుఁడని నామాంతర మున్నట్లుతోఁచు చున్నది. ముంజుఁడు భోజునకుఁ బినతండ్రి యని యీభోజచరిత్రమునందుఁ జెప్పఁబడియున్నది. కాని దాని కాధారము లెవ్వియుఁ గానరావు. భోజుని తండ్రియగు సింధులుని వఱకు నీతని వంశస్థులకందఱకు నుజ్జయిని రాజధానిగానుండెను. పరిమల కవిప్రణీత మగు నవసాహసాంకచరిత్రమునందుజ్జయినీవర్ణనానంతరము "అందుఁగులాచలేంద్రనికుంజ విశ్రాంతయశస్తరంగుఁడగు సింధురాజు కలఁడు" అని చెప్పఁబడియున్నది. నవసాహసాంకచరితముపరిమలునిచేసింధురాజుకాలము

నందే రచియింపఁబడినది. సింధులునకే సింధురాజనియు సింధులకుఁడనియునామాంతరములుకలవు. భోజునికాలమునందు ధారానగరము రాజధానియయ్యెను. ఈతఁడు భట్టగోవిందసుతుండగు ధనపతిభట్టున కొసంగిన దానపత్రముఁబట్టి విక్రమార్క శకము 1078 సంవత్సర ప్రాంతమున రాజ్యముఁజేసినట్లు నిర్ణయింపఁబడినది. భోజుఁడుమహారాజై భూమండలమును బాలించియు మహాకవియై చంపూరామాయణము మున్నగుగ్రంథములను రచియించియుఁ గీర్తివడసెను.

భోజమహారాజుచరిత్రమునుసంస్కృతభాషలోరచించినవాఁడు బల్లాలకవి. ఈతఁడుగాళిదాసాదిమహాకవులుచెప్పినకొన్నిచాటుధారా పద్యములను సేకరించి యాయా పద్యములకుఁ దగునట్లు కథాకల్పన మొనరించి భిన్నకాలికులగు కవీశ్వరులఁ బలువుర భోజుని సభామంటపమునఁ గనఁబరచినాఁడు. కావుననే యిది చరిత్రకారులకంతగానుపయుక్తముగాదు. కాని యమ్మహాకవుల బుద్ధివైచిత్ర్యమునకు భోజుని దానవైభవమునకు నుద్ద్యోతకమై చదువరుల కాహ్లాదము గలిగింపఁజాలు ననుటకు సందేహము లేదు.

భోజచరిత్రమునందలి శ్లోకములు ప్రస్తావ యోగ్యములుగా నుండుటంజేసి వానిని బండితులనేకులు కంఠ పాఠము చేయుదురు. బ్ర. ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రులవారు కంఠస్థములగు నిందలిశ్లోకములఁ గొన్నింటిఁ దెలిఁగించి తామాంధ్రీకరించిన భామినీ విలాసమునఁ జేర్చియున్నారు. ఆపద్యములనే మఱల మే మిందుఁ గూర్చినారము. మూలకవి యొకానొకచో నీషద్భేదముగా నేకాభిప్రాయమును దెలుపు శ్లోకములను వ్రాసియుండుటచే మేమందు హృదయంగమములని తోఁచినవియుఁ గథాసూత్రమునకుఁ దగులునవియు

నగు పద్యములనే తెలిఁగించితిమి. మఱియు నీగ్రంథమును "1 రాజ్యప్రాప్తి 2 కాళిదాసప్రసాదనము 3 పండితపరీక్ష" అని మూఁడుభాగములుగా విభజించి కవితాప్రథమసంపుటమునందీ మొదటిభాగమును బ్రచురించినారము.

పీఠికాపురము, 15-6-1911.

ఇట్లు,
రామకృష్ణకవులు.

బ్ర. శ్రీ. ఆకుండివ్యాసమూర్తి శాస్త్రులవారి పద్యములు:—





# భోజమహారాజచరిత్రము.

## శుద్ధపత్రిక.

| పుట. | బంతి. | ఒప్పు. | పుట. | బంతి. | ఒప్పు. |
|---|---|---|---|---|---|
| 1 | 9 | అధియుంగాక | 14 | 18 | నూఱడించెను. |
| | 11 | వృథ | 15 | 2 | మాత్యుఁడుగ |
| | 16 | పితలంబుత్తురిగా | | 5 | మధ్యమున |
| 2 | 12 | విస్తరింపఁగఁదగు | | 15 | ప్రొద్దునసే |
| | 14 | పరిభవింపఁగ | | 21 | వగఁకు |
| | 17 | సర్వజ్ఞుండవ" యని | | 24 | బాఱు |
| 4 | 13 | డవమానసమ్ముఁ | 16 | 20 | జయశాలి |
| | 17 | నంత | 17 | 3 | దెలిసి |
| 5 | 6 | రాజగౌరవ | 19 | 15 | నూడనిఁబాడు |
| | 7 | ములోనవరింపఁగు | 20 | 1 | నెన్నిరయొగల్గిన |
| 7 | 20 | జయంతు | | 12 | ఱచ్చితిఁ |
| 9 | 1 | నీకై | 21 | 9 | బూర్ణములయ్యెను |
| | 2 | దానవర్గముం | | 10 | దేనితోవనం |
| | 17 | గండ్లఁగుందు | | 15 | గీ. మంచిమార్గముగల్గిర॰ |
| | 18 | సాలఁ | | | హించుసరస!, నీజలం |
| 10 | 5 | నీఁదగు | | | బేరుతొవరు? ॰ నీవుసా |
| | 8 | చార్దుములను | | | వరి, నీరువట్టునుదీర్పఁ |
| 11 | 18 | నదిగోఁ! కై | | | గ॰నేరపకట!, మొన |
| 12 | 5 | యర్థమును | | | లిరెయొక్కఁడు నీలోన॰ |
| | 10 | మెయ్యదియో | | | మనలదేని. |
| 13 | 10 | తక్షణము | 22 | 17 | జాతనిఁదోడితె |
| | 14 | మన్మథుని | 25 | 3 | భోజకాళిదాసకవు |
| | 16 | రించినయాశ్వ | | 13 | మన్మథునయాళి |
| 14 | 2 | తక్షణము | | 14 | సొచ్చుఁ |
| | 3 | ముంజ | 26 | 11 | గాదె |
| | 9 | రాఁగలఁడు | | 16 | సత్కవీంద్రశబ్ద |

| పుట. | బంతి. | ఒప్పు. |
|---|---|---|
| 27 | 2 | నఁగాళిదాసుం |
| | 3 | న్మ్రథ |
| 28 | 3 | వాఁడఁ |
| | 4 | దెలివి |
| | 11 | మెసవివారు |
| | 16 | కూర్చుండిరి |
| | 21 | వచ్చును |
| | 22 | యాబ్రాహ్మణు |
| 29 | 5 | వృత్తరార్థ |
| | 7 | దానవిని |
| 30 | 4 | నానంగఁబడదు |
| 31 | 7 | యే; కోర్కుల రొన్నఁడునర్థుల్ |

| పుట. | బంతి. | ఒప్పు. |
|---|---|---|
| 33 | 15 | గీ. కావ్యమునరింతు • నందముగాదుగాని;॥ పూమదునయేని యందముగానొనర్తు. |
| 34 | 8 | మాటలు |
| | 17 | ప్రాణిష్ట |
| 36 | 12 | శిరశ్ఛేదము |
| | 18 | సరవిజార్పణ |
| 37 | 3 | శేఖాధిపునకు |
| | 11 | భూతియును |
| | 12 | కౌపీనమేని |
| 38 | 19 | మమ్ముఁబోంట్ల |
| 39 | 22 | దెన్నఁటికిఁ |
| 41 | 11 | పొగడుచున్నాఁడు |
| | 19 | మోఁటకుని |





# భోజమహారాజచరిత్రము.

## భోజునిరాజ్యప్రాప్తి.

స్వస్తి శ్రీమన్మహారాజాధిరాజబిరుద విభ్రాజియగు భోజరాజు చరిత నొడివెదము. తొల్లి ధారారాజ్యంబున సింధులుండనురాజు చిరకాలము బ్రజలఁ బరిపాలించెను. ఆతనికి వృద్ధత్వంబున భోజుఁడను పుత్త్రుఁడు వొడమెను. భోజుఁడైదేండ్లప్రాయముగలవాఁడగుచు సింధులుఁడు తనముదిమి నెఱిఁగి యనుజుఁడగు ముంజుఁడు మహాబలుండగుటయుఁ బుత్త్రుఁడు బాలుఁడగుటయుంజూచి ముఖ్యామాత్యులఁ గూర్చుకొని యిట్లుచింతించెను:—ఏను రాజ్యలక్ష్మీభారధారణ సమర్థుండగు సోదరునివీడి రాజ్యముఁ బుత్త్రునకొసంగితినయేని లోకులు నిందింతురు. లదియుంగాక బాలుండగు నాపుత్త్రుని ముంజుఁడు రాజ్యలోభంబున విషప్రయోగాదుల మడియింపఁగలఁడు. కావున నేను రాజ్యమొసంగినను వృథయగును. పుత్త్రహానియు, వంశనాశంబునుగూడ వాటిల్లును.

*ఆ. వె. తల్లిపాపమునకుఁ ♦ బిల్లయు లోభంబు;
దీనఁ గినుకవుట్టు; ♦ దానఁ జంపఁ
దలఁచు; దానఁజెంపుఁ ♦ దప్పక నరకంబు;
శాస్త్రతత్త్వమెఱుఁగు ♦ జాణమైన.

క. మాతరపితల బుత్త్రున్
భ్రాత సహోదరుని మిత్త్రుఁ ♦ బ్రభుసందేహా
పేతుండై లోభమహా
భూతావిష్టుండు జంపఁ ♦ బూనుఁ గడంకన్.

అని విచారించి రాజ్యము ముంజునకొసంగి యాతనియంకతలంబునఁ గుమారభోజుని విడిచెను. తరువాతఁ గాలక్రమంబున రాజు దివంబునకరుగ సంప్రాప్తరాజ్యవిభవ గర్వితుండగు ముంజుఁడు ముఖ్యామాత్యుండైన బుద్ధిసాగరు నుద్యోగమునుండి తొలఁగించి యాపదంబున మఱియొకని నియమించెను. క్షితిపాలపుత్త్రుండును గురువులతోడ శాస్త్రంబులఁ జదువుచు వినుచునుండెను. అంత నొకప్పుడు ముంజుని సభకు సకలవిద్యాచతురుండును, జ్యోతిశ్శాస్త్రపారంగతుఁడు నగునొక బ్రాహ్మణుఁడువచ్చి స్వస్తియని రాజునకాశీర్వదించి రాజాజ్ఞచేఁ గూర్చుండి యిట్లనియె. దేవా! ఈలోకులెల్లను నన్ను సర్వజ్ఞుఁడందురు; గాన నెద్దియేని యడుగుము.

తే. గీ. బుధులు కంఠస్థమగువిద్యఁ • బూన్కి సభల
దెంపఁగ నగుఁగాక; • పుస్తకముల
నొజ్జలందును విద్యయ • లున్నమూర్ఖు
పరిభవింపంగఁబడును స • భాస్థలముల.

రాజును విప్రుని యహంభావమునఁ జమత్కరింపఁబడిన యామాటలువిని "నాపుట్టువుఁదొట్టి యేనేదియేది యాచరించితి నద్దానినెల్ల నుడువనోపుదువేని నీవెసర్వజ్ఞుండ" వని పలికెను. నావుఁడు బ్రాహ్మణుండును రాజొనరించినదానినెల్ల గూఢవ్యాపారమునుసైతము వాక్రుచ్చెను. రాజును దనయభిజ్ఞానంబులనెల్ల నెఱింగి సంతసించి యావిప్రుని పాదంబులపైఁబడి యాతని నిండ్రనీల పుష్యరాగ ఖచిత సింహాసనంబునఁగూర్చుండఁబంచి యాజానేయంబులగు పదివారువంబుల నొసంగెను.

తే. గీ. తల్లివలెఁ బెంచుఁ; జంద్రిచం • దమున హితముఁ
గఱపుఁ; గాంతతెఱంగునఁ • గలఁతఁ దొలఁచి

సంతసంబిడు; లక్ష్మియ • శంబుఁగూర్చుఁ
గల్పలతవోని విద్యచేఁ • గానిదున్నె?

పిదప నాసభయందున్న బుద్ధిసాగరుఁడు ప్రేరేప ముంజుండా బ్రాహ్మణుని భోజునిజాతకము చెప్పుఁడని యడుగుటయు, నాతఁడు పాఠశాలనుండి భోజునిటకుఁ దోడ్కొనిరండని నుడివెను. ముంజుండును గౌతుకాయత్తచిత్తుండై నిజభటులచేఁ బాఠశాల నలంకరించియున్న కుమారభోజుని సభకు రావించెను. కుమారభోజుండును దండ్రికింబలె రాజునకు సమస్కరించి వినయంబున నొక్కచోఁ గూర్చుండెను. అంత రాజకుమారమండలంబెల్ల వానిరూపలావణ్యంబులకు వెఱగుపడఁ బ్రభూతసౌభాగ్యంబున మహీమండలమున కరుదెంచిన మహేంద్రుని చందంబున, సాకారుండగు మన్మథునిక్రైవడి, మూర్తిమంతంబగు సౌభాగ్యంబువడువుననున్నవాని భోజునిఁజూచి యాదైవజ్ఞశిఖామణి నృపునితోనిట్లనియె:—రాజా! భోజుని భాగ్యోదయముం జెప్ప నలువకైన నలవిగాదు. పొట్టవోసికొను బ్రాహ్మణుండ నేనెట్లు చెప్పఁగలుగుదును? అయినను నాబుద్ధికొలఁది నుడివెద. భోజునిటనుండి యధ్యయనశాలకుఁ బంపుము. పిదప రాజాజ్ఞచే భోజుఁడధ్యయనశాలకరుగ దైవజ్ఞశిఖామణియగు నావిప్రుఁ డేఁబదియైదు వత్సరములు యేడుమాసముల మూఁడురోజులు భోజరాజు గౌడదేశము (బంగాళము) తోఁగూడిన దక్షిణాపథము (దక్కను) పరిపాలించునని చెప్పెను దానివిని రాజు చాతుర్యంబున నగువాఁడుంబోలె సుముఖుండయ్యు వివర్ణవదనుండయ్యెను. తరువాత రాజు బ్రాహ్మణునిబంపి నిశీథమునఁ దనశయనప్రాసాదంబునొంది యేకాకియై యిట్లుచింతించెను. ఈరాజ్యలక్ష్మి భోజకుమారుని బొందెనయేని నేనుబ్రతికియుండియు మృతిఁజెందినవాఁడనే.

క. అవికలములైనయంగము
లవియే; పలుకదియె; నామ ♦ మదే; ధనరహితుం
డవునంతవాఁడు మఱియొకఁ
డవు; నిదియెంత గను వింత ♦ యన్యోన్య మదికిన్.

తే. గీ. పరులు నిందింతురని భయం ♦ పడెడువారు
ప్రతిపదంబున సందేహ ♦ పడెడివారు
నిరతము దయాస్వభావము ♦ నెగడువారుఁ
జాలదవ్వగుచుందురు ♦ సంపదలకు.

*క. చేయవలయుపనివేగం
జేయఁడు; కొనవలయుదానిఁ ♦ జేకొనఁ; డీయం
డీయవలయునది యెవ్వం
డీయిలఁ గాలమ్ముఁగ్రోలు ♦ నీతని కలిమిన్.

తే. గీ. ప్రాజ్ఞుఁడవమానమ్ముఁ బు ♦ రస్కరించి
మానమును వెన్కనిడి యస ♦ మానశక్తిఁ
దనపనుల నిర్వహించుట ♦ తగవు; మొఱకుఁ
దనమునాఁబడు స్వార్థవి ♦ ధ్వంసనంబు.

తే. గీ. పుడమినుజవ్వాలె శత్రువు ♦ పొడమునంత
నెవఁడు బలిమినిఁ గెడపకు ♦ పేక్షసేయు
నాతఁడెంతటి పుష్టాంగుఁ ♦ డయ్యుఁ బిదప
నిక్కవంబుగ వానిచే ♦ నిహతుఁడగును.

అని మఱియును బెక్కు తెఱంగుల నాఁటిరాత్రి భుజింపకయే మూఁడవజామువఱకుఁ జింతించుచు వంగదేశాధీశ్వరుండగు వత్సరాజుం బిలువఁ దనయంగరక్షకు నొకనిని బంపెను. ఆయంగరక్షకుండును వత్సరాజు సమీపమునకుఁబోయి రాజాజ్ఞ నెఱింగింప నాతఁడు రథమునధిష్ఠించి

సపరివారముగ నేగుదెంచి రాజు భవనమునఁ బ్రవేశించి రాజుం గనుఁగొని నమస్కరించి కూర్చుండెను. ముంజుఁడును సౌధంబును నిర్మక్షికంబుగఁ జేసి వత్సరాజుతో నిట్లనియె.

తే. గీ. ప్రభువు సంతస మందియుఁ ♦ బరిజనులకు
గౌరవంబును మాత్రము ♦ గాన్కసేయు;
రాజు గౌరవ మొంది వా ♦ రలును బ్రాణ
ముల నొసంగియు నుపకార ♦ ములఁ బొనర్తు.

కావున వత్సరాజా! నీవు భోజుని భువనేశ్వరీవిపినమున సంహరించి యీరాత్రి మొదటిజామున నాతనిశిరం బంతఃపురంబునకుఁ గొని తేవలయును. నావుడు వత్సరాజు లేచి రాజునకు నమస్కరించి యిట్లనియె. దేవర యాదేశమే ప్రమాణము. అయినను జనవగుటచే నేదియో గొంచెము మనవిఁ జేయఁ దలఁచితిని. గావున నామాటలఁ దప్పిద మున్నను సహింపఁ దగు. భోజునకు ద్రవ్యము లేదు. సైన్యము లేదు. పరివారము లేదు. మఱియు నిప్పుఁ డాతఁడు పసివాఁడై యుండెను. వాని నెట్లు చంపఁ దగును? నీబిడ్డవలె నీపాదములయందు దాసక్తిఁ గలిగి యున్నవాఁడు. ఆతని జంపుటకుఁ గారణము కాన రాదు; అనిన రాజు ప్రాతఃకాలమున సభయందు జరిగిన వృత్తాంతమును సర్వమును జెప్పెను. వత్సరాజు విని నవ్వుచు దేవా! వినుము. రాముఁడు మూఁడులోకముల కధిపతి. వసిష్ఠుఁడు బ్రహ్మపుత్త్రుఁడు. రామునకు రాజ్యాభిషేక మొనరింప వసిష్ఠునిచే ముహూర్తము చెప్పఁబడెను. ఆముహూర్తమున రాముఁ డవనినివీడి వని కరిగెను. సీతాప

పోర మయ్యెను. బ్రహ్మపుత్త్రుని వచనము వ్యర్థ మయ్యెను. కించిద్ జ్ఞుడును నుదరంభరియునగు నాబ్రాహ్మణుఁ డెక్కడ సంభవించెను? వాని ప్రలాపములచే మన్మథాకారుండగు భోజకుమారుం జంపుటతగదు.

తే. గీ. ఏ నిది యొనర్తునేని నా ♦ కేమి కలుగు?
నిది యొనర్పక యున్న నా ♦ కేమి పోవు?
ననుచు ముందుగఁ జింతించి ♦ యవులఁ బ్రాజ్ఞుఁ
డాని చేయఁగవచ్చును ♦ మానవచ్చు.

క. మతిఁ జర్చింపఁగఁ దగునను
చితమో యుచితంబొ బుధుఁడు ♦ సేయఁగడఁగుచో
నతిరభసంబునఁ జేసినఁ
బ్రతికినయన్నాళ్ళు బిడదఁ ♦ బరితాపపడున్.

మఱియు నీతనిఁజంపినచో వృద్ధరా జగు సింధులునకుఁ బరమ ప్రీతిపాత్రు లగు మహావీరు లింతదనుక నీయాజ్ఞలో నున్నవారుగూడ నుల్లోలకల్లోలవంతంబు లగు సముద్రంబుల కైవడి నీపురిమును ముంచి వేయఁగలరు. చిరకాలమునుండి నీవు రాజ్యమును జేయుచుండినను బౌరులు కుమారభోజునే రాజుగాఁ దలఁచుచున్నారు.

*క. కలిమి యిఁకఁ గొన్నిదినములు
నిలిచెడు పుణ్యంబు లున్న ♦ నీతిఁ దొలఁగినన్
దొలఁగును; చము రెపు డందిన
మలపవె దీపశిఖ వీచు ♦ మాత్రన వాత్యల్.

దేవా! పుత్త్రవధ మెందును హితముగాదు. అని యిట్లు పలికిన వత్సరాజు వచనంబుల నాకర్ణించి ముంజుఁడు « నీవొక సేవకుని వలెఁ గనుపట్టుట లేదు. నీవే రాజ్యాధిపతివి.

*క. ప్రేని యది యాన నెఱపం
బూనని సేవకుఁడు నిందఁ ♦ బొందం దగు ; నా
మానిసి మనుగడయును ఫల
హీనమజాగళకుచద్వ ♦ యీన్యాయమునన్.

అని కుపితుండై పలికెను. వత్సరాజును గాలోచితంబు నాలోచింపనలయునని తలఁచి యూరకుండెను. తరువాత సూర్యాస్తమయ మగుటయు సక్రోధుండై యమునివలె మేడమీఁదనుండి దిగుచున్న వత్సరాజుం గనుఁగొని సభాసదు లెల్లరు భయభ్రాంతులై తమతమ గృహంబుల కరిగిరి. పిమ్మట వత్సరాజు సేవకులను దన గృహము రక్షింపఁబంపి రథమును భువనేశ్వరీ భవనమున కభిముఖముగఁ బోనిచ్చి కుమారభోజునకు విద్యఁ జెప్పుచున్న యుపాధ్యాయుని బిలుచుకొని వచ్చుట కొక్కనిఁ బంపెను. వాఁడు పోయి « అయ్యా! వత్సరాజు నిన్నుఁ బిలుచుచున్నాఁ” డని చెప్పెను. ఆపండితుఁ డదివిని వజ్రహతుని తెఱఁగున, భూతావిష్టుని వడువున, గ్రహగ్రస్తుని మాడ్కి నాసేవకుని వెంట వచ్చెను. బుద్ధిమంతుఁ డైన వత్సరా జాతనితో నమస్కారపూర్వకముగ నిట్లనె. అయ్యా! పండితోత్తమా! కూరుచుండుము. రాజకుమారుని జయింతు నిచ్చుటి కొక మాటు వుము. ఉపాధ్యాయుఁ డట్లు రప్పించెను. వచ్చిన జయంతుని గనుఁగొని యాతఁడుచదువుచున్నదానిలో నెద్దియో కొంచెమడిగి అయ్యా! భోజకుమారుని నేనింటికిఁ దీసికొని వెళ్లెదను ; నీవు వెళ్ళుమని చెప్పి

యాపండితుని బంపివేసెను. అనంతరమున భోజుఁ డెల్లవృత్తాంతము నెఱింగి మండిపడి కన్నులెఱ్ఱఁజేసి "యోరీ! పాపాత్మా! రాజునకుఁ బ్రియపుత్త్రుఁడ నగు నన్నింటరిగ రాజభవనమును వెలువరించి కొని తెచ్చుటకు నీకేమిశక్తి గలదు?" అని పలికి యెడమకాలి ముచ్చెఁదీసి వత్సరాజు దౌడమీఁదఁ గొట్టెను. వత్సరాజును మేము రాజాజ్ఞను సారముగ నొనరించువార మని యాబాలుని రథముపై నెక్కించి యొర నుండి కత్తిదూసి వెంటనే కాళిగుడికిఁ గొంపోయెను. భోజకుమారుఁ డిట్లు పట్టువడఁ బ్రజలెల్లరు కోలాహలముఁ జేసిరి. హుంకార ధ్వని బయలు వెడలెను. "ఏమియేమి" యని జనులాక్రోశించుచు వచ్చి భోజకుమారుని జంపుటకుఁ గొనిపోయిరని విని హస్తిశాలల నశ్వశాలల రథశాలలఁ బ్రవేశించి యచ్చటివారినెల్లఁ జంపిరి. అంతటఁ బురవీథుల యందును, రాజభవనప్రాకారవేదికలయందును, బహిర్ద్వార విటంక ములయందును, పట్టణ సమీప భూములయందును భేరులు, పటహ ములు, మృదంగములు, తుడుములు, రాయిడిగిడిగుడులును మ్రోయిం పఁబడుటయు నాధ్వని యాకసమంటెను. కొందఱు ఖడ్గములచేతఁ గొందఱు భల్లములచేతఁ గొందఱు తోమరములచేతఁ గొందఱు ప్రా సములచేతఁ గొందఱు కుంతములచేతఁ గొందఱు పరశువులచేతఁ గొందఱు విషముచేతఁ గొంద ఱగ్నిచేతఁ గొందఱు నీటిచేతను ధారా పట్టణమందలి బ్రాహ్మణస్త్రీలును, రాజపుత్త్రులును, రాజ సేవకు లును, రాజులును, పట్టణవాసులును బ్రాణపరిత్యాగము చేసిరి. అనం తరమున లోకమాతవలె నున్న భోజుని తల్లి సావిత్రీదేవి పుత్త్రుని యవస్థను దాసీ ముఖమున విని చేతులతోఁ గనులు మూసికొని యేడ్చుచు "నాయనా! పినతండ్రిచే నీకిట్టిదశ తటస్థించినది? నీకొఱకు నేనొనర్చిన యుపవాసములు, నియమములు నిప్పుడు విఫలములైనవి.

దిక్కులెల్ల శూన్యము లైనవి. నీకై ప్రాణముల విడుచుచున్న యీ దాసదాసీవర్గముం జూడుము” అని పలవించుచు భూమిపైఁ బడెను. అంత వైశ్వానరుఁడు ప్రదీప్తుఁ డయ్యెను. తదుద్భూత ధూమస్తోమం బునంబలె నాకసము నల్లఁబడెను. పాపభయంబునంబలె మార్తాండ మండలము పశ్చిమపయోనిధి యందు నిమగ్నం బయ్యెను. వత్స రాజును భువనేశ్వరీ భవనము నొంది “ రాజకుమారా ! జ్యోతిశ్శాస్త్ర విశారదుండగు నొక బ్రాహ్మణునిచే నీకు రాజ్యప్రాప్తి యయ్యెడునని విని ముంజుఁడు నిన్నుఁ జంపుమని యాదేశించెను;” అని చెప్పెను. భోజుఁడామాటల విని యిట్లనియె.

సీ. రామభద్రుండు ప్ర ♦ వ్రజనప్రయాసంబు
            నందుటయును బాండు ♦ నందనులకుఁ
    గానసవాసదుః ♦ ఖంబు గల్గుటయును
            బలిచక్రవర్తికి ♦ బంధనంబు
    చేకూఱుటయును వృ ♦ ష్ణిప్రవీరులుః సమ
            కాలంబునన మృతిఁ ♦ గాంచుటయును
    నిషధమహీభర్త ♦ నిఖిలరాజ్యంబును
            గోల్పోయి కడగండ్ల ♦ గుందుటయును

        దశముఖుండును జలసాల ♦ దగులుటయును
        దలఁచిచూడఁగ నిఖిలభూ ♦ తములు కాల
        వశమున నశించుచుండఁ నె ♦ వ్వండొకండు
        పొలియకుండ వలంతి యై ♦ బ్రోవఁగలఁడు ?.

మ. సిరికిన్ సోదరుఁడైన యనుంగుఁగొడుకై ♦ శ్రీరాబ్ధికిం బార్వతీ
వరచూడామణియై చెలంగెడు కళా ♦ వంతుండు దా నిప్పుడున్
హరియింపన్ శక్తి లేక దైవవిహితం ♦ బౌకార్శ్యముం జెందు నాఁ
బరుఁ డెవ్వాఁడిఁక మీ త్రెడున్ విధిగతిం ♦ బాషాణలేఖాసఖున్.

క. కడలి దఱియంగ నీదను
గడు మిట్టులు పల్లములును ♦ గలపుడములలో
నడువను సంకెలఁ ద్రెంపను
గడుకొని విధిచెయ్దములను ♦ గడువను దరమే?

మ. స్థల మావారిధి వార్ధియౌ స్థలము న ♦ ద్రంబుం దృణ స్తంబ మౌఁ
గులిశం బౌఁ బులుపోచయున్ శిఖరి యౌ ♦ క్షోదంబు జాంబూనదా
చలమున్ మృత్కణసార మౌ నెవనిచే ♦ జ్ఞం జేసి యా దేవతా
కులమూర్ధన్యు విలాసదుర్లలితుఁ డై ♦ కుంభున్ మదిన్ నిల్పెదన్.

అటు పిమ్మట రెండు మఱ్ఱియాకులం గైకొని యందొకదాని దొన్నెగాఁ జేసి కత్తిచేఁ దన తొడఁ జీల్చి యా రక్తము నాదొప్పయం దుంచి రెండవ పత్రంబునఁ దృణలేఖనిచే నొకశ్లోకమును వ్రాసి ‟ మహాభాగా! వత్సరాజ! ఈపత్రమును రాజున కిమ్ము. నీవును రాజాజ్ఞను నిర్వర్తింపు ” మనెను.

అంతట వత్సరాజుతమ్ముఁడు ప్రాణపరిత్యాగ సమయంబునను దేదీప్యమానం బగు ముఖలక్ష్మిచే నలరుచు నయనాభిరాముం డగు భోజకుమారుం గనుంగొని జాలిపడి యన్నతో నిట్లనియె.

తే. గీ. మరణ మందినయప్పుడైన ♦ మానవులకుఁ
దోడ వచ్చెడుఁ బ్రాణమి ♦ త్రునివిధమున
ధర్మ వొక్కండె; సకలబాం ♦ ధవులు మనకు
సాయపడరారు దేహావ ♦ సానమందు.

తే. గీ. బలముగలవాఁడె యయ్యు దు ♦ ర్బలుఁ డనంగ
ధనముగలవాఁడె యయ్యు ని ♦ ర్ధనుఁ డనంగ
శ్రుతముగలవాఁడె యయ్యు మూ ♦ ర్ఖుం డనంగ
నగును ధర్మపరాఙ్ముఖుం ♦ డైన జనుఁడు.

అది విని వత్సరాజు వైరాగ్యము నొంది భోజకుమారుని క్షమిం పఁబ్రార్థించి నమస్కరించి యాతని నరదము పై నెక్కించి నగరివెలు పలినుండి గాఢాంధకారమునఁ గృహమునకుఁ గొంపోయి భూమిగృహాం తరంబున నుంచి రక్షించెను. తానును శీఘ్రముగ శిల్పకారులచే రత్నకుండలములును బ్రకాశమానంబగు ముఖబింబంబును నిమీలిత నేత్రంబులును గల భోజకుమారుని యుత్తమాంగమును జేయించి రాజ భవనమునకుఁ గొనిపోయి రాజునకుఁ జూపి "అయ్యా! మీయాజ్ఞాను సారముగ నొనరించితి" ననిపలికెను. రాజును బుత్త్రవధమునెఱింగి "ఖడ్గప్రహారసమయంబున భోజకుమారుఁ డేమనియె" నని వత్సరాజు నడిగెను. అది విని వత్సరాజు "దేవా! నీకీపత్త్రంబున నెద్దియో వ్రాసియిచ్చె నిదిగో! గైకొనుము. కుమారభోజుని యుత్తమాంగ మిదిగో! చూడుము." అనెను. ముంజమహారాజావిధముగ నున్న భోజుని శిరముఁ గనుఁగొని మెల్లఁగ నేడ్చి యాతల నొకచోఁ బూడ్చి మనుటయు వల్లెయని వత్సరాజు వెడలిపోయెను. రాజును దనభార్యచే దీపముం దెప్పించి యామత్త్రియాకుపై వ్రాసియున్న యక్షరముల నిట్లు చదివెను.

ఉ. ఆతతకీర్తియుం గృతయు • గాభరణాయితమూర్తి యైనమాం
ధాతయు, వార్ధి సేతువుం బొ • నర్చిన రావణహంతయున్, గుణా
తీతులు ధర్మజాదులు గ • తించిరి ; యొక్కనితోడ నేనియీ
భూతల మేగలేదు ; నృప • పుంగవ ! నిన్నిక వెన్నడించెదున్.

దాని యర్థమును దెలిసికొని రాజు శయ్యనుండి క్రిందఁబడి మూర్ఛ పోయెను. పిమ్మటఁ బట్టపుదేవి తన చేలాంచలమున విసరుటయు క్షణకాలమునకు లబ్ధసంజ్ఞుండై « దేవీ! నన్నంటకుము ; నేను బుత్త్రినిఁ జంపిన చండాలుఁడను. ” అని గోరువంకవలె విలపించుచు ద్వారపాలకులచే బ్రాహ్మణులఁ బిలిపించి వారికి నమస్కరించి « అయ్యా! కుమారు జంపిన నాకుఁ బ్రాయశ్చిత్త మెయ్యదియో చెప్పుం ” డనెను. బ్రాహ్మణులు « పుత్త్రఘాతి కగ్నిప్రవేశము ప్రాయశ్చిత్త ” మని చెప్పిరి.

తరువాత బుద్ధిసాగరుఁడు వచ్చి యిట్లనియె. దేవా! నీ వెట్లు రాజాధముఁడవో వత్సరాజు గూడ నట్లే యమాత్యాధముఁడు. సింధుల నృపతి నీకు రాజ్యము నిచ్చి కుమారభోజు నీ యుత్సంగమున డించి పోవఁ బినతండ్రి వైన నీ వది మఱియొకలాగు చేసితివి.

క. పదిదినము లుండి పోయెడు
మదకరమగు యౌవనాగ • మంబునయందున్
బ్రదు కెల్ల వ్యర్థమగు త
ప్పిదములఁ బొనరింత్రు మూఢ • వృత్తి దురాత్ముల్.

తే. గీ. రాజు ధార్మికుఁ డైన ధ • ర్మంబు గలుగుఁ ;
బ్రభువు పాపాత్ముఁ డైనఁ బా • పంబు నిలుచు ;
నవనిపతి యెల్లవారలు • ననుసరింత్రు ;
పార్థివుం డెట్టు లాతని • ప్రజలు నట్లు.

అనిన విని రాజారాత్రి యగ్నిప్రవేశ మొనరింపఁ గృతనిశ్చయుండై యుండఁ బౌరులును సామంతరాజులును మున్నగు ప్రజ లెల్లరును గూడుకొనిరి. "కొడుకుం జంపి పాపభయంబున నరపతి యగ్నిప్రవేశ మొనరించుచుండె" నను కింవదంతి పట్టణమం దెల్లెడల వ్యాపించెను.

పిమ్మట బుద్ధిసాగరుఁడు ద్వారపాలకుని బిలిచి యెవ్వరిని రాజ భవనముఁ బ్రవేశింపనీకు మని చెప్పి రాజు నంతఃపురంబున నుండఁ బంచి యొక్కండు సభయందుఁ గూరుచుండెను. అంతట వత్సరాజు రాజమరణనిశ్చయమును విని రాజభవనమునకు వచ్చి బుద్ధిసాగరునకు నమస్కరించి తాను భోజకుమారుని రక్షించితినని చెప్పెను. అది విని బుద్ధిసాగరుఁ డాతని చెవిలో నేదియో చెప్పుటయుఁ దక్షణమ వత్స రాజు వెడలిపోయెను. తరువాత నొకముహూర్తకాలమునకు నేనుఁగు దంతముతోఁ జేసిన యొకబెత్తమును చేతఁ బట్టి ప్రత్యగ్రంబగు జటా కలాపమును ధరించి కర్పూరమిళితంబగు భస్మమును సర్వాంగంబుల నలంది మూర్తిమంతుండగు మన్మథునివలె స్ఫటికకుండలమండితకర్ణ యుగళుండై కౌశేయకౌపీనధారి యగు నొక కాపాలికుండు సాక్షాత్క రించిన యీశ్వరునివలె సభాస్థలమునకు వచ్చెను. బుద్ధిసాగరుఁ డాతనిని గనుఁగొని "యోగీంద్రా! నీ వెక్కడనుండి వచ్చుచుంటివి? నీనివాసస్థల మెక్కడ? కాపాలికుఁడ వగు నీకేదైనఁ జమత్కారియగు విద్యావిశేషముగాని యౌషధవిశేషముగాని తెలియునా?" యని యడిగెను.

అది విని యోగియిట్లనియె. దేవా! మే మొక్కదేశము నంద కాము. భూమండలమునం దెల్ల సంచరింతుము. గుహాప్రదేశ మున నుందుము. సకలప్రపంచమును గరతలామలకముగఁ జూతుము.

సర్పదష్టుల విషవ్యాకులుల రోగగ్రస్తుల శస్త్రభిన్నశిరస్కుల సకాల మృతి నొందినవారల నెల్లరఁ దక్షణము బ్రతుకఁజేయుదుము. అని,

ముంజనృపతియుఁ గుడ్యాంతర్హితుండై యుండి యీవృత్తాంత మంతయు విని సభాస్థలమునకు వచ్చి కాపాలికునకు సాష్టాంగదండ ప్రణామ మొనర్చి "యోగీంద్రా! నీవు రుద్రకల్పుఁడవు. పరోప కారపరాయణుండవు, మహాపాపాత్ముఁడ నైన నాచేఁ జంపఁబడిన పుత్త్రునకుఁ బ్రాణదాన మొనర్చి నన్ను రక్షింపు" మనెను. నిమ్మటఁ గాపాలికుండును "రాజా! భయపడకుము. నీకుమారుం డచిర కాలంబుననే యీశ్వరప్రసాదమున నీగృహమునకు రాగలఁడు. బుద్ధి సాగరునిచే హోమద్రవ్యములను శ్మశానభూమికిఁ బంపు" మనెను. ముంజుఁ డది విని బుద్ధిసాగరుని గనుఁగొని కాపాలికుం డెయ్యది గోరు నదియెల్ల సమకట్టు మని పంపెను. ఆరాత్రి గూఢరూపంబునఁ గుమార భోజుండు నచటికిఁ గొంపోఁబడెను. యోగిచే భోజుఁడు బ్రతికింపఁబడె నని ప్రసిద్ధి వుట్టెను. తరువాత నొక గజశ్రేష్ఠము నధిష్ఠించి వంది మాగధస్తూయమానుండై భేరీమృదంగాదిధ్వనులు జగము నెల్లఁ జెవు డుపఱుపఁ బౌరామాత్యపరివృతుండై భోజకుమారుండు రాజభవనము నకు వచ్చెను. ముంజుం డాతనిఁ గౌఁగిలించుకొని యేడ్వ భోజుండా తని నూరడించెను. రాజు సంతుష్టుండై సింహాసనమునం దాతనిఁ గూ రుచుండఁబెట్టి ఛత్రచామరములచే నలంకరించి రాజ్యము నెల్ల నాతని కిచ్చెను. తనపుత్త్రులలో నొక్కొకని కొక్కొక్కగ్రామము నిచ్చి ప రమప్రేమాస్పదుండగు జయంతుని మాత్రమాతని యొద్ద నుండఁబంపె ను. పిదపఁ బరలోకసుఖాసక్తుండై తనపట్టపుదేవులతోఁ గూడి తపోవనం బున కరిగి యధికతపము నొనరించెను. భోజమహారాజును దేవబ్రా

హ్మణప్రసాదంబున రాజ్యముఁ జేయుచు బుద్ధిసాగరుని ముఖ్యామాత్యునిగ నొనరించి సర్వసుఖము లనుభవించుచుండెను.

గోవిందపండితుఁడు.

ఇట్లు కొంతకాల మతిక్రమింప రాజొకప్పు డుద్యానవనవిహార మొనరింపఁ బోవుచు మార్గమధ్యమమున ధారానగరవాసి యగు నొక విప్రునిఁ గనుఁగొనెను. విప్రుఁడును రాజుం జూచి నిమీలితనేత్రుండై పోవుచుండెను. అప్పుడు రాజు బ్రాహ్మణుని బిలిచి “ద్విజోత్తమా! నరపాలకుఁడ నగు నన్నాశీర్వదింపకపోవుటయే కాక నన్నుఁ జూచి కన్నులు మూసికొనిపోవుచుంటి వే” మని యడిగెను.

అందులకు బ్రాహ్మణుం డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. దేవా! నీవు వైష్ణవమతస్థుఁడ వగుటచే బ్రాహ్మణుల కపకార మొనరింపవు; కావున నీవలన నాకు భయము లేదు. ఇఁక నేమన? నీ వెవ్వనికి నేమియు నిచ్చుచుండుటలేదు కావు న నీకు దాక్షిణ్యముకూడ నుండ దనుట నిక్కము. ఇంక నీకాశీర్వచన మేలచేయవలెను? ఇదియుంగాక, ప్రాద్దుటనే కృపణుని మొగముఁ జూచుటచే మఱియొక చోట నైన లాభము గలుగదను లోకోక్తిచే నేను గన్నుల మూసికొంటిని. మఱియు,

ఆ. వె. ఎనఁ డనుగ్రహమున • హేమాభిషేకము
* నాగ్రహమునఁ బ్రాణ • హాని సేయఁ
డామహీశకళత్రు • నాదరింపరు జనుల్
జలజదళనయనలు • షండు నట్లు.

*ఆ. వె. సభ గజగజ వణకు • జనుని సంగీతసా
హిత్యముఖనువిద్య • లెల్ల నేల?
త్యాగభోగహీను • ధనమేల? దురమన్నఁ
బారువాని బాహు • బల మదేల?

దేవా! వృద్ధుం డగు మాతండ్రి కాశికిఁబోవుచుండఁ “దండ్రీ! నే నెట్లు ప్రవర్తింపవలయునో చెప్పు” మని యడిగితిని. అప్పుడు మాతండ్రి నా కిట్లు చెప్పెను.

క. క్షితిపతులఁ గొల్వ నీకుఁ
మతిఁ గుతుకము గల్గినం గు ♦ మారక యువతీ
జితు సచివజితుం బల్లవ
జితు నృపుఁ గలలోన నైన ♦ సేవింపకుమీ.

ఆ. వె. సద్గుణాశ్రయుండు ♦ జనపతి సంపద్వి
హీనుఁ డయ్యు నాశ్ర ♦ యింప నర్హుఁ
డతనివలన జీవ ♦ నాధార మగు ఫలం
బందవచ్చు మఱియు ♦ కష్టమైన.

ఈగి లేనివానికి దాక్షిణ్య ముండదు. దేవా! తొల్లి కర్ణదధీచి శిబివిక్రమప్రభృతు లగు క్షితిపతులు పరలోకగతులయ్యు నిజదాన సముద్భూతదివ్యగుణంబులచే మహీమండలము నలంకరించు చున్నారు. ఇతరు లగు రాజు లట్లుండిరే!

తే. గీ. స్థిరతరం బగు యశము ర ♦ క్షింపవలయుఁ
గాని; భంగుర మగు మేను ♦ గావ నేల?
పతితకాయుండె యయ్యును ♦ బ్రదికియుండు
నవని మనుజుండు కీర్తికా ♦ యంబుఁ దాల్చి.

తే. గీ. శాస్త్రపారగునందు న ♦ జ్ఞానియందుఁ
బ్రథనరియశాలియందు న ♦ వధ్యునందు
వృద్ధధనునందు గర్భద ♦ రిద్రునందుఁ
బక్షపాతము మృత్యుదే ♦ వతకు లేదు.

తే. గీ. మేదినీశ్వర ! వయసు ని ♦ మేషమాత్ర
మేని నిల్వక యెల్లవు ♦ డేగుఁ గాన
దేహము లనిత్యము లటంచుఁ ♦ తెలిసి నీవు
కీర్తి నార్జింపఁ గడఁగుము ♦ కేవలముగ.

భోజనృపతియు నా మాటలచే నమృతపూరమున నోలాడి నట్లు పరబ్రహ్మమున లీనమైనట్లు లానందబాష్పతరంగితలోచనుండై యా బ్రాహ్మణున కిట్లనియె.

“ విప్రోత్తమా ! వినుము.

* తే. గీ. సతత మిచ్చక మాడెడు ♦ జనులు వారిఁ
నాదరించెడువారలును ♦ నధికసులభు ;
లింపు గాకున్న నేమని ♦ హితమె పలుకు
పురుషులును వినువారును ♦ బుడమి నరుదు.

* ఆ. వె. కలరు బుధులు ; వారు ♦ గారు మే ల్గోరెడు
వారు ; కలరు హితులు ♦ వా రెఱుఁగని
వారు ; బుధులు హితులు ♦ వసుధ నరిది, తెవుల్
మాన్పఁ జాలు తియ్య ♦ మందు మాడ్కి.”

అని యా బ్రాహ్మణుని కొక లక్ష నిచ్చి బ్రాహ్మణోత్తమా ! నీ పే రే మని యడిగెను. విప్రుఁడును దననామము గోవిందుఁ డని భూమిమీఁద వ్రాసెను. రాజు దానిని జదివి “ విప్రోత్తమా ! నీవు ప్రతిదినము రాజభవనమునకు రావలయును. నీ కేమియు నడ్డు లేదు. సంతసముతో మాసభకు విద్వాంసులను గవీశ్వరులను దీసికొనివచ్చు చుండుము. విద్వాంసు లెవ్వరు దారిద్ర్యదుఃఖము ననుభవింపకుందురు గాక ! ఈ యధికారమును నీవు పరిపాలింపుము.” అని చెప్పెను.

ఇట్లు కొన్ని దినములు గడచినపిమ్మట విద్వత్ప్రియుం డగు భోజరాజు దానవిత్తేశ్వరుఁ డని ప్రసిద్ధి నొందెను. పిమ్మట నాతనిఁ జూడఁ దలఁచి యనేకదిక్కులనుండి కవీశ్వరులు వచ్చుచుండిరి. ఇట్లు ద్రవ్యమును విశేషముగ వ్యయముచేయుచున్న భోజమహారాజుతో నొకనాఁడు ముఖ్యామాత్యుఁ డిట్లు మనవి చేసెను. "దేవా! కోశబలముగలరాజులే జయము నొందుదురు.

తే. గీ. మత్తగజములు గల్గిన ♦ మనుజవిభుఁడు
విజయ మందును వానిద ♦ విశ్వ మెల్ల
ధనము గల్గిన రాజు దు ♦ ర్ధర్షుఁ డగును
దుర్గవంతుండు పరులకు ♦ దుర్జయుండు.

దేవా! లోకముం జూడుము.

గీ. వలసినధనంబు గలుగు వా ♦ రలకె తెలచు
ధనము గన్గొన్నఁ దృష్ణ యొం ♦ తయును గలుగు
నరయఁ గోటిద్రవ్యాసక్త ♦ మగుశరాస
నంబు లక్షార్థ మై ప్రవ ♦ ణంబు గాదె?" అని.

రాజును మంత్రిశ్రేష్ఠుని ట్లనియె.

గీ. శక్తికొలఁదిని బరుల కొ ♦ సంగి తాను
స్నేహితులు గూడి యనుభవిం ♦ చనది లక్ష్మి
గాక యెంతటి దృఢరత్న ♦ గలిగి యున్న
నంతకంతకు నది లేమి ♦ యగుచు మాఱు.

అని పలికి వాని నుద్యోగమునకు దూరము సేసి యాపదమును మఱియొకని కొసంగెను. మఱియు మహాకవి కొకలక్షయుఁ బండితునకందులో సగమును అర్ధపండితునకు నొకగ్రామమును పాదపండితున

కర్ధగ్రామంబును దానము సేయ వలయును. నా మంత్రులు మొదలగు వారిలో నెవ్వఁ డైనను వితరణమును దూషింపఁ దలంపుఁ గల్గి యున్న చో నాతఁడు శీఘ్రముగాఁ దొలఁగింప నర్హుఁడు.

గీ. దాత యగు నట్టివాఁడె యెం ♦ తయును వల్ల
భుండు జనులకుఁ గోటీశ్వ ♦ రుండు గాఁడు;
ఎల్లరును జలదోదయ ♦ మిచ్చగించు
వారలే వార్ధి హెచ్చు నే ♦ వాఁడు మెచ్చు.

అనియు నా యమాత్యశేఖరునితోఁ జెప్పెను.

కళింగకవి.

ఇట్లు దానకంకణము గట్టుకొన్న భోజరాజుకీర్తి విని కళింగ దేశీయుం డగు నొక మహాకవి వచ్చి మూఁడుమాసములు ధారానగరం బున నివసించి యుండియు రాజదర్శనము గాక తుదకుఁ దాను దెచ్చి కొనిన బత్తెముకూడ సరిపోయినవాఁ డయ్యెను. ఇంతలో నొకప్పుడు రాజు మృగయాభిలాషి యై బయలువెడలెను. అప్పుడు కవి రాజును జూచి యి ట్లనియె.

గీ. భూపురందరుఁ డనఁ బొల్చు ♦ భోజనృపతిఁ
జూడఁ జెచ్చెర నూడని ♦ ద్రాఘు మూఁడు
కవుల కష్టంబు రిపుల ఖ ♦ డ్గంబు మఱియుఁ
జకితహరిణీవిలోలలో ♦ చనల నీవి.

అది విని రా జాతని కొకలక్ష నిచ్చెను. తరువాత వేఁటకుఁ బోయినప్పు డచ్చట నొక బోయవాఁడు గానము చేయుచుండఁగా నా గీతమాధుర్యముచే రాజు పరితుష్టి నొంది వాని కైదులక్ష లొసంగెను. అప్పుడు కవి యాతని మహోన్నత మైన దానమును జూచి యా యె ఱుకుపిల్లవానిఁ గనుఁగొని భోజుని చేత నున్న లీలాకమలముపై మిష వెట్టి యిట్లనియె.

గీ. ఎన్న నెన్నియో గల్గిన ♦ నేమిఫలము ?
పంకజమ ! నీగుణంబులు ♦ బయలుపడవు ;
సిరి వసించు గృహ మ్మయి ♦ చెలఁగు నీదు
కోశ మెల్లను మధుపాళి ♦ కొల్లవెట్టు.

భోజమహారాజు వాని యభిప్రాయమును దెలిసికొని మఱల నొకలక్ష నిచ్చి యా బ్రాహ్మణునితో ని ట్లనియె.

* గీ. గారవింతురు ప్రభువులు ♦ కళలఁ ; యూర్థి
జాత్య మెన్నరు ; శంభుఁడు ♦ సకలదేవ
తాగణం బుండ నిజశిరో ♦ భాగ మందుఁ
బూనఁ గాదె ? కలావంతు ♦ మానఁ డెపుడు.

భోజుఁ డిట్లు పలుకుచుండఁగా నైదారుగురు కవీశ్వరు లచ్చటికి వచ్చిరి. వారిని జూచి యిప్పుడే యింతద్రవ్య మొక్కనికి నిచ్చితి గదా యని భోజుఁడు విలక్షుని వలె నయ్యెను. అంతటఁ గవీశ్వరుఁ డాయభిప్రాయము నెఱింగి పద్మమిషమున రాజు ని ట్లనియె.

* క. అలిగెద వే మెవనిపయి
స్ఖలనపుఁ గెందు నీదు తేనె ♦ వాంఛల గమలా !
అలి నెడకిఁ గొనెదు నీ మెయి
పలములఁ బ్రతిదళము తేంట్లు ♦ తాత్పర్యమునన్.

అనినం బరిసన్నవదనుం డైన ప్రభువు నాలోకించి ప్రకాశముగ ని ట్లనియె.

*ఆ. వె. షండుఁ డాత్మభార్య ♦ జారుల కీయను
దా రమింపఁ గూడ ♦ నేర కెపుడు
హస్తమున స్పృశించు ; ♦ నట్లు లోభియు సిరి
యుడక తినక లెక్క ♦ లిడుచు మురియు.

అది విని రాజు సంతసించి మఱలఁ గళింగకవీశ్వరున కొకలక్ష నిచ్చెను. అప్పుడు కళింగకవి యెదుట నున్న యాఱుగురు కవీశ్వరుల ను జూచి యోకవిశ్రేష్ఠులారా! ఈసరోవరతీరము నుండి మహారాజు తనభవనమునకు వచ్చినతరువాత నేమైనఁ జెప్పికొనుఁ డని పలికెను. వా రందఱు మహాకవులయ్యును రాజుగారి ప్రథమచేష్టితము నెఱింగిన వా రగుటచే నూరక యుండిరి. వారిలో నొక్కరుఁ డా సరోవరముపై మిష వెట్టి రాజుతో ని ట్లనియె.

గీ. కాంక్ష వచ్చియుఁ బూర్ణములె • గాని కుంభ
ములకుఁ బూర్ణము లయ్యను • బోవ కుండు
ఘటములకు దేనితోడ సం • ఘట్టనంబు
వారయ దద్దియ పో సరో • వరమనంగ.

అది విని రా జతని కొకలక్ష నిచ్చెను. అప్పుడు గోవిందపండి తుఁ డా కవీంద్రులయెడఁ గోపించెను. అతని కోపాభిప్రాయము నెఱింగి రెండవకవి యి ట్లనియె.

ఆ. వె. ఎవని దప్పిఁ దీర్ప ? • నెవ్వఁడు ద్రావఁడు
సొచ్చి లోన నీరు ? • శుద్ధహృదయ !
యో సరఃప్రకాండ ! • భాసురసన్మార్గ !
రేసి మొసలి కినుక • రేఁగ దేని.

రా జది విని యాతనికి రెండులక్ష లిచ్చి గోవిందపండితు నుద్యోగమునుండి తొలఁగించి "నీ వందఱతోపాటు సభకు రా వచ్చు ను ; గాని యెవ్వనికి నపకారముఁ జేయ రా" దని చెప్పి వారి కొ క్కొక్కని కొక్కొక్కలక్ష నిచ్చి తాను దనపురంబున కరిగెను. వా రును వారివారి నెలవులకుఁ బోయిరి.

పిమ్మట నొకప్పుడు భోజరాజు ముఖ్యామాత్యుని బిలిచి «మన పట్టణమున నున్నప్రజలలో మూర్ఖు లున్నచో వారు బ్రాహ్మణు లైనను నెడలఁగొట్టవలయును. విద్వాంసులు కుమ్మరివాండ్రైనను నెల కొని యుందురుగాక!" అని చెప్పెను.

ఆకారణంబుననే ధారానగరంబున నెవ్వఁడును మూర్ఖుఁడు గాక యుండెను.

క్రమక్రమముగ నైదువందలపండితులు వరరుచి, బాణ, మయూర, రేఫణ, హరి, శంకర, కళింగ, పూర, వినాయక, మదన, విద్యావినోద, కోకిల, తారేంద్రాదు లందఱు సర్వశాస్త్రవిచక్షణులును సర్వజ్ఞులును భోజసభ నలంకరించిరి.

శంకరకాళిదాసకవులు.

ఇట్లుండ నొకప్పుడు విద్వద్బృందవందితుండును గవిశిరోమణి యుఁ గవిత్వప్రియుండు నైన భోజభూపాలుండు విప్రులతోడను బ్రియ బాంధవులతోడను గూడి సింహాసనము నధిష్ఠించి యుండ ద్వారపాల కుఁడు వచ్చి నమస్కరించి «దేవా! శంకరుఁడను నామముగల యొక విద్వాంసుఁడు వచ్చియున్నాఁ" డని మనవి సేసెను. అది విని రా జాతని దోడి తెమ్మని చెప్పుటయు నా దౌవారికుఁడు పోయి యాపం డితుని దీసికొని వచ్చెను. అప్పు డావిద్వాంసుఁడు కుడిచేయిఁ పై కెత్తి యిట్లనియె:—

శంకరకవి—శా. రాజా! మే లగు నీకు

భోజుఁడు— శంకరకవీంద్రా! యేమి యీపత్రిక?

శంకరకవి—— భోజా ! నీపయిఁ బద్యమే

భోజుఁడు—— చదువుమా !

శంకరకవి—— భూపా ! క్షణం బేని యీ। రాజీవాక్షులు
చామరమ్ము లిడఁ దోర మ్మైన బాహాలతో।
ద్భ్రాజన్మూతన రత్నకంకణఝణత్కారం
బు వారింపుమా !

గీ. భోజ ! నీ కీర్తి ముజ్జగమ్ములను దెలుపు
సేయనో ? యన నభివృద్ధిఁ జెందుకొలఁది
నతివముంగురులును దెల్ల నగునొ యనెడు
భయముచే నెప్డు నా మది పరితపించు.

అది విని రాజు శంకరకవికిఁ బండ్రెండు లక్షల నొసంగెను. అప్పుడు పండితుల మొగము లన్నియు వెలవెలన బోయెను. కాని రాజభయంబున నొకండును వాకొనఁడయ్యెను. కార్యవశంబున రాజు లోని కరుగ నా పండితు లందఱు నతని నిందించిరి. ఔరా! ఈ భూపాలుఁ డెంత తెలివిమాలినవాఁడు? ఇతనిఁ గొలువ నేమి లగ్గు? వేద శాస్త్రవిచతురు లైన తనయాస్థానకవుల కొసంగిన దొక లక్షయే. ఇతఁడు సంతసింప కున్నను నేమి యొగ్గు! ఈశంకరకవియును గేవలము ననాగరికుఁడు ఇతని పాణ్డిత్య మేమి? అని యిట్లు కోలాహలరవము విజృంభింపఁ గనకమణికుండలములను హారంబట్టుసాలువులను ధరించి రాకొమరుండునుం బోలెఁ గస్తూరీపంకకళంకితగాత్రుండును నవకుసుమాలంకృతశీర్షుండును నై చందనాంగరాగంబున మధుకరబృందము

నానఁగొలుపుచు మూర్తిమంతం బగు విలాసముపోల్కి విగ్రహిణి యగు కవిత మాడ్కిఁ దనువుఁ దాల్చిన శృంగారంబు మాద్రి, మహీమండలమునకు డిగిన యాఖండలు పగిది, నొకానొక విద్వాంసుఁ డచ్చటి కరుగుదెంచెను. ఆతనిఁ జూడ నాపండితమండలికి భయకౌతుకములు వొడమెను. అతఁడును నందఱ మ్రొక్కి భోజుఁ డెందున్నాఁ డని యడుగ «నిప్పుడే సౌధాంతరమున కరిగె" నని చెప్పిరి. తరువాత నతఁడు వారి కెల్లరకు వేర్వేరఁ దాంబూలంబు లొసంగి మహాగజయూథమధ్యగతుం డగు మృగేంద్రుండునుం బోలె నుండెను. అప్పు డామహాపురుషుఁడు రాజు శంకరకవి కెక్కు డొసంగుటచే నాపండితులు కుపితులై యుండిరని తెలిసికొని యిట్లు వలికెను. రాజు శంకరకవికిఁ బండ్రెండు లక్షలొసంగె నని తలంచితిరి కాని యాతని భావము మీ రెఱుంగ రైరి. శంకరపూజన మారంభించిన రాజు శంకరకవి నొక లక్షనే పూజించెను. కాని యాతని పేర నొప్పు నేకాదశరుద్రులను బ్రత్యక్షాపరశంకరులుగా నెంచి వారికి వేర్వేర నొక్కొక లక్షను శంకరరూపుఁ డగు శంకరకవికే యిచ్చెను. ఇది రాజవభిప్రాయము. అన విని వారెల్లరుఁ జమత్కృతు లైరి. తరువాత నొక రాజపురుషుఁ డాపండితుని తెఱఁగు శీఘ్రముగా రాజునకు విన్నవించెను. రాజును దన యభిప్రాయమును బ్రత్యక్షముగ నెంచిగిన యా మహాత్ముని సర్వజ్ఞుఁడుగాఁ దలంచుచు సభకు వచ్చెను. అతఁడును «స్వస్తి" యని రాజును దీవించెను. రాజును నతనిఁ గౌఁగిలించి మ్రొక్కి తన హస్తకమలంబున నతని కేలుదామరఁ గదియించి సౌధాంతరమున కరిగి మహోన్నతగవాక్షోపవిష్టుఁ డై «బ్రాహ్మణోత్తమా! నీ పేరుగా నోఁచుకొనిన యక్షరము లెవ్వి? భవద్విరహ మేదేశమందలి సుజ

నలఁదురు చుండెడు నళు లెంతయేని,
యన్యదేశమున గుణాఢ్యులు వ్రాలె
నలజడి పాల్పేయు నఖిలలోకంబు,
నంధకారము దుష్టుఁ డగు ప్రేని రీతి
ఫలరహితం బగుఁ బ్రాణులకన్న,
బలు లోభి గూర్చిన భాండము భాతి.

మఱియు నతఁడు రాజు నిట్లు పొగడెను:—

గీ. చెలిమి గలుగక యున్నంతె ♦ సేవ జనుఁడు
మిగుల నుపచారములు సేయఁ ♦ దగును గాక
చెలిమి గలిగిన పిమ్మట ♦ సేయు నట్టి
వట్టి యుపచార మొక కైతవంబు గాదె?

గీ. కవుల శ్రమమును సద్దివ్య ♦ కావ్యరచన
నే మహీపాలుఁ డెంతయు ♦ నెఱుఁగ నేర్చు
నాతఁడు సువర్ణసంపూర్ణ ♦ మైన పృథ్వి
నంతయును వారలకొసంగి ♦ నట్టివాఁడె,

గీ. సత్కవీంద్రశబ్ద ♦ సౌభాగ్య మెఱుఁగం గ
నోపువాఁడు సుకవి; ♦ యొపిన కిరిది
తలఁప నెట్లు మేటి ♦ దౌహృదసంపద
నొద్దురాలు దెలిసి ♦ కొనఁ గఁ జాలుఁ?

క్రమముగా భోజకాళిదాసుల కనురాగాతిశయము గలిగెను. అంత
కాళిదాసుని వేశ్యాలంపటుఁడుగా నెంచి పండితు లందఱు నా

ని ద్వేషించిరి. ఆతని నెవ్వారు ముట్ట కుండిరి. ఒకప్పుడు సభామధ్యంబునఁ కాళిదాసుం జూచి భోజనృపతి ప్రాజ్ఞుఁడగు నీతనికిని మన్మథపీడాప్రమాదం బెట్లు గలిగెనో యని తనమనంబునఁ జింతించెను. ఆతఁడును రాజు నభిప్రాయము నెఱింగి యిట్లు నుడివెను:-

గీ. పంచబాణుని పుష్పచా ♦ పప్రసక్తి
వెలయ; దాహస్వభావము ♦ గలిగి యున్న
హరుని పౌరుషమే నగ ♦ మయ్యె ననఁగ
మనుజలోకంబువారల ♦ మాట యేల?

అని విని సంతుష్టుఁడై భోజనరపాలుఁ డాతని కక్షరలక్షల నొసంగెను. బహుమానానంతర మా మహాకవి భోజరాజు నిట్లు పొగడెను:-

గీ. శ్రీమహారాజ! విష్ణువు ♦ క్షీరవార్ధి;
హరుఁడు కైలాసమును; బ్రహ్మ ♦ హంస; వజ్రి
యభ్రగజమును; రాహువు శు ♦ భ్రాంశు; వెదక
వలసె నీకీర్తి జగముల ♦ వళిత మగుట.

చ. పరువిడుఁ బాలు పిదిగాని ♦ పక్షులచెంతకు హంసవాహనుం;
డరయిక దుగ్ధవారిధిని ♦ యానుఁడు తక్రముఁ గొంచువార్ధులన్
దిరిగెడు రాజతాద్రిపతి ♦ తీక్ష్ణవిలోకనవహ్నిఁ గుంగభూ
ధరములఁ గాల్చు; ముజ్జగము ♦ త్వచ్ఛ్రితకీర్తుల నిండియుండుటన్.

ఉ. పండితరాజశేఖర! భ ♦ వత్సరిపాండుయశఃప్రకాండమున్
నెండిమలందుల న్నిలిపి ♦ శ్వేతగిరిన్ లఘుమంబు గాంచుటం
దంపువు; వానిపై శివుని; ♦ దచ్ఛిరమందును గంగ; దానిపైఁ
గుండలిరాజు; మీఁద విధుఁ; ♦ గూర్చిన వాఁడువిధాతపూర్తికిన్.

"మేము సంపూర్ణముగ వేదాధ్యయనమును జేసినవారమే యైనను భోజరాజు మా కేమియు నొసంగఁడు. మీవంటివారి కైనచో యథేష్టముగ నిచ్చుచున్నాఁడు. కావున మేము గవిత్వముఁ జెప్పుతలంపున నిచ్చటికి వచ్చితిమి. చాలసేపాలోచించి పూర్వార్ధమును రచియించితిమి. నీ వుత్తరార్థమును జేసి యిమ్ము. అప్పుడు రాజు మా కేమైన నొసఁగును" అని పలికి తాము రచించిన పూర్వార్ధమును జదివిరి. అతఁడును దానిని విని "శారదోజ్జ్వలపూర్ణిమా. చంద్రచంద్రి. కాధవళమాహిషదధియుఁ గలుగు నట్లు" అని చెప్పెను. అంతట వారు రాజభవనమునకుఁ బోయి "మేము కవనముఁ జేసి కొని వచ్చితిమి. రాజదర్శనముఁ జేయింపుఁడు" అని దౌవారికుల నడిగిరి. వారును గౌతుకంబున నవ్వుచుఁ బోయి రాజునకు మ్రొక్కి యి ట్లనిరి:—

గీ. అధిప! యూపసందోహంబు బోలు ♦ నట్టి దంత
ములు గటిన్యస్తహస్తము ♦ లై యలయు శ్లోక
శత్రువులు ఛాందసులు మొఁగ ♦ సాలకడకు
వచ్చి యున్నారు నిను జూడ ♦ వలయు ననుచు.

పిమ్మట రాజుచేఁ బ్రవేశితులై యా బ్రాహ్మణులు రాజసభను జూచి యందఱు నొక్కపెట్టుగాఁ దమ కవిత్వమును జదివిరి.

గీ. భోజనంబును బెట్టుము ♦ భోజరాజ!
ఆజ్యసూపాన్వితముగ మా ♦ కందఱకును
శారదోజ్జ్వలపూర్ణిమా ♦ చంద్రచంద్రి
కాధవళమాహిషదధియుఁ ♦ గల్గు నట్లు.

భోజరా జది విని యుత్తరార్థము కాళిదాసవిరచితమని తెలిసి గి వారితో ని ట్లనియె:—"పూర్వార్ధము రచియించిన వా రెప్పుడు ను గవిత్వము జెప్పినవారు కారు. ఉత్తరార్ధమునకుఁ గొంచె మీయఁ బడును. పూర్వార్ధమున కించుకయు నొసంగ బడదు." అని పలికి యు త్తరార్థమునకుఁ బ్రత్యక్షరలక్షము నొసంగెను. ఆ బ్రాహ్మణులు బహు మానమును గొని వెడలినపిమ్మటఁ గాళిదాసుం జూచి రాజు "సుకవీ! యుత్తరార్థము నీవు చెప్పినది" అని పలికెను. అది విని యామహాకవి యి ట్లనియె:—

క. జవరాండ్ర యధరమధురిమ
ధవలాక్షుల చూపువాఁడి ♦ స్తనకఠినతయుఁ
గవితాపరిపాకము నను
భవరసికుం డెఱుఁగు నెఱుక ♦ పడ దితరులకున్

అనిన రా జి ట్లనియె:—సుకవీ! నీవు చెప్పినది నిజము.

క. తనరుఁ గావ్యామృతఫల
మున వాగ్రస మొకఁ డపూర్వ ♦ ము బళీ ఫలముఁ
గొని యెల్లరు మెసవుదు రై
నను గవికే చవియెఱుంగు ♦ నైపుణి యొప్పన్.

గీ. తలఁచిచూడ జగంబు నం ♦ తయును నీ ప
దార్థములు మూఁడు నా హృద ♦ యంబు సొచ్చెఁ
గవుల మతములు; నిక్షువి ♦ కారములు; స
భావముగ్ధాంగనాపాంగ ♦ భంగితములు.

## లక్ష్మీధరకవి.

ఒకప్పుడు ద్వారపాలకుఁడు భోజునకు నమస్కరించి దేవా! ద్రవిడదేశమునుండి లక్ష్మీధరుఁ డను కవీశ్వరుఁడు వచ్చి ద్వారమున నున్నాఁ డని చెప్పెను. రాజు ప్రవేశపెట్టు మనెను. ప్రవేశించుటయు సూర్యుఁడుంబోలెఁ దేజరిల్లుచు నవిదితవృత్తాంతుఁ డై యున్న యాతని జూచి రాజిట్లు చింతించెను.

క. ఆకారంబును గనుఁగొని
యే కోర్కెల నెఱిఁగి తీర్చి ♦ యెన్నడు నర్థుల్
వాకొను దీనాలాపము
లాకర్ణింపని జనుల్ కృ ♦ తార్థులు దలఁపన్.

అతఁడును భోజుని సమీపించి స్వస్తి యని దీవించి రాజాజ్ఞచే నుపవిష్టుం డై దేవా! యీ నీసభ పండితులచే నలంకరింపఁబడియున్నది. నీవును సాక్షాద్విష్ణుండవు. ఇచట నా పాండిత్యమన నెంత? అయినను గొంచెము చెప్పుచున్నాను.

గీ. పద్మజుఁడు భోజనృపు ప్రతా ♦ పము సృజించి
శేషపరమాణువుల నిర ♦ సింప; నవియె
హారికరంబునఁ బవి; రవి ♦ యంబరమున;
నంబునిధిలోన నగ్నియు; నైనవెకొ ?

అది విని సభ్యు లందఱు చమత్కృతులైరి. భోజభూపతియు నాతనికిఁ బ్రత్యక్షరలక్షము నొసంగెను. మఱియు నా కవి దేవా! నే నిచ్చట నివసించుటకు సకుటుంబముగ వచ్చితిని.

గీ. క్షమియు దాతయు సద్గుణ ♦ గ్రాహియు నగు
పార్థివుఁడు పుణ్యవశమునఁ ♦ బడయ నగును
కోవిదుఁడు దక్షితముఁ డను ♦ కూలవర్తి
దోషరహితుఁడు నగు కవి ♦ దుర్లభుండు.

అని పలికెను. అంతట భోజరాజు ముఖ్యామాత్యునితో నీతని కొక గృహము నిమ్మని చెప్పెను. పిమ్మట నా యమాత్యుఁడు పట్టణము నంతయు విలోకించి యొక్క మూర్ఖు నైనను గానఁ డయ్యెను. ఎవ్వని వెడలించి యీ పండితునకు గృహము నిచ్చును? తుద కొక సాలెవా ని గృహము గనుఁగొని కువిందా! నీ వీ యిల్లు విడిచిపొమ్ము. నీయిం ట నివసింప నొకపండితుఁడు వచ్చును. అని చెప్పెను. అంత నా సాలె వాఁడు రాజభవనమునకుఁ బోయి భోజరాజునకు నమస్కరించి దేవా! నీ యమాత్యుఁడు నన్ను మూర్ఖునిఁగాఁ జేసి గృహ ము నుండి లేవఁగొ ట్టుచున్నాఁడు. మూర్ఖుఁడనో పండితుఁడనో నీవైనఁ జూడుము.

గీ. యత్న మొనరించి యేను కా ♦ వ్యంబు సేయ
మానుమనుమాన మందము ♦ గా నొనర్తుఁ
బార్థివలలామ! సాహసా ♦ భరణ! కవిత
సేయుదును; నేయుదును; పోదు ♦ సెల వొసంగ.

అంత రాజు “ నీవునీ ” వని పలుకు; కువిందుని జూచి “ నీపద ములకూర్పు లలితముగా నున్నది. కవితామాధుర్యమును శోభన ము. కాని విచారించి కవిత్వమును జేయవలయును ” అని పలికెను

అది విని కువిందుఁడు కుపితుఁడై దేవా! ఇందొక యంతరము గలదు. రాజధర్మము విద్వద్ధర్మముకంటె వేఱగుటచే నేను దానిని జెప్పను. అని పలికెను. భోజుఁ డది యేదియో చెప్పు మనుటయుఁ గువిందుఁ డిట్లు నుడివెను. " దేవా! కాళిదాసునిదక్క నితరుని గవి యని తలఁపను. ఆతఁడు గాక నీసభయందుఁ గవిత్వతత్త్వము నెఱింగిన విద్వాంసుఁ డెవ్వఁడు గలఁడు?

చ. గురుకరుణామృతోద్భవము ♦ కోమలవాగ్విభవం బుసత్కవీ
శ్వరునకుఁ దక్క నెందు హరి ♦ హాకృన కందఁగ రాదు; పంకజా
కరమున నెంతయున్న నుద ♦ కంబుఁగలంచుట యొండె కాని; కా
సర ఖసుమంతయేనియును ♦ సౌరభముల్ గ్రహియింపఁగల్గునే?

విద్వజ్జనవందిత యగు సీత యిట్లు పలికెను:—

గీ. జడుఁడు తన కావ్యమునకు వి ♦ షాదపడక
నిపుణసహృదయాభియోగప్ర ♦ వృత్తభంగ
మును గనుంగొని ఖేదము ♦ నెనయుచుండు
శుష్కవక్షోజ తఱచు కం ♦ చుకమె దూఱు.

మఱియుఁ గువిందుఁ డిట్లు నుడివెను:—

క. సుతులు పసితనమునందును;
స్తుతియందుఁ గవీశ్వరులును ♦ సురతమునందున్
సతులును; రణమున భటులును;
క్షితిపా! నీవనుచుఁ బలుకఁ ♦ జెల్లుఁ దలఁపుమా.

మఱలిపోవుచున్నారను నది యొకటియు నా హృదయమును బరితపింపఁ జేయుచున్నది.

క. దారిద్ర్యానలతాపం
బాత్రను సంతోషవారి; యాచకతృష్ణా
పూరనిరోధంబున సమ
కూరినతాపంబు శాంతిఁ గొను నెబ్భంగిన్?

భోజనృపతియు నది యంతయు విని యిప్పు డేమియు నొసఁగుటకు వీలుగాదు. ప్రాతఃకాలమునందే బాణుని బరిపూర్ణమనోరథుఁ జేసెద నని యచ్చోటువాసి పట్టణమున సంచరించు చుండ శకుంతుఁడు; మరాళుఁడు; నను నిరువురు దొంగ లామార్గమునఁ బోవుచు నిట్లు సంభాషించుకొనిరి.

శకుంతుఁడు—మిత్రమా! గాఢాంధకారముచే జగ మంతయు వ్యాప్తమై యున్నను బరమాణుప్రాయమైన ధనమునుసైతి మం జనవశంబున నంతటను గనుఁగొనుచున్నాను గాని యింతకు మున్ను సంభారగృహమునుండి ముచ్చిలి తెచ్చిన బంగారమును నాకు హితముగా లేదు.

మరా—ఏమి యిట్లనుచున్నాఁడవు?

శకుం—నగరరక్షకు లంతటను దిరుగుచున్నారు. వీరి భేరీపటహాదిధ్వనిచే నెల్లగు మేల్కొంచురు. కావునఁ దెచ్చిన ద్రవ్యముఁ బంచుకొని యెవ్వరి భాగమునకు వచ్చినది వారు తీసికొని శీఘ్రముగఁ బోవుదము.

మరా—మిత్రమా! కోటిసంఖ్యాపరిమితములైన యీ మాణిక్యములను బంగారమును నీ వేమి సేయుదువు?

శకుం—ఈ ధనమును వేదవేదాంగపారగుఁ డైన యొక బ్రాహ్మణుని జూచి యాతఁడు మఱల నితరుని యాచింపకుండున ట్లతని కిచ్చెదను.

మరా—మిత్రమా! బాగు.

గీ. అర్థి నొసఁగెడు వేళ నాహవము సేయు
తఱిని బఱియించునప్పుడుఁ దనకు నట్టు
లొరులకును మేన గగురుపా టొదవునేని
దానమును బౌరుషమ్ము శ్రుతమ్ము నదియ.

అయినను దొంగిలించి తెచ్చిన సొమ్ము దానము సేసిన నీ కేమి పుణ్యము.

శకుం—మా కీ చౌర్యము పితృపితామహుల నాఁటి ధర్మము.

మరా—శిరచ్ఛేదము నంగీకరించి తెచ్చిన యీద్రవ్యము నంతయు నెట్లొసంగెదవు.

శకుం—

గీ. పిసిని విడువఁడు ధన మిప్డు పేదతనము
తనకుఁ గలిగెడు నను భయమ్మునఁ; బరమున
వచ్చు నిప్పచ్చరమ్మని పాత్రపాణి
సరశిజార్పణ మొనరించు సరగ దాత.

మఱల శకుంతుఁడు—నీ వీ విత్తమ్ముతో నేమి సేయుదువు.

మరాళుఁడు—సఖా! కాశీవాసియగు నొక విప్రవటువు వచ్చి మా తండ్రి దగ్గఱఁ గాశీవాసఫలమును వర్ణింప నతఁడు బాల్యము మొదలు చౌర్యము సేయువాఁడయ్యు దైవవశమ్మున స్వపాపము నుండి మఱలి వైరాగ్యము నవలంబించి సకుటుంబముగాఁ గాశికిఁ బోవ సమకట్టెను. ఈద్రవ్యమంతయు నందులకు.

శకుం——నీ తండ్రి భాగ్యము గొప్పది.

సీ. కాశికాపురిలోనఁ ♦ గాఁపున్న సారమే
యముసాటి గలదె? లే ♦ ఖర్షభునకు
కర్మసస్యములు ♦ గలుగని యూషర
క్షేత్రము వారాణ ♦ సీపురము
సమముగాఁ బండితుల్ ♦ చండాలురునుగాశి
కాపట్టణమున మో ♦ క్షుంబుఁ గొంద్రు
వారాణసీపురి ♦ వసియించువారికి
మరణము తుల లేని ♦ మంగళము
గీ. విశ్వనాథుఁడు వెలసిన ♦ వీటిలోన
భూతియుని భూషణం బన్న ♦ పూర్ణ నగరి
లోనఁ గౌశేయకము కౌ ♦ పీనమేమి
కాశి గుణరాశి నెవ్వఁడు ♦ గణుతి సేయు.

ఇట్లిరువుర సంవాదంబును విని రాజు సంతసించెను. "కర్మముల గతి విచిత్రము. వీ రిరువుర మనంబును బవిత్ర మైనది" అనియుఁ దలంచెను.

తరువాత రాజు మఱలి వేఱొకయింటఁ దండ్రి కొడుకుల నిద్దఱఁ జూచెను. అందుఁ దండ్రి పుత్రునితో నిట్లుపలికెను. ఇప్పుడు రాజు శాస్త్రతత్త్వము నెఱింగిన వాఁడయ్యు లోభిత్వంబున నేమియు నిచ్చుట లేదు.

గీ. అర్థి కవనంబు సెప్పిన ♦ నతఁడు సెప్పఁ
బాడఁ బాడును, బాగడఁ బొ ♦ గడఁ బాగడు
"సెలవు దయసేయుఁడీ" యని ♦ పలుక మాని
యగుచు నేత్రనిమీలనం ♦ బాచరించు.

రాజు నది విని సమీపంబున కరిగి "ఇట్లనకుము" అని తన గాత్రమునుండి సర్వాభరణములుఁ దీసి యాతని కొసంగి గృహమున కేగెను.

మఱియొకప్పుడు కాల్వదీర్చి రాజు కాళిదాసునకట్లు సమస్య నిచ్చెను.

రాజు—గీ. కవులచిత్తమునకు సమ ♦ స్కారములు ర
చింతుఁ బ్రతిభాబలమ్మునఁ ♦ జేసి దాఁటు

కవి— నద్ది వమనాల్గుజగముల ♦ హేలనబ్ధి
పూరములనోడచేఁ గర్ణ ♦ ధారునట్లు.

అదివిని భూపాలుఁ డక్షర మొకటికి లక్షముత్యములొసంగెను.

క్రీ డా చ ం ద్రుఁ డు.

ద్వారపాలకుఁడు—(ప్రవేశించి) దేవరా! గోఁచియే మిగిలియున్న విద్వాంసుఁడొకఁడు ద్వారమందున్నాఁడు.

రాజు—ప్రవేశపెట్టుము.

తరువాతఁ గవివచ్చి "స్వస్తి" యని రాజునానఁగొనక యే కూర్చుండి చదువుచున్నాఁడు.

మత్తకోకిలము. చేరి యుందువసించుభూధర ♦ శేఖరమ్మును మేరువ
వ్వారిరాసులు నాల్గుమూఁడిట ♦ వాలినాహితభారమ్ములన్
భూరిభూతసముద్భవస్థితి ♦ మూలమపరిమానమున్
ధారుణీతలమిద్ది సర్వము ♦ తాసమున్ మముభోంట్లకున్.

రాజు—మహాకవీ! నీపేరేమి? చెప్పుము.

కవి—పండితులకుఁ దమపేరు సెప్పుట తగదు, అయినను జెప్పెదము తెలియుము.

ఆ. పాలుద్రావుబుద్ధి • సాలదు గంభీర
భావరమ్యమైన • పలుకుఁ దెలియ
నంబురాశిలోఁతు నర • యంగఁ జాలెదు
నంతపోడుగువేణు • యెప్పి గలదె?

దేవా! వినుము.

మధ్యాక్కర. పిడినశశిరేఖరతికలహమున విఱిగినకడెము
గూడఁ జక్రముసరిసేసి గిరిజనగుమొగము వెలయ
వేడుక నవ్వానిఁజూపెఁ బతికల వెలఁదివిభుండు
వాఁడు క్రీడాచంద్రుఁడును రదరుచిధవళితుఁడుప్రోచు.

కాళిదాసుఁడు—సఖా! క్రీడాచంద్ర! తడవులకుఁ గనఁబడితివి. ప్రతిమండలమున బహుధనులగు రాజులుండ నీకీయవస్థయేల?

క్రీడాచంద్రుఁడు:—

గీ. దానవిభవాభిశోభితుల్ • గాని ధనులు
నతిదరిద్రులలో ధుర్యు • లనఁదగుదురు
తెరువరులనీరువట్టును • దీర్పలేని
కతనమునభూమి కెనయగుఁ • గడలియేని.

క. హారములఁ గనకమణికే
యూరాటోపముల నన్య • లుర్వీనాథుల్
పేరువహింతురు భోజ
క్ష్మారమణుఁడు విద్యనే ప్ర • శంసనునెక్కున్.

క. కృతినందకయున్నన్ భూ
పతినామంబేని యెఱుక • పడదెన్నటికిన్
క్షితినాయకుఁ గొల్వునవ్యా
పృతిగల్గని కవికిఁ గీర్తి • వెలయదు జగతిన్.

మంత్రకారుఁడు :—

గీ. ఎవరుకబ్బమ్ములను రచి • యించువారొ !
యెరుకావ్యమ్ములంది పే • రెక్కువారొ !
వందనీయులు వారలు • వారుఘనులు
స్థిరముగాఁవారికీర్తి వ • సించుజగతి.

వరరుచి :—

చ. పలుకులఁ దేనెలుట్టిపడ • భావకులంగరఁగించు సత్కవీం
ద్రుల తెరువెట్లు? కేవలబు • ధుంపు గ్రహింపవలంతియయ్యెఁ కున్
గులరమణీలలామముల • కుందగు కౌతుకలేశసూచక
మ్ములు గడగంటి చూపులెటు?• పొల్చు నవేశపయోరుహాక్షికిన్.

రాజుక్రీడాచంద్రునకు నిరువదిగజేంద్రముల నైదూళ్ళ నిడియెను. అంత
రాజుంగవి పొగడుచున్నాఁడు.

గీ. కంకణమ్ము ధరింతురు • కన్నుదోయిఁ
గరకిసలయమ్మునం దిల • కముఘటింత్రు
భోజనరపాలుపగతుర • పూవుఁబోండ్ల
భూషణవిచిత్రభావము • పొలుచునౌర!

మెచ్చి రాజు మణుల నక్షరలక్షము నొసంగెను.

రామేశ్వరకవి.

ఒకప్పుడు ముదిమిచే నవయవములపట్టుదప్పిన రామేశ్వరుఁడను
నొకపండితుఁడు సభకువచ్చి యిట్లు చదివెను.

గీ. ఎచటనేపూరియును మేయ • నిష్టపడని
హరికినెందేని గజపల • లాశనమునఁ
దృప్తియగు ; నట్టులెందునే • నింతగానని
సుకవియును రాజసంపద • సుహితుఁడగును.

క. ఎవఁడేనియుఁ బోషింపఁగ
నవుజవనాశ్వములఁ బండి • తాగ్రేసరులన్
కవిరాజుల గజరాజుల
నవనీధపుఁడొక్కఁడుండె • యర్థ్యుఁడుసాఁకన్.

గీ. మేలిరవణమ్ములంబట్టు • చేలములను
శోభయగునెంతయును వార • సుందరులకు
విక్రమార్కాతిశయమ్మున • వితరణమున
రాజనందనులకుఁ గీర్తి • తేజరిల్లు.

అదివిని రాజు రామేశ్వరపండితునకు సర్వాభరణములర్పించి లక్షద్వయము నొసంగెను.

కవిపొగడుచున్నాఁడు.

గీ. రాజసుత్రామ! సద్గుణ • భ్రాజమాన!
భోజ! నీకీర్తికాంతకు • వ్యోమతలము
ఫాలభాగమ్మునందు డం • బమువహించు
గొప్ప కస్తురిబొట్టనఁ • గొమరుమిగులు.

గీ. చక్కఁగనతండె తెలియఁగ • జాలుకతన
బండితునిచెంతగుణములఁ • బలుకరాదు
ఎంతసెప్పినసుంతయే • నెఱుఁగలేమి
మోరకునిమ్రోలనుం జెప్పఁ • బోలదల్లి.

దానిచే నెల్లరుఁ జమత్కృతులైరి.

మఱల రామేశ్వరకవి :—

క. పనివడికవికబ్బమ్ముం
బొనరించును; లోకవిదిత • ముంజేయును స

జ్జనుఁడాదరమున, పలిలము
గనుఁగమలము; భాస్కరుండు ♦ గలిగించుసిరిన్.

రాజు సంతసించి ప్రత్యక్షరలక్షము నొసంగెను.
కవి రాజేంద్రుఁగుఱించి పలుకుచున్నాఁడు.

క. జగతియశమ్మునకై వే
డ్కఁగొనని కృపణుండువినఁడ ♦ కవితనొకప్డున్
మగతనము లేనిమానిసి
మృగీనయనమొదుటనున్న ♦ నేమియొనర్చున్.

సీత :—

క. పండిత కవులకు మదవే
దండములకు దైవనిహతి ♦ యయ్యెఁగటా! భూ
మండలపతి భవనమ్మం
దుండమిశోభావిశేష ♦ మొదవదు పెఱచోన్.

కాళిదాసుఁడు:—

క. అవితరణశీలుమదికిన్
గవీశ్వరునిపలుకుముదముఁ ♦ గల్పింపఁగ లే;
దవు! మూఁడుకాళ్ళముసలికి
నువిదవిలాసములు వెతనె ♦ యొదవించుఁగదే.

రాజు పండితులందఱకుఁ దలకొకలక్షము నొసంగెను.
ఇది శ్రీపీఠికాపురసంస్థాన కవీశ్వర, కవితాశాఖాకోకిల, విమర్శక పరివృఢ, వివిధావధాననిష్ణాత, వేంకటరామ కృష్ణాంధ్రీకృత భోజమహారాజ చరిత్రమునందు రాజ్యప్రాప్తి నామకము ప్రథమభాగము.

శ్రీరస్తు.

# సువృత్తతిలకము.

---

ఇది

శతావధానులు,

శ్రీపీఠికాపుర సంస్థాన విద్వత్కవులునగు

వేంకట రామకృష్ణకవులచే రచియింపఁబడినది.

మొదటికూర్పు.

కాకినాడ

1913

శ్రీసుజనరంజనీముద్రాక్షరశాలయందు

పోతాప్రగడ బ్రహ్మానందరావుచే ముద్రింపఁబడి

గ్రంథకర్తలచే బ్రకటింపఁబడియె.

వెల 0-4-0.

శ్రీరస్తు.

# సువృత్తతిలకము.

## ప్రథమవిన్యాసము.

చ. గిరిపతిపుత్త్రి పంచశర ♦ కేళుల నీసుజనింపఁగా గణే
శ్వరగురుఁగేరి విభ్రమవ ♦ శమ్మునఁ దత్కచమున్ గ్రహించుచోఁ
గరరుహరేఖ జాతె ననఁ ♦ గా దయివాఱెడు చంద్రమఃకలాం
కుర మహిరత్నరంజిత మ ♦ కుంఠసుఖమ్ముల మాకొసంగుతన్.

మంజరి. స్వచ్ఛందలఘురూపు ♦ జగదేకగురుని
స్పష్టవామనవృత్తుఁ ♦ జక్రిని దలఁచి
ఛందోనిధానము ♦ సద్వృత్తవేధ
సూనృతావాసు వ్యా ♦ సుని గొనియాడి
శిష్యశిక్షార్థమై ♦ క్షేమేంద్రసుకవి
విరచించినట్టి సు ♦ వృత్తతిలకముఁ
బరికించి యది మేలు ♦ బంతిగా నేము
రామకృష్ణులము వా ♦ గ్రామకిష్టులము
హావణింతు మొక్కింత ♦ యాంధ్రవాఙ్మయము.

క. ఛందమ్ముల నారసి త
త్సౌందర్యమ్మున్ గణించి ♦ సత్కావ్యములన్
బొందువడిన వృత్తమ్ముల
నెందుఁ గవుల్వాగడ సంగ్ర ♦ హించెద మిందున్.

దశమచ్ఛందమ్మగు పఙ్క్తియందు—

పర్వేన్ మ్నౌగ్యులు ♦ పణవం బయ్యెన్.

UUU మ, III న, I UU య, U X ఆఱింట యతి.

నీయుల్లం బోక ♦ నియతిం గార్యం
బాయత్తంబుగ ♦ ననుసంధింపన్
జేయం జాలవు ♦ చెడుత్రోవం బోఁ
బాయంద్రోవవు ♦ బలిమిం బుత్త్రిన్.

శ్రీపర్వము.

క్రాలన్ శుద్ధవి ♦ రాట్టు మస్జగల్

UUU మ, II U స, I U I జ, U X- ఆఱింట యతి.

ఉల్లం బప్రియ ♦ మొందఁ గ్రొత్త సం
ధిల్ల న్నవ్వగ ♦ దీన వక్త్రుఁ డై
యొల్లం బోవుచు ♦ నున్నె నవ్విభుం
డల్లం గౌఁగిట ♦ నాన్నృపాలకున్.

శ్రీపర్వము.

ఏకాదశ చ్ఛందం బగు త్రిష్టుప్పునందు—

తా నింద్రవజ్రం బగుఁ ♦ దాదగాలన్

UU I త, UU I త, I U I జ, U X, U X- ఎనిమిదింట యతి.

చింతాపరత్వంబునఁ ♦ జెందు దుఃఖా
క్రాంతత్వ ముర్వీశ్వర ♦ కాన నెప్డున్
జింతింపఁ డార్యాత్ముఁ డ ♦ చింతనుం డై
యంతఃపరీతాపము ♦ నార్పఁ జాలున్.

శ్రీపర్వము.

ఉపేంద్రవజ్రన్ జత ♦ లొప్పు జ్గాలున్

I U I జ, UU I త, I U I జ, U గ, U X- ఎనిమిదింట యతి.

మరుత్తనూజుం బరి ♦ మార్పఁ జూచుం
బరిస్ఫురత్కోపని ♦ బద్ధుఁడై యు
ద్ధరావిభుం డంచిది ♦ తల్గనేసం
స్మరించి యీకోపున ♦ మర్చికొంటిర్.

స్త్రీపర్వము.

పైరెంటి పాదముల్గలఁ ♦ బట్టి యెందు
చ్చరింతు రర్ద్ధా నుప ♦ జాతి నాఁగన్.

మునీంద్రి నిర్భాగ్యత ♦ ముట్టి చావం
గా నేరదయ్యెం గడు ♦ గట్టిచిత్తం
బనూనమూర్ఛం దెగ ♦ టాఱియుం దా
రా నేర్చె నిమ్మేనికిఁ ♦ గ్రమ్మఱంగన్.

స్త్రీపర్వము.

వాలు రేఫ నర ♦ వల్ రథోద్ధతన్
◡ I ◡ ర, I I I న, ◡ I ◡ ర, I ◡ వగణము. ఏడింట యతి

హారహీర ధవ ♦ ళాంశు నిర్మలో
దారకీర్తి రణ ♦ దర్ప సద్గుణా
వార వీరనిర ♦ వద్య మన్మథా
కార ధీర పర ♦ గండభైరవా.

సభాపర్వము.

స్వాగతంబు రన ♦ భల్ గగ మొప్పన్.
◡ I ◡ ర, I I I న, ◡ I I భ, ◡ గ, ◡ గ- ఏడింటయతి

వేగవంతుఁ డను ♦ వీరుఁడు సాంబున్
వేగవంతుఁ డయి ♦ వీఁకను దాఁకెన్

వేగబాణపద ♦ వీతతులన్ ది
గ్భాగముల్ విశిఖ ♦ పంజరముల్ గాన్.

ఆరణ్యపర్వము.

భద్రియిద్బోధక ♦ పద్యము గాయున్.

◡ ।। భ, ◡ ।। భ, ◡ ।। భ, ◡ ◡ గగము- ఏడింట యతి

మానుషజన్మము ♦ మాన్య వివేకా
మానస దుఃఖస ♦ మాజము నెల్లన్
దాన ఘటించుచు ♦ దైన్యముఁ దెచ్చుం
గాన భవం బిది ♦ గాల్పనె తండ్రీ !

స్త్రీపర్వము.

ద్వాదశచ్ఛందమ్మగు జగతియందు——

నలిఁ దోటకవృత్తము ♦ నాల్గు సలన్

।। ◡ స, ।। ◡ స, ।। ◡ స, ।। ◡ స. తొమ్మిదింటయతి.

నిరవద్య నరేశ్వర ♦ నిత్యనిరం
తరధర్మమతీ గుణ ♦ ధామ జగ
త్పరిపూరితకీర్తీ వి ♦ భాసి విభా
కరతేజ నృపోత్తమ ♦ కాంతినిధీ !

ఆదిపర్వము.

మఱియు——

సతతంబును శిష్యులు ♦ సద్వినయా
న్వితులై ప్రణమిల్లెడు ♦ వీరి పద
ద్వితయంబు గదుం జెడఁ ♦ దిన్నవి సూ
చితె నక్కలు దైవము ♦ చెర్దుఁ గటా !

స్త్రీపర్వము.

ద్రుతవిలంబిత ♦ మాధి నభభ్రముల్.

| | | న, ⏑ | | భ, ⏑ | | భ, ⏑ | ⏑ ర- ఏడింట యతి.

త్రిభువనాంకుశ ♦ దీప్తినిధీ సమ
స్త భువనాశ్రియ ♦ ధర్మధురంధరా
శుభయశః పరి ♦ శోభితపూర్వది
క్ప్రభు విలాస కృ ♦ పారసబంధురా.

ఆదిపర్వము.

మఱియు—

చనఁగ నాతఁడు ♦ సాత్యకి వాయునం
దనుఁడు గాండివి ♦ దమ్ములు సూరెలం
జనిరి ద్రౌపది ♦ సంభృతశోక యై
చనియెఁ జుట్టపుఁ ♦ జానలు చుట్టిరా.

స్త్రీపర్వము.

భుజంగప్రయాతం బ ♦ వుఙ్ నాల్గు యాలఙ్

| ⏑ ⏑ య, | ⏑ ⏑ య, | ⏑ ⏑ య, | ⏑ ⏑ య.

ఎనిమిదింట యతి.

వినీతుండ వై ధర్మ ♦ వేదిత్వబుద్ధిం
దన ర్పొందు నీ విట్లు ♦ దైన్యాతిరేకం
బునం బొంగి శోకాగ్నిఁ ♦ బొక్కంగఁ గుంతీ
తనూజాగ్రజుం డాత్మఁ ♦ దాఁ గుంద కున్నే.

స్త్రీపర్వము.

రద్వయిఙ్ రద్వయిఙ్ ♦ స్రగ్విణీవృత్త మా.

⏑ | ⏑ ర, ⏑ | ⏑ ర, ⏑ | ⏑ ర, ⏑ | ⏑ ర.

ఏడింట యతి.

యీబాలు సూర్యనిభు ♦ నిట్టుల పెట్టి పోవం
గా బుద్ధి పుట్ట దని ♦ కన్య మనంబులోనన్.

ఆదిపర్వము.

రహి౼ ననభనవల్ ♦ పరిహారణకలితన్

। । । న, । । । న, ∪ । । భ, । । । న, । ∪ వగణము-

ఎనిమిదింట యతి.

ఇది యిటు లగు ట ♦ ెఱిఁగి పలికె నా
విదురుఁడు సభఁ గో ♦ విదులు వొగడఁ గా
నది వినియును నే ♦ నడపన దురితం
బొదవెఁ గలనఁ జే ♦ టొలయ కుడుగు నే

స్త్రీపర్వము.

పంచదశచ్ఛందంబగు నతిశక్వరియందు—

ననమయయల నొప్పన్ ♦ మాలినీవృత్త మెన్నన్

। । । న, । । । న, ∪ ∪ ∪ మ, । ∪ ∪ య, । ∪ ∪

య- తొమ్మిదింట యతి.

సురపతిసభఁ జూడం ♦ జూడ నంగారవృష్టుల్
కురిసెఁ గులిశధారల్ ♦ గుంఠితంబయ్యె దిక్కుం
జరమదము లడంగెన్ ♦ సర్వదిక్పాలకాంత:
కరణములు భయోద్వే ♦ గంబునన్ సంచలించెన్.

ఆదిపర్వము.

మణిగణనికరము ♦ మహి౼ ననననసల్

। । । న, । । । న, । । । న, । । । న, । । ∪ స- తొమ్మిదింట యతి.

గొడుగులపఱియలు ♦ గురుకులు గొనుటన్
సిడములతునియలు ♦ సెదరి యునికిఁ బెం

దడఁ బడి పదగలు ♦ దఱచు మురియ లై
పుడమిఁ గలయుటకుఁ ♦ బాగు లొలయ మదిన్

స్త్రీపర్వము.

అందమైన మణిభూషణ ♦ మా రనభారలన్
∪ | ∪ ర, | | | న, ∪ | | భ, ∪ | | భ, ∪ | ∪
ర, పదింట యతి.

రామవిక్రముఁ డజేయుఁడ ♦ రాతిగజాన్
సామజాహితుఁడు సాంబుఁడు ♦ సాల్వచమూపతిన్
క్షేమవృద్ధి యనువాని స ♦ కృత్రిమసాహసో
ద్దామఁ దాఁకె శరధారల ♦ ధాకఁ గప్పుచున్

అరణ్యపర్వము.

షోడశచ్ఛందమ్మగు నష్టియందు—

నభజజాగలుగ ♦ నందగుఁ బద్మకమందొగిన్.
| | | న, ∪ | | భ, | ∪ | జ, | ∪ | జ, | ∪ | జ,
∪ గ, ఎనిమిదింట యతి.

కోమటిపల్కువిని ♦ కూడదు నాకనురాత్మజుఁడై
కడఁగిమీఁకునప ♦ కారము సేసిధరిత్రి వె
ల్వడఁగఁబంచెఁగడుఁ ♦ బాపమతిన్ ధృతరాష్ట్రుఁడా
య్యెడలమర్జనుల ♦ నేమఱినమ్మఁగఁ బోలునే.

ఆదిపర్వము.

మెలఁగెడు నజ్భ జర్గములు ♦ మేదినిం గనంగన్.
| | | న, | ∪ | జ, ∪ | | భ, | ∪ | జ, ∪ | ∪ ర, ∪ గ,
పదునొకంట యతి.

విను మిటు లేటికిం జనిన ♦ వృత్త మూఁది యల్లఁగా
జనము నుతించు నీదు గురు ♦ సారధీరబుద్ధిఁగా
నిను నతిశాంతచిత్తయని ♦ నిక్కమేనుగంటను
నృశంసమున నిట్టి నీకగున ♦ మత్సరంబు నతా.

స్త్రీపర్వము.

రహిం జెప్పన్ వచ్చున్ యమనసభవల్ ♦ గాఁ శిఖరిణిన్.

I ⌣ ⌣ య, ⌣ ⌣ ⌣ మ, I I I న, I I ⌣ స, ⌣ I I భ

I ⌣ వగణము. పదుమూఁడింట యతి.

తపస్స్వాధ్యాయాది క్షపితమలచి ♦ త్తప్రకలితా
విపజ్జ్వాలజ్వాలా విరమణసుధా ♦ వృష్ట్యంలలితా
జపాపుష్పస్ఫూర్తిచ్ఛవికిరణసం ♦ సర్జనధురా
సదా వ్యావిర్భావా స్తవనకలన ♦ స్థైర్యమసురా.

స్త్రీపర్వము.

జసల్ జసయవంబులున్ వ్రాయుదువ ♦ జక్కఁగాఁ బృథ్వియా.

I ⌣ I జ, I I ⌣ స, I ⌣ I జ, I I ⌣ స, I ⌣ ⌣ య,

⌣ వగణము. పండ్రెండింట యతి.

అమూల్యమణిభూషణమ్ములు ఖ ♦ జాశ్వబృందంబులున్
సమృద్ధధనధాన్యరాసులుఁ బ్ర ♦ శస్తగోవర్గముం
గ్రమంబునను భూసురేంద్రుల క ♦ గణ్యపుణ్యార్థియై
యమర్త్యనిభుఁ డిచ్చెఁ బాండువిభుఁ ♦ డత్యుదారస్థితిన్.

ఆదిపర్వము.

నజభజజల్ వయుం గలయ ♦ నర్కుటవృత్త మగున్.

I I I న, I ⌣ I జ, ⌣ I I భ, I ⌣ I జ, I ⌣ I జ, I ⌣

వగణము- పదునొకంట యతి.

వినుము మరుత్తనూభవుఁడు ♦ విశ్రుత ధర్మగతిం
జనక కుమారిక్షితీశ్వరుని ♦ జంపె గదాసమరం
బున నది యే మోదింగి చని ♦ పోయిన రేయిఁ గనుం
గనలున ముట్టి మువ్వురము ♦ గొర్వ్యముదగ్రముగన్.

స్త్రీపర్వము.

మందాక్రాంతన్నిలుపఁగదగున్ ♦ మభ్నతల్తంబుగాయున్.

⌣ ⌣ ⌣ మ, ⌣ I I భ, I I I న, ⌣ ⌣ I త, ⌣ ⌣ I
త, ⌣ ⌣ గగము. పదునొకంటయతి.

వీణానాదప్రియమునిగమా ♦ విర్భవత్సారఘాన్యా
శ్రేణీసంపాదితవిమలతా ♦ స్థేమనిర్లేపచిత్త
త్రాణక్రీడాకలనసతతో ♦ త్సాహవద్దివ్యభావా
ప్రాణాపానాహరణనిపుణ ♦ ప్రాపణీయానుభావా.

స్త్రీపర్వము.

అష్టాదశచ్ఛందంబగు ధృతియందు.

మానుగా రసజాభ రేఫల ♦ మత్తకోకిల వృత్తమౌ.

⌣ I ⌣ ర, I I ⌣ స, I ⌣ I జ, I ⌣ I జ, ⌣ I I భ
⌣ I ⌣ ర, పదునొకంటయతి.

ఆది దేవుఁడవైననీవు ద ♦ యామతిం బొడసూపి న
న్నాదరించుటఁ జేసిధన్యుఁడ ♦ నైతినింతకు నెక్కుడౌం

దేవి గల్గెదు నైననామది ♦ యెల్లనాఁడును గ్రోధమో
హాదులం బెడఁబాసి ధర్మువు ♦ నందు నెక్కొనఁజేయవే.

ఆరణ్యపర్వము.

ఏకోనవింశచ్ఛందంబగు నతిధృతి యందు—

సౌరాష్ట్ర మసజసతతమ్ములు గమ్మా ♦ శార్దూలవిక్రీడితమ్.

U U U మ, । । U స, । U । జ, । । U స, U U ।
త, U U । త, U గ. పదుమూఁడింట యతి.

రాధేయుండును దుస్ససేనుఁడును బో ♦ రం బ్రాపుగాఁ బాండవ
క్రోధజ్వాలల నార్తు నుండొకఁడు నా ♦ కుంద్రోడ నీవింక నేఁ
శాఖంబెట్టుకు వాఁడిసూచి మొనమో ♦ పంజాలు నంతేని నే
సినాత్రితలమీఁదువార్లను నా ♦ కేవింత సేగింబడన్.

ఉద్యోగపర్వము.

ఎలమి నభరసజాగముల్ వడి ♦ యుపదిగాఁ దరళంబగున్.

। । । న, U । । భ, U । U ర, । । U స, । U । జ,
। U । జ, U గ. పండ్రెండింట యతి.

కులపవిత్రసితేతరోత్పల ♦ కోమలంగామలవర్ణయు
త్పలసుగంధి లసన్మహోత్పల ♦ పత్త్రనేత్ర మదాలికుం
తలవిభాసిని దివ్యతేజముఁ ♦ దాల్చియొక్కకుమారి ద
జ్జ్వలనకుండమునందుఁబుట్టెఁ బ్ర ♦ సన్నమూర్తి ముదంబుతోన్.

వింశచ్ఛందంబగు కృతియందు—

మహిఁ గూర్పం దగు సభ్రనమ్యవములన్ ♦ మత్తేభవిక్రీడితమ్.

। । U స, U । । భ, U । U ర, । । । న, U U U
మ, । U U య, । U వ, పదునాలుగింట యతి.

కలఁగెం బోయున్నసప్తకంబు గిరివ ♦ ర్గంబెల్ల నూటాడె సం
చలతంబొందె వసుంధరావలయ మా ♦ శాచక్రిమల్లాడెఁ గొం
దలమందెం దిగ్దశేంద్రుపట్టణము పా ♦ తాళంబు ఘూర్ణిల్లె నా
కులమయ్యెం గ్రహతారకాకులము సం ♦ క్షోభించె నవ్వేళయుఁ.

విరాటపర్వము.

ఉత్పలమాలికఁ భరన ♦ యు క్తిని భారలగమ్ములొప్పెడిఁ.

◡ । । భ, ◡ । ◡ ర, । । । న, ◡ । । భ, ◡ । । భ
◡ । ◡ ర, । గ, ◡ గ. పదింట యతి.

శూరుఁడవంచుఁ నినమ్మినను ♦ సాచ్చుట శౌర్యము వొప్పెనూనమే
యూరికిఁబోయె నాజ నృపు ♦ లోడును రేనృపుఁడన్న మాత్రినే
కౌరవవంశజాతుఁడవు ♦ గప్పపు జావురఁ దెచ్చుకొంటి నీ
పేసను బెంపుమాలి యరి ♦ బృంధమునవ్వఁగ నిట్లుసేయు దే.

శల్యపర్వము.

భాన్వయముఁ నసవంబు సజక్కఁగ ♦ బొల్పు నంబుసహాంబగుఁ

◡ । । భ, ◡ । । భ, ◡ । । భ, ◡ । । భ. ◡ । ◡
ర, । । ◡ స, । ◡ న. పదునాఁడింట యతి.

పెద్దయుఁగాలము వారలఁ జూడక ♦ పేర్మిముడించుచు మర్భరా
పద్దశనుంచుట నమ్మహితాత్ముల ♦ పట్టులందటఁ దుర్గింగుటఁ
దద్దయుశోకముసంభారి నశుగ్రి ♦ ధారలొల్కవగద్భుతో
నద్దురవస్థ తెలుంగునుండొని ♦ యంశకంపిను నార్తుతై.

స్త్రీపర్వము.

ఏకవింశచ్ఛందంబగు ప్రకృతియందు—

నజభజజల్ జరేఫలఁ బె ♦ నం గొనఁ జంపకమాల యయ్యెనుర్విన్.

| | | న, | U | జ, U | | భ, | U | జ, | U | జ, | U | జ, U | U ర, పదునొకంట యతి.

వినుమునవేంద్ర విప్రుఁడలి ♦ నేఁ జమదగ్నిసుతుండు శాపమి
చ్చె నమరభర్త వంచనము ♦ సేసె వరంబని కోరి కుంతి మా
న్చె నలుక భీష్ముఁ డర్థరథుఁ ♦ జేసి యథంబెఁ గలంచె మద్రరా
జనుచితమాడె శౌరి విధి ♦ యయ్యె ననుండటఁ జంపెఁ గర్ణునిన్.

శాంతిపర్వము.

మ్రభ్నల్ నాల్గుయకారల్ ♦ శ్రేయముగఁ బలుకన్ ♦ స్రగ్ధరా వృత్తమయ్యెన్.

U U U మ, U | U ర, U | | భ, | | | న, | U U య, | U U య, | U U య, ఎనిమిదింట, మఱల నెనిమిదింట యతి.

అంతం గాంతేయుఁడత్యా ♦ యతభుజుఁడు వసుం ♦ ధర్మపాంచాలు దంతి
ధ్వాంతంబుల్ వానివాహో ♦ త్తమతురగతతిన్ ♦ దక్షుటోదార తారా
సంతానంబుల్ శరాంశూ ♦ చ్చయవిభవములన్ ♦ శాంతిఁ బొందించి యుక్క
ధ్వాంతారాతి ప్రభుండై ♦ తనరుచు వెలిఁగెన్ ♦ దక్షిణవ్యోమవీథిన్.

ఆదిపర్వము.

ద్వావింశచ్ఛందమ్మగు నాకృతియందు—

న్గసనసాగ్రిగమ్ములంగ ♦ చ్ఛఁజలుక మహా ♦ స్రగ్ధరావృత్తమయ్యెన్.

। U స, U U । త, U U । త, । । । న, । । U స, U । U ర, U । U ర, U గ. తొమ్మిదింట, మఱల నెనిమిదింట యతి.

అతిరౌద్రాకారలీలా ♦ యతజవదహనో ♦ గ్రాగ్రసేనానిపీడా
హతులైనానావిఘ్నోపా ♦ యనములుగొనిసా ♦ హార్ద్రవాంఛన్ జయశ్రీ,
శ్రితబాహుంగానఁగావ ♦ చ్చిరిసకలజగ ♦ త్సేవ్యమానున్ మహేంద్ర
ప్రతిముం గౌరవ్యవంశ ♦ ప్రభునఖిలమహీ ♦ పాలునాంబాలికేయున్.

ఆదిపర్వము.

ఏ శుభకారము లోకగమున్ వచి ♦ యించినమానిని యంద్రుకవుల్

U । । భ, U । । భ, U । । భ, U । । భ, U । । భ, U । । భ, U । । భ, U గ. పదుమూఁట యతి.

ఏచి తనర్చి తలిర్చిన క్రొవ్వుల ♦ నిమ్మగు మావుల జొంపములన్
జూచి సమంచి యశోకములన్ సుర ♦ పొన్నలఁ బొన్నల గేదఁగులం
గాచి బెడంగుగఁ బండిన యాసహ ♦ కారములం గదళీతతులం
జూచుచు వీనులకింపెసఁగన్ విను ♦ చున్ శుకకోకిలసుస్వరముల్.

ఆదిపర్వము.

త్రయోవింశచ్ఛందమ్మగు వికృతియందు——

నగణము నాఱు జలున్ వముఁ గూరిచి ♦ నంగవిరాజవిరాజితమౌ.

। । । న, । U । జ, । U । జ, । U । జ, । U । జ, । U । జ, । U । జ, । U వ. పదునాల్గింటయతి.

రజనికరాననఁ బిసపయోధర ♦ రాజితరాజసుతన్ విలస
ద్గజపతిగామినిఁ గంజగంధిఁ బ్ర ♦ కాశితకాంతిసమన్వితఁ బం

రలఁదొమ్మిదింట యతి.

ఈతఁడురణంబునకు ♦ నెత్తిచనుచుండియును ♦
నెంతయును భక్తిఁగనినాకుం
బ్రీతిమెసఁగంబలికి ♦ ప్రేమమొలయం బొగడి ♦
పెద్దయువినీతి నిరతుండై
చేతులు మొగిడ్చిజయ ♦ సిద్ధియుఁగ దీవనవి ♦
శిష్టదయ నిమ్మనిన ధర్మం
జేతల ననూనమగు ♦ నిర్ధనయమాతలకు ♦
నెట్లయిన సిద్ధమగునంటిన్.

స్త్రీపర్వము.

మాలికావృత్తములందు—

సమ్మతిమెయిం భజన ♦ నమ్ములపయిం భజన
నమ్ములఁ గ్రిమమ్మునభ ♦ యమ్ముల, లయగ్రా
హిమ్ములపెవ్రాసపిర ♦ మమ్ములను నాలిగిటి
నెమ్మినిసుదుర్ ప్రతిప ♦ దమ్మునఁ గపీంద్రుల్

U I I భ I U I జ I I U స I I I స U I I భ I U
I జ I I U స I I I స U I I భ I U U య. తొమ్మిదింటఁ
దొమ్మిదింటఁ పొమ్మిదింటఁ బ్రాసయతి.

కమ్మనిలతాంతములు ♦ కుమ్మనసివచ్చు మధు
పములు సుగీతనిన ♦ దమ్ములెసఁగం జూ

తమ్ముల లసత్కేసర ♦ యమ్ముల సుగంధిముకు
తమ్ములను నానుచు ము ♦ దమ్మొనరవాచా
లమ్ములగు కోకిలకు ♦ లమ్ములరవమ్ము మధు
రమ్ముగుచు వీచెనని ♦ శమ్ము సుమనోభా
రమ్మున నశోకనిక ♦ రమ్ములును జంపక చ
యమ్ములు నుగింశుకవ ♦ నమ్ములును నొప్పెన్.

ఆదిపర్వము.

నసిపడఁగఁ బ్రాసయుతు ♦ లొసఁగి నలుమాఱు వెస
నసన నసనంబులును ♦ నసన నసనంబుల్
విసువక రచించు నెడ ♦ నసదృశమనంగఁ దగు
పసలయు విభాతియగు ♦ రసికజనులారా!

| | | న | | ∪ స | | | న | | | న | | ∪ స | | | న
| | | న | | ∪ స | | | న | | | న | | ∪ స | | | న ప

దింటఁ బదింటఁ బదింటఁ బ్రాసయతి.

అరయనిది పెద్దయని ♦ యతుల మొనఁజత్తమున
సరకు గొనకుగ్రమగు ♦ బరవస మెలర్పం
ద్వరితగతిఁ జొచ్చి కురు ♦ వరుఁడు దలఁకఁగఖిసి
కరతతులు దేరులని ♦ కరములుఁ దురంగో
త్కరములును గాల్బలము ♦ నరవరులుఁ గీడ్పడఁగ
శరగురుఁడుఁ గర్ణుడును ♦ గురుసుతుఁడు మద్రే
శ్వరుఁడుఁ గృపుఁడుం బఱపఁ ♦ బరఁగిది విజుల్వొగడ
ధరఁబడి ముకుందుఁ డను ♦ నరతనయుఁడొప్పెన్.

స్త్రీపర్వము.

ఆరంభమందుండ కారంబు గానీ న కారంబు కానీ స కారంబుకానీ హ కారంబు కానీ ఘటింపం దగుఁ మీఁద నెల్లం ద కారంబె వల్కంగఁ బోలుంగ కారావ సానంబుగా; దీనినే దండకం బండ్రు విద్వన్మణుల్.

త, న, స, హ, గణములలో నొకటి మొదలనిడి, తక్కిన వన్నియుఁ దగణములే కూర్చి చివరనొక గురువు పెట్ట వలయును. యతి ప్రాస నియమము లేదు.

శ్రీకంఠ లోకేశ లోకోద్భవ స్థాన సంహారకారీ పురారీ మురారిప్రియా చంద్రధారీ మహేంద్రాది బృందారకానంద సందోహ సంధాయిపుణ్యస్వరూపా...సురభ్యర్చితా నాకునభ్యర్థితంబుల్ ప్రసాదింపు కారుణ్య మూర్తీ త్రిలోకైకనాథా నమస్తే నమస్తే నమః

ఆరణ్యపర్వము.

జాతులందు——

గగభజసనసలలఁగందం

బగు,మూఁడైదును బదమ్ముఁ ♦ లాఱిటనలజల్

దగు; సరిని మూఁటిపైయతి;

జగణము బేసింబడదు; కొ ♦ నసీగురువొప్పుఁ.

గగ, భ, జ, స, నల, ములఁ గందముఁ జెప్పనగును. మూఁడు గణములొక పాదము నైదు గణములొక పాదమునగును. మొదటి నుండి యాఱవగణము నల, జ, గణములలో నొకటి గావలయును. రెండవ పాదమునందు మూఁడుగణములమీఁద యతి నిలుపవలయును. జగణము బేసి గణ మెప్పుడుగాఁ జనదు. కొనయందు(అనగా రెండవ పాదముతుదను) గురువుండును. ఇదిపూర్వార్థము. ఉత్తరార్థము నిట్లే యుండును.

క. సారథియు రథియు నై రొక
తేరం గృష్ణు లతిఘోర ♦ తేజస్స్పార
స్ఫారతఁ దోఁచిన నైనను
ధీరత వాటించి పిదపఁ ♦ దెలిసెదవు బలే.

ఉద్యోగపర్వము.

ఊహ సేయ సూర్యగణము ♦ లొప్పు నేడు, గురువు,ను
త్సాహ వృత్తమందు యతి పా ♦ సంగు నాలుగింటిపై
ఏడు సూర్యగణములు నొకగురువు. నాలుగుగణముల మీఁదయతి.
ఏల దీని నెడయుఁ జేయ ♦ నీక్షణంబ యేఁగి పాం
చాలుఁ బట్టి తెత్త మధిక ♦ శౌర్యలీల మెఱయఁగాఁ
బోలు ననుచుఁ బెరిఁగి రాజ ♦ పుత్త్రు లెల్ల నరిగి పాం
చాలుపురము ముట్టికొనిర ♦ సంఖ్యబలస మేతులై.

ఆదిపర్వము.

ఇంద్రులుముప్వురు ♦ నినుఁడొకఁడట్టు
లింద్రులు ముప్వురు ♦ నినుఁడునొక్కండు
క్రందుగా రెండేసి ♦ గణములమీఁదఁ
గడుకొనియతినిల్పఁ ♦ గ్రాలుఁదరోజ.
3 ఇంద్రగణములు 1 సూర్యగణము 3 ఇంద్రగణములు 1 సూర్యగణము. రెండేసిగణములమీఁదఁయతి. ఇదియొకపాదమగును. తక్కిన పాదములు నిట్లే.

ఏలయమ్మునినాకు ♦ నిచ్చెనిమ్మంత్రి
మిమ్మంత్రశక్తియే ♦ నెఱుగంగ వేఁడి
యేలపుత్త్రికుఁగోరి ♦ యెంతయుభక్తి
నినుఁదలంచితిఁబ్రీతి ♦ నినుఁడునునాకు

సీ. ఈతండు వృద్ధని ♦ యెఱిఁగిపూజించితే
వసుదేవుఁ డుండంగ ♦ వసుమతీశ!
ఋత్విజుం డని విచా ♦ రించి పూజించితే
ద్వైపాయనుం డుండ ♦ ధర్మయుక్తి
నాచార్యుఁడని విన ♦ యమునఁ బూజించితే
కృతమతుల్ ద్రోణుండుఁ ♦ గృపుఁడునుండ
భూనాథుఁ డనియెదు ♦ బుద్ధిఁబూజించితే
యాదవుల్ రాజులే ♦ యవనిలోనఁ

ఆ. వె. బూజనీయులైన ♦ పురుషులలోపల
నెవ్వఁ డయ్యెఁ గృష్ణుఁ ♦ డిట్టులేల
పూజ్యులైనవారిఁ ♦ బూంజవనొల్లక
భీష్ముపలుకుఁ జేసి ♦ చేలవైతి.

గీ. ఉత్తమజ్ఞానవృద్ధు నా ♦ నుండునేని
బాలుఁడయ్యును బూజ్యుండు ♦ బ్రాహ్మణుండు
క్షత్రియుఁడు పూజ్యుఁ డమితవి ♦ క్రమసమృద్ధి
నుర్విపతులలో నధికుఁడై ♦ యుండెనేని.

సభాపర్వము.

జాత్యుపజాతి సామాన్యలక్షణము.—

క. తొలి యడుగు మొదల గురులఘు
వుల నెయ్యది నిల్పుఁ దాని ♦ బూనిక మూఁడ
డ్గులకుఁ మొదళ్ళఁ గ్రమ్మఱ
వెలయింపఁ వలయు జాతి ♦ వృత్తములందుఁ.

క. విరమణములన్ గై యొకచో
విరచింపఁగనగును బ్రాస ♦ విరతులు ప్రథమా
క్షర మిచ్చుకు వచ్చిన యటు
లురవడి నుకువంగవచ్చు ♦ నుపజాతులలోన్.

సీ. సంస్కృతమ్మున ♦ యందు సర్వకావ్యమ్ములఁ
బరికించి క్షేమేంద్ర ♦ పండితుండు
విరచించె నెల్ల యా ♦ వృత్తతిలకము ; లాం
ధ్రమ్మునందుఁ గవిత్ర ♦ యమ్ము భార
తామ్నాయఘక్కిక ♦ యందు వాఁడుచ్చిన
వృత్తరత్నమ్ములు ♦ వివిధకావ్య
సముచితక్రమములు ♦ సరళతరమ్ములు
సర్వకవీశ్వర ♦ సమ్మతములు

గీ. కర్ణపుటపేయములు నగుఁ ♦ గాన వానిఁ
దక్క నితరముశైన వృ ♦ త్తములఁ బృచ్ఛ
కులు వధానమ్ములందును ♦ గోరఁ జనదు
విషమమాత్రా పవిత్రమా ♦ న్వితములగుట.

ఇది శ్రీసూర్యారాయ నృపచంద్ర ముఖ్యాశ్రిత వేంకట
రామకృష్ణ విరచితంబగు సువృత్తతిలకమునందు
వృత్తావచయంబను ప్రథమవిన్యాసము.



# సువృత్తతిలకము.

## ద్వితీయ విన్యాసము.

ప్రసిద్ధము లగు వృత్తములకు లక్ష్యలక్షణములు సంగ్రహించిన పిదప నిపుడు వాని గుణదోషములు ప్రదర్శింపఁ బడు చున్నవి—

ఉ. ఆఱును నేడుఁ బాదమున ♦ కక్షరముల్ గల వృత్తమందు స
వ్వారిజసంభవాస్యముల ♦ వాస మొనర్చెడు వాణి నిల్వఁగా
నేరదు ; ఫుల్లపంకజ వ ♦ నిన్ విహరించెడు తేఁటి మల్లికా
కోరక కోటిపైఁ బడము ♦ గూర్పఁగఁజాలు నొకో యొకప్పుడున్ ?

ఉక్తాది సప్తచ్ఛందమ్ములఁ బుట్టిన వృత్తములు సరస్వతీ విశ్రామ యోగ్యములు గా వని యెఱుంగునది. భారతామ్నాయమునందుఁ గవిత్రయ మష్టమ నవమ చ్ఛందమ్ములం బొడమిన వృత్తములనైన ము పయోగపఱుపలేదు. కావుననే యప్పకవియు :—

" గీ. అడుగులకు వర్ణములు గొంచె ♦ మగుటఁ జేసి
యందు నుక్తాప్రభృతినవ ♦ చ్ఛందములను
బొడము వృత్తములకు నెల్ల ♦ వడులు లేవు
నాల్గు పదములఁ బ్రాసముల్ ♦ నడచుఁ గాని.

అని యతినియమము సేయక యా వృత్తముల కరమాఱియతను సూచించెను. కాని యష్టమ చ్ఛందోభవం బగు విద్యున్మాలావృత్తము నకు లక్షణముఁ జెప్పుచు:—

" శ్రీదేవీధా ♦ శ్రీప్రాణేశా !
యాదిత్య జ్యే ♦ ష్ఠాదిస్తుత్యా !
వేదోద్ధర్తా ♦ విద్యున్మాలం

తాను యతి నిల్పుటచే నా వృత్తమునకు మాత్రము భారతేతరగ్రంథములయందు నెందేని ప్రచారముండునని తెలియవచ్చును. సులక్షణసారమునందును యతినిబంధనము గలదు.

" ఉద్యన్మాత్రా ♦ యుక్తం బైనన్
విద్యున్మాలా ♦ వృత్తం బయ్యెన్ "

లేక యీ లాక్షణికులు "విశ్రామస్స్యా ద్వేద్వైర్వేద్వైః అను శ్రుతబోధోక్తమార్గము నేని యనుసరించియుందురు. ఎట్లయి; నీ వృత్తము శ్రావ్యమయినదని ఫలితము.

గీ. "పాదుగువృత్తము లసమాస ♦ ములఁ జెలంగుఁ
జిన్నవి సమస్తపదములఁ ♦ జెన్నుమిగులుఁ
బండితకవీంద్రు లుపయోగ ♦ పరతఁ జేసి
యేగతిరచించిరేనియు ♦ నింపు పుట్టు.

ఉపజాతిభేదములకు సాంకర్య మెట్టులయిన నున్నదియే. అయినను బ్రథమపాదమునందలి పూర్వాక్షరము లఘువుగాఁ జేయుట హృద్యము.

మార్కండేయపురాణమునందు—

ఉపజాతి—స్వరోచిజన్మంబును ♦ వర్తనంబున్
స్వారోచిషాద్యప్రభ ♦ వంబు విన్నన్
నరుండు నిత్యోన్నతి ♦ నవ్యకీర్తి
శ్రీరమ్యుఁడై ధాత్రిఁ బ ♦ సిద్ధికెక్కున్.

క. వాఁడికొనగల దారము ♦ జాడ లఘుము
ఖమ్ము పద్యము కర్ణరం ♦ ధ్రమ్ముఁ జొచ్చుఁ

గడను ముడినద్దు నూత్రము ♦ కరణి గురుము
ఖమొప్పఁకించుక కర్ణవే ♦ ధమ్ముఁ జేయు.

మూఁడేసి యక్షరములకుఁ దెగ దోధకము మనోజ్ఞముగనుండును. అట్లుగాకున్నఁ దాళము దప్పినట్లు విశ్రాంతిని బాయును.

భోజరాజీయమునందు—

దోధకము—చందన కుంకుమ ♦ సంయుత వక్షా
కుందను కుట్మల ♦ కోమల ధామా,

విఱుపులు సరి గాకుండుటకు నందే యుత్తరార్థము.

నందితభక్తజ ♦ నప్రియయోగా
నంద యహోబల ♦ నాథ నృసింహా.

ఎడఁబడిన యల్పసమాసములఁ బృథ్వి పెంపొందును, దీర్ఘసమాసముల నదియే పాడవడఁగి పొట్టిది యగును.

ఆదిపర్వమునందు—

పృథ్వి—ఉపాంశువధఁ జేసి మధ్యను మ ♦ దోద్ధతుం జంపిని
స్వపత్నముగ ధర్మనందనున ♦ శక్తు బంధించి యే
నపాండవముగా సముద్రవల ♦ యాఖిలక్షోణి మ
త్కృపాణపటుశక్తి నత్యధిక ♦ కీర్తినే యేలెదన్.

దీర్ఘసమాసములకు నందే

పృథ్వి—శిలాంశమణికోటిసంఘటిత ♦ దివ్యదేహంబుతోఁ
దిలోత్తమ యనంగ నొక్కయువ ♦ తీలలామంబు ను
త్పలాక్షి సృజియించె సర్వగుణ ♦ భాసిరూపక్రియా
కలావిదుఁడు విశ్వకర్మ దన ♦ కౌశలం బేర్పడన్.

నన్నయభట్టు పృథ్వికిఁ బండ్రెండింట యతినిల్పఁ గొందఱాత నిమార్గము గమనింపక "వసుగ్రహయతిశ్చ పృథ్వీ" అను సంస్కృతో క్తమార్గము ననుసరించి తొమ్మిదింటయతిఁ గూర్చిరి. అప్పకవి నన్న యమార్గమునసనే సూత్రించెను.

తొమ్మిదింట యతి నిల్పినందులకు నైషధమునందు—

పృథ్వి—చతురుముఖవిలాసినీ ♦ శయవిలాసపంకేరుహా
శ్రితామృతమధూళికా ♦ సురభిసారసారస్వతా
వితీర్ణమహిమార్ణవా ♦ విభవయోగసంక్రందనా!
ప్రతాపగుణభూషణా ♦ పరిణతార్థసంభావణా.

తఱచుగా నాకారాద్యక్షరములుగల శార్దూలము శ్లాఘ్యము.

కళాపూర్ణోదయమునందు—

శా. ఆవాలుంగనుదోయి యానగుమొగం ♦ బాగుబ్బపాలిండ్ల పెం
పావేణీభర మాతనూవిలసనం ♦ బాయొప్పు లేఁ జెప్పినన్
గైవారంబగుఁగాదె కేవలశిరః ♦ కంపంబుగల్పించి యా
హా! పుట్టింపదె యిక్షుధన్వునకు న ♦ య్యబ్జాక్షి నీక్షించినన్.

విపరీతమునకు నాముక్తమాల్యదయందు—

శా. అర్థావాగ్విబుధ మ్మహోవచనక ♦ వ్యాహార మాహోవచ
స్సిద్ధ మ్మాఃకృత తాంగతఃకలి రితి ♦ శ్రీసూక్తి విద్యాధర
మ్మిద్ధార్థత్యమగా ల్లయంహి కుధియా ♦ మిత్థంవదత్కింనర
మ్మద్ధీరాగ్రణి గెల్పుటుత్సవమునం ♦ దయ్యె న్నభమ్మంత యున్.

పూర్వార్థమునందుఁ బాదములు వేఱ్పడుటయు నుత్తరార్థ మునందు సమాసభూయస్త్వమును శార్దూలవిక్రీడితమునకు శోభా వహము.

ఆరణ్యపర్వమునందు—

శా. గీర్వాణప్రవిముక్తబాణపటల • క్రీడావిలూనాంజులై
గర్వోన్మత్తసురారిశీర్షములు వీఁ • కన్ డొల్లెఁ గల్పచ్ఛిదా
నిర్వృత్తాంబుదమండలోద్ధతమహా • నిర్ఘాతపాతావధూ
తోర్వీభృద్ఘనగండశైలములతో • నూహింపఁదుల్యంబులై.

విపరీతమునకు విరాటపర్వమునందు—

శా. దుర్వారోద్యమబాహువిక్రమరసా • స్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవి • ద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దో • ర్లీలన్ విజృంభించి గాం
ధర్వుల్ ప్రాణముమానముంగొనుట త • థ్యం బెమ్మెయింగీచకా.

మానినికిఁ బదుమూఁటను గవిరాజవిరాజితమునకుఁ బదునాల్గింటను యతిఁ గూర్చుట వాగనుశాసనసమ్మతము. కవిబ్రహ్మ యా రెండువృత్తములను నన్నయమతము ననుసరించి యేకయతికములుగను మతాంతరాశ్రయణమున యతిత్రితయసంయుతములుగను రచించెను. భారతహృదయమిట్లుండ నప్పకవి మానిని కేకవిశ్రాంతియుఁ గవిరాజవిరాజితమునకు యతిత్రయమును విధించుటకుఁ బ్రమాణము లేదు.

ఏకయతికి నన్నయభట్టారకుఁడు—

మానిని.

తమ్ములుదానునుధర్మతనూజుఁడుఁ • దక్షిణసంభృతసంభ్రముఁడై
యమ్మునినాథవరేణ్యునకర్ఘ్యవిధి • యమ్మున మ్రొక్కి సమున్నతపీ
ఠమ్మున నుంచి యథావిధిపూజలొ • డంబడఁజేసి మునీశ్వర నె
య్యమ్మున నీవిటవచ్చుటఁజేసికృ • తార్థులమైతిమియందఱముఁ.

ఆదిపర్వము—

కవిరాజవిరాజితము.

చనిచని ముందట నాజ్యహావిర్ధృత ♦ సౌరభధూమలతాతతులం
బెనఁగినమ్రాఁకులకొమ్మలమీఁదన ♦ పేతలతాంతములై ననుబా
యని మధుపప్రకరంబులఁజూచి జ ♦ నాధిపుఁడంత నెఱింగెఁదపో
వనమిదియల్లదె దివ్యమునీంద్రుని ♦ వాసముదానగునంచు నెదన్.

ఆదిపర్వము—

ఏకయతికిఁ దిక్కనసోమయాజి

మానిని.

జూదము నప్పుడు సర్వజనంబులు ♦ చూచి భయంపడియిప్పని యి
మ్మేదిని సేవలకుం గురుకోటికి ♦ మృత్యువుగాని నిజం బలఁతిం
బోదని యాడరెయమ్మెయినాదగు ♦ బుద్ధికిఁదోఁచినసత్యముదా
మోదరపాటిలదేకొడుకంచుఁబ్రి ♦ యోక్తులువల్కినఁ బెంపుసెడున్.

కవిరాజవిరాజితము.

అనయములోలతమైవిషయప్రచ ♦ యంబనుదుస్తరపంకమునన్
మునుఁగుచుఁదేలుచునుండఁగఁగాలము ♦ ముట్టిరుజన్ జరనెవ్వగపై
కొన దొరకొల్పిక్రమంబునసంగము ♦ క్రొవ్వునుజెల్వును బాపి (ప్రమో
దనరహితంబుగఁజేసి యపాత్రపు ♦ జావానరించుఁగురుప్రవరా.

యతిత్రయమునకుఁ దిక్కనసోమయాజి—

మానిని.

కూలియుఁ గాంతి యి ♦ గుర్వెఁగఁ దేజము ♦ గుందక
వవర్ణాలు ♦ గూరక్షా

జాల మదంగియుఁ ♦ జాయవెలింగెడు ♦ చందము
నొందిరి ♦ శల్యుఁడుఁ బాం
చాలుఁడుఁ గర్ణుఁడుఁ ♦ జాపగురుండును ♦ శాంతన
వుండు ని ♦ జంబునకీ
బాలుఁడు వీరివ్రి ♦ భం గడచెం గుణ ♦ భద్రునిఁ
గంటె సు ♦ భద్రసుతుఁ.

కవిరాజవిరాజితము—

అనవుడు నిట్లను ♦ నన్నరపాలున ♦ కాతఁడు
మోక్షము ♦ నర్థిజగ
జ్జనులకుఁ బుట్టుట ♦ నన్మతిఁ గోరి వి ♦ శారదు
లాదర ♦ సంభృతులై
యనఘ సుదుస్తర ♦ మైన భవంబున ♦ కచ్చగు
సీయితి ♦ హానము బో
ధనమహనీయవి ♦ ధంబునఁ జెప్పి రు ♦ దాత్తగు
ణాశ్రయ ♦ తామహితా.

లయగ్రాహియందుఁ బ్రాసములకుఁగా విభక్తివర్ణకము సాఁగనిచ్చుట మలభమై హృదయంగమముగ నుండును.

ఆదిపర్వమునందు—

లయగ్రాహి.

చందనతమాలతరు ♦ లందునగరుద్రుమము ♦ లందుఁ
గదళీవనము ♦ లందు లవలీమా
కందతరుమండపముల ♦ యందును విలోలదర ♦ విందసరసీ
వనము ♦ లందు వనరాజి.

కందళితపుష్పమక ♦ రందరసముం దగులు ♦ చం
దనువు సౌరభము ♦ నొంద జనచిత్తా
నందముగఁ బ్రోషితుల ♦ డెందము లలందురఁగ ♦ మంద
మలయానిల మ ♦ మందగతి వీచెన్.

స్త్రీపర్వమునందు—

లయగ్రాహి.

అమ్ములును విండ్లుఁ బరి ♦ ఘమ్ములును దోమరచ ♦ యమ్ములును
గుంతనిక ♦ రమ్ములుఁగ నక్ష
గ్రమ్ములు నహీనమున ♦ లమ్ములును జక్రనివ ♦ హమ్ములును
లోనగు న ♦ నమ్మితమహోగ్ర
ప్రమ్ములును గండలును ♦ నెమ్ములుఁ గపాలములు ♦ సమ్మిళిత
రూపశక ♦ లమ్ములయి సంగ్రా
మ మ్మతులదారుణవి ♦ ధమ్మగుట దెల్పుటది ♦ కమ్మగు
కలంక హృద ♦ యమ్మున కొనర్చెన్.

నన్నయ మధ్యాక్కరకు నాల్గుగణములమీఁద యతినిల్పె నెఱ్ఱన్న మూఁడింటిపై విరతిఁగూర్చెను. అప్పకవి యెఱ్ఱన్ననే యనుసరించెను.

నాల్గింటి మీఁద యతి నిల్పినందులకు నన్నయ—

మధ్యాక్కర.

కడు నిమ్మగా దున్ని బీజములు సల్లి ♦ కర్షకుండున్నఁ
దడయక వర్షంబు గురిసి కావించుఁ ♦ దత్ఫలసిద్ధి
నడుమఁ బర్జన్యుఁ డనుగ్రహింపని ♦ నాఁడేమి సేయుఁ
గడఁగి చేయంగలదానిఁ జేయును ♦ గాక కర్షకుఁడు.

కూచిమంచి యతికినెత్తావఫ్రగ్గడ—
మధ్యాక్కర.

అతిశిక్షకు తేజాడు బ్రాహ్మణ • గానీకనహితుండై కడంగి
వసుమతియందునధర్మ • వర్తులై యున్నమ్లేచ్ఛులను
మసలకనిజశక్తిం జేసి • మడియించిధర్మంబునిలిపి
వసునిభుండానరించు శర్మ • వాజిమేధమునిచ్చెయొప్ప.

ఈకగ్రీయానియమము లేని కంటాదులయందలి యవలక్షణము వీణయం దపస్వరము బలె నజ్ఞుండును దెలియును. కాని యిట్టి దని ప లుకనేరఁడు.

కందములందలి యవలక్షణమునకు—

క. అంకిత వామాయనసీకల
వేంకటపతి యిష్టమైన • వేల్పగుటం దదీ
యాంఘ్రిరతము చేయంతొలఁకక
సంకేతము కాకతంజర • నన్నేఁగానె.

అముక్తమాల్యద—

మఱియునందే—

క. త్రివిధోత్పాతము లొదవిన
నవనివిభుఁడు విడువవలయు • నధికద్రవ్యం
బవనీసురముఖసురముఖ
పవనసఖముఖములభుక్తి • బలిహోమవిధిన్.

పై రెండింటియందును గణభంగము లేకున్నను «అతఁడరసన్» «పవనసఖముఖములు» అనుచోట్ల ననుభవైక వేద్యమగు నపస్వర ముగలదు. కందమునకుద్వితీయ చతుర్థపాదముల మొదట జగణము

నిలుపగతి కుంటువడినట్లగపడునుగాని యించుక గమకించి చదువనతి సుందరముగ నుండును.

క. అనుపమనియమాన్వితులై
యనూనదక్షిణలఁ గ్రతుస ♦ హస్రము ల్మునుచే
సినవారికంటెనక్రో
ధనుఁడ కరంబధికుఁడండ్రు ♦ తత్త్వవిధిజ్ఞుల్.

ఆదిపర్వము.

గీతమునందలి యవలక్షణమునకు—

తే. వసరుశాకాయ లవణాయ ♦ వా యటంచుఁ
బెనఁగుధూళీఃపరగృహోద ♦ పియనునాస
ముంచి యీఁగకుఁగాటుసా ♦ మునకు బలియుఁ
గొనఁగఁడనిభర్తకై పొక్కు ♦ నువిదమదిని.

ఇందు 'ధూళీఃపరగృహోదపియనునాస' అనుచోట శ్రోత్రగ్రాహ్యమగు నపస్వరముగలదు. ఇట్లే సీసము మొదలగువానియందును దెలియనగు. పాదాంతమునందుఁ బదవిరామము సేయక పదమధ్యమున యతిప్రాసములు గూర్చుట ప్రౌఢి.

మ. బకవిధ్వంసనమాచరించితి, హిడిం ♦ బప్రాణముల్గొంటి, కీ
చకనిర్మూలనకేలిసల్పితి, జరా ♦ సంధాంగకస్వైరభం
జకలీలన్విలసిల్లి, తీవని మను ♦ ష్యస్ఫూర్తి మాత్రమ్ములే
యొకమర్త్యుండెను రెట్లునీకుమతిలో ♦ నూహింపకిట్లాడితే.

సీసపద్యమునందుఁ బ్రతిపాదమునంత్యపదము నన్వయమును దెగుట రమణీయము,

సీ. తొడరినవారునైన ♦ దోర్బలంబునఁదన్ను
మిగులంగనీఁడను ♦ మేటిమాట
యమరేంద్రునర్ధాస ♦ నమునకునైనన
ర్హుండెంతయును నను ♦ గూఢిమాట
జమునిలుసొచ్చిన ♦ జంతువునైనను
గాచునెమ్మెయినను ♦ రాచమాట
దనుఁగోరియూర్వశి ♦ దానవచ్చిననైన
లోలుండుగాఁడను ♦ మేలిమాట

తే.గీ. శౌర్యవైభవప్రాభవ ♦ శౌచములకు
నొరులకైనగైవారమై ♦ యుల్లసిల్లు
నొక్కనికినివియెల్లను ♦ నిక్కమట్టి
యెందఁగలుగునె యర్జున ♦ నీదువాఁడు॥

విరాటపర్వము.

పాదాంతమునఁ బదము తెగకుండుటకు—

సీ. జూదరిగనుండు ♦ వేదంబు సదువని
వాఁడువడ్డికినిచ్చు ♦ వాఁడుగాయ
కుండుగ్రామముపనిఁ ♦ గుడుచునాతఁడుగృహ
దాహికుష్ఠముగల ♦ తనువునాతఁ
డఱుఁదేవుఁగ్గొన్నాతఁ ♦ డఖిలవస్తువులును
నమ్మెడునతఁడు సో ♦ మమ్ము విక్ర
యించినయతఁడబ్ధి ♦ సంచారలాభోప
జీవకుండుర్విశ ♦ సేవకుండు

తే. భార్యయును దాను బుత్త్రిలు ♦ పంచికొన్న
వాఁడు పసులఁ బెక్కిటి నేలు ♦ వాఁడు కపట
కృత్యముల మ్రుచ్చిమినిశిల్పి ♦ కృతుల బ్రదుకు
వారు పంక్తిదూషకులంద్రు ♦ పౌరవేంద్ర.

పాదాంతమున కన్వయము తెగకుండుటకు—

సీ. కవలలో నొకఁడొండె ♦ గాండివియొండె వృ
కోదరుఁడొండె నీ ♦ వొండెఁ జేత
గదగొని యొక్కటి ♦ కయ్యంబునకుఁ బూని
యేర్పడ నిలిచిన ♦ నీక్షణంబ
సమయంగఁ జూచెదఁ ♦ గ్రమమున మీరెల్ల
నొకఁడొక్కఁడే తేరఁ ♦ బ్రకటబాహు
దర్పంబువోగఁడొంద ♦ ధరఁ గూల వ్రేయుచు
వచ్చెద మఱియు నీ ♦ వారిలోన

తే. నలిగి యెవ్వఁడు దాఁకిన ♦ నట్లనాదు
గదకు నెరసేసి చేర్చెదఁ ♦ గడుగదార
ణంబు నాతోడఁ జేయుమ ♦ నర్థహరుండు
గడఁగ లేఁడు మీకెందుఁ బోఁ ♦ గలదు నేఁడు.

శల్యపర్వము.

గీ. ఇట్టులుద్దేశలేశముఁ ♦ బట్టియేను
కింత వచియించితిమి, బుధు ♦ లీవిధముగ
నఖిలము యథోచితముఁ దెలి ♦ యంగవలయుఁ
గలదె? కవితాసముద్రముఁ ♦ గడవ నావ
మొదటిగురులఘుద్వయ ♦ మ్మగనొనర్ప

నుత్పలముచంపకమ్ములుగా ♦ నొప్పు; నట్లె
స్రగ్ధరావృత్తమును మహా ♦ స్రగ్ధరయగు
నిట్లశార్దూలమెసఁగు మ ♦ త్తేభముగను
దేజరిలుఁగవిరాజవి ♦ రాజితముగ
మానినీవృత్త, మట్టులే ♦ మత్తకోకి
లమ్ములతరళమ్ములగుం, జంప ♦ కమ్ములుతుదిని
నాలుగక్కరములువీడ ♦ నర్కుటమగుఁ
గవులుదీనినెకోకిల ♦ కాకమందు
రిట్టిదఖిలము నిటవచి ♦ యింపలేదు
చెప్పఁగానేల ? యది స్వత ♦ స్సిద్ధమెకద
వృత్తవేదికి, నొరునకు ♦ వినుపనేల ?

క. నానావిణాగుణవి
జ్ఞానులకుఁ దోషలేశ ♦ గతిచతురులకుం
గా నీసూత్రాంశమ్ముల
నేనివచించితిమియోగి ♦ హృద్గమ్యములన్.

ఇది శ్రీ సూర్యారాయనృపచంద్రముఖ్యాశ్రిత
వేంకట రామ కృష్ణ విరచితంబగు
సువృత్తతిలకమునందు
గుణదోష దర్శనంబను
ద్వితీయవిన్యాసము.



# తృతీయవిన్యాసము.

——:o:——

తే.గీ. దోషరహితమ్ములును గుణ ♦ భూషితములు
నగు సువృత్తములను ముత్తి ♦ యములఁ బోలెఁ
దగినపట్టులఁ గూర్పనెం ♦ తయుఁ బ్రబంధ
మతిశయిల్లు సుదృగమ్మనో ♦ హారియగుచు.

శాస్త్రము, కావ్యము, శాస్త్రకావ్యము, కావ్యశాస్త్రమునని వాఙ్మయము నలుదెఱంగులుగలది.

సర్వకావ్యలక్షణములు దెలుపునది శాస్త్రము.

రసాలంకారయుక్తము కావ్యము.

ఎల్లపురుషార్థముల నుపదేశించునది శాస్త్రకావ్యము.

భారతము మొదలగునది కావ్యశాస్త్రము.

వేఁదుమందుపైఁ జక్కెరపూఁతవలెఁ గొందఱు కేవలశాస్త్రమునందును గావ్యలక్షణము సూపుదురు. అందఱకుఁ దేటతెల్లముగాఁ దెలియుటకై శాస్త్రమును గీతాదిసుకరవృత్తములతో రచింపవలయును.

కావ్యమునందును గావ్యశాస్త్రమునందును రసవర్ణనముల కనుగుణముగ వృత్తము లుపయోగింపవలయును. శాస్త్రకావ్యమునందతిదీర్ఘవృత్తము లనావశ్యకములు.

క. వినుము కవిప్రభుశాసన
ముసఁ జేసి యసర్హవృత్త ♦ ములు సర్హత్వ
మ్మును గను గోగ్రహమున న
ర్జునరథ్యము లవ్విరాట ♦ సుతురథ్యములే.

ఉ. ఐన నవస్థకుందగిన ♦ యట్టిసువృత్తములం బ్రబంధముల్
జానగు సాధుపూరుషుల ♦ చందమునం దమకంబు పేర్మి న
స్థానమునన్నువృత్తమణి ♦ దామకమున్ మలనూలి గుత్తకం
బూనిచినట్లు గూర్పనది ♦ బుద్ధివిహీనత జాటిచెప్పిరుర్.

కావున నిపుడు వృత్తములందగుచోట వినియోగపఱుచు విధము దిఙ్మాత్రముగ నుదాహరించెద.

ఆశ్వాసాంతమున మాలినీవృత్త మనుప్రాసభేదములతో నెక్కుడుపవలయును.

విరాటపర్వమునందు—

మాలిని.

నిగమకుసుమగంధో ♦ న్మేషపూతాభిధానా
నగుణవిగుణలీలా ♦ సామ్యసాక్షిత్వనానా
జగదవనవిధాన ♦ స్థైర్య దత్తావధానా
నగశరధినివాసా ♦ నందసంస్తూయమానా.

సకోద్రిధ ధిక్కారమునఁ బృథ్వీవృత్తముచాలియుండును.

ఆదిపర్వమునందు—

పృథ్వి.

ఉపాంశువధఁ జేసిమధ్యము మ ♦ దోద్ధతుంజంపి ని
స్సపత్నముగ ధర్మనందను న ♦ శక్తు బంధించి యే
నపాండవముగా సముద్రవల ♦ యాఖిలక్షోణి మ
త్కృపాణపటుశక్తి నత్యధిక ♦ కీర్తినై యేలెదన్.

నృపాదులశౌర్యమును గొనియాడునపుడు మత్తేభ శార్దూల విక్రీడితములు సంమతములు.

విరాటపర్వమునఁదు—

మ. విలసద్గాండివచాలనోద్ధతిగన • ద్విద్యుల్లతాలీలగా
నలఘుస్ఫారకపిధ్వజధ్వని సము • ద్యద్గర్జ చందంబుగా
జలదాకారత నొందెఁ దేరితఁడు ప • ర్జన్యాకృతిం బోల్చె దో
ర్బల తీవ్రారిసదాఘదుర్వహమహా • ర్వస్ఫూర్తి నిర్మూర్తిగాఁ.

శా. యోధాగ్రేసరుఁడిద్ధతేజుఁడు రణో • ద్యోగానురక్తుండు దు
స్సాధప్రక్రమబాహువీర్యుఁడు గురు • క్ష్మాపాలవాల్లభ్యల
క్ష్మాత్రధామాత్ముఁడు జామదగ్న్యకలిత • శ్రీశస్త్రవిద్యాఢ్యుఁడీ
రాధేయుం డొకఁడీడికింగొనఁడు వీ • రవ్రాతముంబోరులన్.

ఘోరయుద్ధాదికమును వర్ణించునపుడు స్రగ్ధరా మహాస్రగ్ధర
లు వాడుదురు.

ఆరణ్యపర్వమునందు—

స్రగ్ధర.

లంకాలుంటాకుఁడుద్య • ల్లఘుతరగమనో • ల్లాసియైడాసివీఁకం
బొంకంబేపారఁ జంచ • ద్భుజరచితమహా • భూరుహంబెత్తి వ్రేసెం
గింకన్ధూమ్రాక్షువాఁడుం • గెడసెనువదనో • త్కీర్ణకీలాలధారా
పంకప్రాగ్భారమగ్నా • పఘనవిఘటిత • ప్రాణుఁడైయాహవోర్విన్.

మహాస్రగ్ధర.

కని ధూమ్రాక్షుండువిశ్వ • గ్రసనరసలస • త్కాలమేఘుంబపోలెన్
ఘనమార్వీఘోష గర్జం • గడఁగిశరశతా • కల్పితాపారదుర్ద
ర్శనవీరారంభుఁడైనన్ • సకలహరిచమూ • సంఘమున్వ్యాహ్వాలంబై
చనఁగూలెందూలెలావుం • జలమునుజెదర • న్సందడిన్వచ్చెనొచ్చెన్

కృత్యారంభమున శార్దూలవిక్రీడితమొండె నుత్పలమాలిక యొండె వ్రాయుదురు.

మనుచరిత్రమునందు—

శా. శ్రీవక్షోజకురంగనాభ మెదపైఁ • జెన్నొందవిశ్వంభరా
దేవిం దత్కమలాసమీపమునఁ బ్రీ • తిన్నిల్పినాఁడో యనం
గా వందారుసనందనాదినిజభ • క్తశ్రేణికిం దోఁచు రా
జీవాక్షుండు గృతార్థుఁ జేయు శుభదృ • ష్టిం గృష్ణరాయాధిపున్.

విరాటపర్వమునందు—

ఉ. శ్రీయనఁ గౌరినాఁ బరఁగు • చెల్వలచిత్తము పల్లవింపభ
ద్రాయితమూర్తియై హరిహ • రంబగు రూపముఁ దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని • పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పర • తత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికై.

ద్వితీయాద్యాశ్వాసములకు మొదలఁ గందముఁ జెప్పుదురు

భాగవతమునందు—

క. శ్రీకంఠచాపఖండన
పాకారిప్రముఖ వినుత • భండన! విలస
త్కాకుత్స్థవంశ మండన
రాకేందుయశోవిశాల • రామనృపాలా.

సూర్యచంద్రోదయ పరిభవసురతాదివర్ణనమున సీసవ గూర్తురు.

విరాటపర్వమునందు—

సీ. సీగజాకరములు • నిష్ఫలంబుఁ జేసిన
భవ్యతపమ్ములు • ఫలమునంగ

దివసముఖాభినం • దిత చక్రియుగళ్రీ
మ్ముల యనురాగంపుఁ • బ్రోవనంగ
హరిహరబ్రహ్మమ • హానుభావమ్ములో
క్కటిగాఁగఁగరఁగిన • గట్టియనఁగ
నతులవేదత్రయ • లతికాచయము పెను
పొందఁబుట్టెడు పూల • కందమనఁగ
తే. గీ. నఖిలజగముల కట్టెఱ్ఱ • యగుచు జనస
మాజకరపుట హృదయస • రోజములకు
ముకుళనంబును జృంభణం • బును నొనర్చి
భానుబింబంబు పూర్వాద్రి • పై వెలింగె.

ద్రోణ పర్వమునందు—

సీ. నలువచెందొవల రే • కులకు నన్నువెట్టఁ
గోరికావించిన • గుళికయనఁగ
నఖిలద్విజశ్రేష్ఠ • మగుచకోరచయంబు
తపముసముల్లస • త్ఫలమనంగఁ
జిగురుజొంపమునను • జిగియొప్పనుదయాద్రిఁ
బొలుపారునవకల్ప • భూజమనఁగఁ
బూర్వపయోరాశి • పొంతఁగెంజాయచె
న్నొందవిన పవడంపుఁ • బొదయనంగ
తే. గీ. నగుణరుచిఁ దనమండల • మతిశయిల్లఁ
బొడిచిదివిఁబ్రాఁకి దీధితు • లదరఁజేసి
యంతకంతకు నెక్కుచు • నంతమసము
గ్రాలుకొనసీక చంద్రుండు • గ్రాలెనధిప.

## సువృత్తతిలకము.

శృంగారనైషధమునందు—

సీ. పతిపాణిపల్లవ ♦ చ్యుతనీవిబంధన
వ్యగ్రబాలాహస్త ♦ వనరుహంబు
ధవకృతాధరబింబ ♦ దశనక్షతవ్యథా
భుగ్నలీలావతీ ♦ భ్రూలతంబు
ధరణినాయకభుజా ♦ పరిరంభమండలీ
గాఢపీడితవధూ ♦ ఘనకుచంబు
వరనఖాంకుర మృదు ♦ వ్యాపారపులకిత
నీరజాక్షీ నితం ♦ బోరుయుగళి
ఆ. గీ. యస్తివామ్యభార ♦ మస్తికౌతూహలం
బస్తిఘర్మసలిల ♦ మస్తికంప
మస్తిభీతియస్తి ♦ హర్షమస్తి వ్యథం
బస్తివాంఛమయ్యె ♦ నపుడు రతము.

వనవిహారమున సంవాద వైఖరి రగడభేదములు వ్రాకుత్తురు.

చంద్రికాపరిణయమునందు—

* చెలువచెలువపుమొగ్గచాల్కొని ♦ చేసుచేరుగఁ గూర్తు విచ్చట
నలినినలినిభకుంతలామణి ♦ నన్నునన్నులు వేడముచ్చట
తిలకతిలకకులంబుగన్గొన ♦ దివ్యదివ్యాగములపోలిక
నలరునలరుల నెనయురోలం ♦ బాళిబాళి చిగుర్పచాలిక
యింతియింతిటఁజేరఁ దగదేసు ♦ మేరమేరయె వకుళపాళిని
కాంతకాంతవశరములల్లవె ♦ కాంతకాంతమె చాలహాళిని

---

* భారతమునందు రగడలు లేమిఁ దల్లక్షణము ప్రథమవిన్యాసమునఁ జెప్పంబడదయ్యె.

సీ. సంస్కృతకవయితల్ ♦ సర్గముకడవెళ్ళ
విషయానుగుణముగా ♦ వృత్తమొకఁడె
హావణింతురట్లుగా ♦ కాంధ్రకవీశ్వరుల్
తఱచు సీసమ్ము గీ ♦ తద్వయమ్ము
శార్దూలమత్తేభ ♦ చంపకోత్పలములు
కందమ్ము నీయష్ట ♦ కంబెకూర్తు
రవివక్షితమ్ముగా ♦ నటుగానవానికి
సరిదివక్ష్యానుగు ♦ ణ్యమ్ము దెల్ప
గీ. నయిననుద్దేశలాభము ♦ నధిగమించి
కొన్నిటికిలక్షణంబిందుఁ ♦ గూర్పఁబడియెఁ
దక్కువైచిత్ర్యమాత్రపా ♦ త్రమ్ములయిన
వృత్తముల వినియోగము ♦ వినుపలేదు.
గీ. గీతకంద సీసమ్ములు ♦ కేవలముగఁ
గైకొనిరచింపుదురు శత ♦ కములుమాత్ర
కలపికేనియుఁ జంపకో ♦ త్పలములట్లు
తుల్యజాత్యమ్ములను గల్పు ♦ దురు సుకవులు.
చ. అనియిటుసర్వవృత్తముల ♦ యందుఁబ్రసంగముగల్గు వశ్యవా
క్షనులకు మేలివృత్తములఁ ♦ గావ్యములన్ విభజించుపద్ధతిన్
వినిచితి: మొంటరెండిటనొ ♦ వృత్తములన్ శ్రమపడ్డవారు ని
ర్ధనులవిధంబునం బనికి ♦ రారు యథా వినియోగధోరణిన్.
గీ. తనకునలవాటు గలుగు వృ ♦ త్తమ్మునందె
తనదు సందర్భమును దెల్పఁ ♦ దగు; మఱొంటఁ
బూరణము సేఁతయేకాక ♦ పొలుపువుట్ట
దొకట సేయాదరము పూర్వ ♦ లకును గలదు.

సీ. పోలుపుగాఁ జంపకో • త్పలమాలికల్గూర్ప
దిట్టండు నన్నయ • భట్టసుకవి
యందమ్ముమీఱఁగాఁ • గందమ్ము రచియింప
శూరుండు దిక్కన • సోమయాజి
చక్కఁగా మత్తేభ • శార్దూలములనాడ
ఖ్యాతుండు బమ్మెర • పోతరాజు
వాసి మెసంగఁగా • సీసమ్ములందీర్ప
విన్నాణి శ్రీనాథ • విబుధమౌళి

గీ. సకల వృత్తములంగూర్ప • జాణలయ్యు
నీవిధమ్మునఁ బూర్వక • వీశ్వరులును
వేడుకగలారు కొండొక • వృత్తములను
సుందరులు రత్నహారము • లందుఁ బోలె.

చ. అనువగుచోట్ల వృత్తములు • లచ్చుపడంగ సువర్ణవస్తువుల్
దనరు సముల్లసద్రుచిని • కాంతముఁ; గావున నిందుమేము చె
ప్పిన వినియోగమార్గమును • వీడక వృత్తనివేశ నమ్మున
ర్పను సమకట్టుఁడీ కవులు • వశ్యవచోవిభవుల్ కృతజ్ఞతన్.

గీ. ఈపగిదిఁ నర్థులకు, బ్రథ • మోపయోగి
విబుధగణమునకును సువి • వేకకారి
కవికులేశ్వరులకునైన • వివిధ సూక్ష్మ
తత్త్వ నిర్ధారణాదర్శ • దాయి వెలసె.

ఇది శ్రీసూర్యారాయ నృపచంద్ర ముఖ్యాశ్రిత
వేంకటరామకృష్ణ విరచితంబగు సువృత్త
తిలకమునందు వృత్తవినియోగంబను
తృతీయ విన్యాసము.

శ్రీరస్తు

# ఉత్తరరామచరిత్రము.

ఇది

భవభూతిమహాకవి సంస్కృతనాటకమునుండి
శ్రీపీఠికాపురసంస్థాన విద్వత్కవులు శతావధానులు,
వేంకటరామకృష్ణకవులచే నాంధ్రీకరింపఁబడియె.

(ప్రథమ సంపుటము.)

మొదటికూర్పు.

---

కాకినాడ.

శ్రీ సుజనరంజనీ ముద్రాక్షరశాలయందు
పోతాప్రగడ బ్రహ్మానందరావుచే ముద్రింపబడి
గ్రంథకర్తలచేఁ బ్రకటింపఁబడియె.

దీనివెల 6 అణాలు.

1913

## నివేదనము.

మాకవితాపత్రికా ముద్రణకార్యమును గాకినాడనుండి పిఠాపురమునకు మార్చినారము. కావున, నింతకుముందక్కడ ముద్రింపఁబడి కవితలోఁ బ్రకటింపఁబడిన యీనాటకములోని మొదటి నాలుగంకములు నొకసంపుటముగాఁ గట్టించినారము. తక్కిన మూఁడంకములును, టీకయు, విమర్శమును వేఱొకసంపుటముగాఁ బ్రకటింపనై యున్నారము.

| పత్త్రము. | పంక్తి. | శుద్ధము. |
|---|---|---|
| 1 | 6 | ఆలస్యము |
| 2 | 18 | అరుంధతీ |
| | 22 | రథ. |
| 3 | 4 | నాఁడు. |
| | 5 | పెద్దలందఱచ్చటి. |
| 4 | 9 | ఊఱడిల్లు మూఱడిల్లుము. |
| | 11 | నిష్ఠ. |
| 5 | 3 | మాలస్యము. |
| | 10 | నిర్విఘ్నముగా. |
| 6 | 8 | నచ్చటనే. |
| | 9 | పూర్ణోత్సంగ. |
| | 22 | నాయిక. |
| 7 | 9 | వఱకు. |
| 9 | 1 | ప్రతిగ్రహీంతయు. |
| | 14 | మఱఁదలు. |
| | 20 | వణఁకుచున్నది. |
| 10 | 6 | తలఁచుకొన్నచో. |
| 10 | 7 | గాఁదల్లు. |
| 11 | 6 | భాగీరథీ. |
| | 10 | భగీరథుఁడు. |
| | 21 | జాలు. |
| | 22 | తలఁదీరినయవల. . |
| 12 | 8 | కాఁపురము. |
| | 21 | భీరూ. |
| 13 | 10 | నాఁపుకొన్ననుదుఃఖముచూపఱకును |
| 15 | 6 | తల్లియిది |
| | 7 | శృంగమున జలధరమువసించునొకఁడు |
| | 17 | భాగీరథిలో. |
| 17 | 2 | వ్యాకోచభావమందె |
| | 16 | నయనపీయూషవర్తియీనయనగామృతవర్తియా. |
| 18 | 19 | మఱపించు. |

| పత్త్రము. | పంక్తి. | శుద్ధము. |
|---|---|---|
| 19 | 2 | ఊఁఅడిల్లు మూఁఅడి ల్లుము. |
| | 18 | నల్లు. |
| | 21 | పవిత్రిత. |
| 21 | 6 | కాఁఅడవి. |
| | 7 | భూయిష్ఠ. |
| 23 | 10 | అనిమనవి. |
| 28 | 6 | కథా. |
| 33 | 11 | వెదకంగ. |
| | 15 | భాంకృతముల. |
| | 17 | దీర్ఘముల్లను. |
| 34 | 25 | వానికాతండు. |
| 35 | 24 | జూఁఅకొంటిమి. |
| 39 | 4 | నన్నుఁబంపెను. |
| 40 | 10 | సంజీవ. |
| 43 | 16 | విమాన. |
| | 22 | జొను. |
| 49 | 1 | నన్నుఁగను. |
| | 23 | పత్త్రి. |
| 52 | 17 | దృష్టులకుం. |
| | 20 | యుండు. |
| 53 | 3 | వాడువ. |
| | 5 | దుగ్ధ. |
| 54 | 22 | కడవి. |
| 56 | 7 | దేవి. |
| | 15 | రెండు. |
| 57 | 3 | సవిష. |
| 58 | 2 | యీపీలతా. |
| | 5 | యట్టు. |
| 60 | 17 | ఘరామ్రంబు. |
| 62 | 8 | ఇప్పటికిని |
| | 11 | వేఁగిరి. |
| | 17 | నలుం. |
| 64 | 19 | గూపులుగా. |
| 66 | 12 | బహుమానమునకు |
| 67 | 18 | నగాంస. |
| 72 | 21 | కూఁతును. |
| | 10 | ఊఁఅడిల్లుము. |
| 80 | 6 | వాల్మీకి. |
| | 8 | జన. |
| 82 | 3 | పౌరుల్ ద్విజబాల వృద్ధవికలుల్. |
| 84 | 2 | నికషముగదా. |
| | 6 | దశకంధరాదిదనుజ |
| | 18 | నపహరించెద. |

శ్రీ

# ఉత్తరరామచరితము.

## ప్రథమాంకము.



తే. గీ. అమృతసారంబులైతగు ♦ నాది కవుల
భాషితంబులు నవరస ♦ బంధురములు;
వేంకటకుమార సూర్యభూ ♦ విభున కఖిల
మంగళంబుల నెప్పుడొ ♦ సంగుఁగాత!

(నాంద్యంతమున సూత్రధారుఁడు.)

ఏల? ఈయాలశ్యము? ఆర్యమిశ్రులారా! భగవానుండగు కాలప్రియనాథుని యీమహోత్సవ సమయంబున నాచెప్పంబోవు విన్నపమాలింపుఁడు. కశ్యపగోత్రోద్భవుండును, శ్రీకంఠాపరనామధేయుండును, పదవాక్య ప్రమాణజ్ఞుండునగు మహాకవి భవభూతి నెఱుంగుదురుగదా?

తే. గీ. తద్దయు నెవంఙు వేల్పుల ♦ పెద్దకన్న
బలుకుల నెలంది మన్ననఁ బడయుచుండు
వ్రాసినాఁడాతఁ డుత్తర ♦ రామచరిత
మింపుమీఱంగ నది ప్రద ♦ ర్శింపఁబడును.

(ఆకసమునంకఁ జెవియొగ్గి)

“సంస్కృతనాటకముఁ బ్రయోగించెదరా” యనుచున్నారా? కాదు; కాదు.

తే. గీ. నాతిమార్దవశైలి మే ♦ నత్త మేన
మామబిడ్డలు వేంకట ♦ రామకృష్ణ
కవులు దెల్గించిరానాట ♦ కంబునూత
నంబుగా దాని నాడుచు ♦ న్నార మిపుడు.

నేను గార్యవశంబున నయోధ్యాపురవాసియగు తాత్కాలికు నిభంగి మెలంగుచున్నాను. (అంతటఁజూచి) ఓయీ! ఇది పౌలస్త్యకుల ధూమకేతువగు మహారాజ రాముని పట్టాభిషేక సమయంబుగదా? ఏమిది! అహోరాత్ర మెడతెగని మంగళధ్వనులనొప్పు చత్వరస్థానంబులిట్లు సడిసన్ను లేకయున్నవి.

నటుఁడు—(ప్రవేశించి) బావా! మహారాజునొద్ద సెలవుఁదీసికొని లంకా సమరమిత్రంబులగు వానరులును, రక్కసులును, గానుకలఁ గైకొని నానాదిగంతములనుండి వచ్చిన బ్రహ్మర్షులును, రాజర్షులును దమతమనివాసంబుల కరిగిరి. నాఁడు మొదలానందఘోషమేలేదు.

సూత్ర—అగు నదియే కారణము.

నటు—మఱియొక విశేషంబుగూడఁ గలదు.

తే. గీ. మొన్న మొన్నని రామునిఁ ♦ గన్నతల్లు
లుం [illegible] దేవి ♦ ముందు నడువఁ
[illegible] వసిష్ఠుని ♦ [illegible]
యల్లుఁడొనరించు యజ్ఞము ♦ నవలోకింప.

సూత్ర—విదేశస్థుఁడ నగుటచే నడుగుచున్నాను. అల్లుఁ డెవ్వఁడు?

నటు—తే. గీ. దశరథమహీమహేంద్రుని ♦ తనయ యగుచు
శాంతయను కన్యకామణి ♦ జననమొందెఁ;
దన్నుఁ బ్రార్థించి యడుగ నా ♦ కన్నఁ బెంచు

కొనఁగ నాతఁడు రోమపా ♦ దునకొసంగె.

ఆకన్నియను విభాండకసుతుండగు ఋష్యశృంగుఁడు పెండ్లి యాడె. ఆతఁడిప్పుడు పండ్రెండు సంవత్సరములు దీక్షగల సత్రయాగ మారంభించినాఁడు. అతని నిర్బంధంబుననే నిండుచూలాలైన జానకిని గూడ నింటదిగవిడిచి పెద్దలందరచ్చటికేగినారు.

సూత్ర—పోనిమ్ము మనకాప్రశంసయేల? మనకులాచార ప్రకారము రాజద్వారముచెంతకుఁ బోవుదముదమ్ము.

నటు—అట్లైన మహారాజును గొనియాడఁ బరిశుద్ధంబగు స్తోత్రపద్ధతి ని నిరూపింపుము.

సూత్ర—మారిషా!

తే. గీ. మంచియని చెడ్డయని విచా ♦ రించె దేల!
తొడరి నుతియింపు మానీకుఁ ♦ దోఁచినట్లు;
దుర్జనులు లోకు; లెంతసా ♦ ధుత్వమున్నఁ
బల్కులును గల్కులును మెప్పఁ ♦ బడయుటరిది.

నటు—బావా!

తే. గీ. ఎంతయు మహాత్ములని వచి ♦ యింపవలయు;
రక్కసుని యింటనున్న కా ♦ రణముఁబట్టి
వహ్ని పరిశుద్ధి సైతమ ♦ బద్ధమనుచు
సీతపై మోహరే? యొక ♦ చెడ్డవాదు.

సూత్ర—ఈకింవదంతి మనరాజుగారికిఁ దెలిసినచో మిగులఁ గష్టము సంభవించును.

నటు—అన్నివిధముల ఋషులు దేవతలు మంగళములొనరింతురుగాత! (పరిక్రమించి) ఓయీ! మహారాజుగారిప్పుడెక్కడ నున్నారు? (విని)

ఉ. "స్నేహమునం దనూజయగు ♦ సీతను జూడఁగ నేగుదెంచి, యు
త్సాహముతోడఁ గొన్నిదిన ♦ సంబులిటన్వసియించి, యంత వై
దేహనృపాలుఁడేగుడు మ ♦ దిం దురపిల్లు ననుంగురాణి వై
దేహి సమాశ్వసింప జగ ♦ తీపతి వాసగృహంబు సొచ్చెదుఁ."

ఇట్లు జనులనుచున్నారు.

(అని నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

(తరువాత నాసీనులైయున్న రాముఁడు సీతయుఁ బ్రవేశింతురు.)

రాము—దేవీ! విదేహరాజనందనా! ఊరడిల్లుమూరడిల్లుము. మాతండ్రిగారు చిరకాలము మనలవిడిచి యుండలేరు.

తే. గీ. నిష్ఠగలవారి కొక్కచో ♦ నిలువ నగునె
చేయఁదగుఁగార్య మెయ్యది ♦ చేయకున్నఁ
బ్రత్యవాయ శతంబుల ♦ బలసియుండు
నాహితాగ్నుల గార్హస్థ్య ♦ మంబుజాక్షి!

సీత—ఆర్యపుత్రా! ఔను అది యెఱుంగుదునుగాని బంధుజనవియోగంబు సహింపనలవిగాదు.

రాము—ఆమాటనిజమే. ఇట్టివియే మర్మస్పృక్కులగు సాంసారికధర్మములు. వీనికి భయంపడియేకదా మనీషులు సర్వసంగంబులఁ బరిత్యజించి యరణ్యములలో విశ్రమింతురు.

కంచుకి—(ప్రవేశించి) "రామభద్ర" (అని సగముచ్చరించి శంకతో) మహారాజా!

రాము—(చిఱునగవుతో) ఆర్యా! మాతండ్రిగారి పరిజనులగు మీకు "రామభద్రా!" యనిపిలుచుటయే లెస్సగానుండును; గాన మీకలవాటయినటులే పిలువుఁడు.

కంచు__దేవా! ఋష్యశృంగాశ్రమమునుండి యష్టావక్రుఁడు వచ్చి యున్నాఁడు.

సీత—ఆర్యా! అట్లైన నేలయాలశ్యముచేసెదరు?

రాము—త్వరగాఁ దీసికొనిరండు. (కంచుకి నిష్క్రమించెను)

అష్టావక్రుఁడు—(ప్రవేశించి) మీకు శుభమగుఁగాత!

రాము—భగవానుఁడా! నమస్కారము. ఇచ్చోఁ విచ్చేయుఁడు.

సీత—దేవా! వందనము. మాయత్తలకెల్లరకుఁ గుశలమా? మా యన్న ఋష్యశృంగుఁడును వదిన శాంతయు సుఖముగ నున్నారా?

రాము—మాబావగారును మాయక్క శాంతయు నిర్విఘ్నముగా సోమపాన మొనరించిరా?

సీత—ఆపె మమ్మెప్పుడైనఁ దలఁచునా?

అష్టా—(కూర్చుండి) అమ్మా! తలఁపకేమి? మీకులగురుండగు వసిష్ఠుండు సీతో నిట్లు చెప్పుమనియె.

ఆ. వె. "ధరణి నిన్నుఁగన్న ♦ తల్లి; నీజనకుండు
జలజభవునియుద్ది ♦ జనకచక్ర
వర్తి; నీవు సూర్య ♦ వంశ్యుల పెద్దకో
డలవు; వత్స! లోటు ♦ గలదె నీకు?

కానసీకిఁక నాశీర్వదింపవలసిన దేమున్నది? తప్పక వీరమాతవగుము."
అని.

రాము—అనుగ్రహింపఁబడితిమి.

తే. గీ. ఆడితప్పని లౌకికు ♦ లనెడుమాట
భావికార్యానుసారియై ♦ పరిఢవిల్లు

నాద్యులగు నిట్టిసంయము ♦ లనినపగిది
నాఱునూఱైన జరుగక ♦ తీఱదబల.

అష్టా—గర్భవతియగు జానకి యేదికోరిన నది యవశ్యముగాఁ ద్వరలో నెఱవేర్పుమని భగవతి యరుంధతియుఁ, బట్టపుదేవులును, శాంతయుఁ జాలఁ జాలఁ జెప్పుమనిరి.

రాము—ఈమెకోరినచోఁ జేయుట కభ్యంతరములేదు.

అష్టా—“అమ్మా! ఓపలేనిదానవని నిన్నుఁ దీసికొనిపోలేదు. నీకుఁ దోఁచదనియే రామభద్రునిఁగూడ నిచ్చటనే యుంచితిమి. కానఁ బుత్త్రపూర్ణోత్సంగవగు నిన్నుఁ ద్వరలో వచ్చిచూచెద” మని ఋష్యశృంగమహర్షి దేవితోఁ జెప్పుమనియె.

రాము—(సిగ్గుతోఁ జిఱునగవునగి) అట్లగుఁగాక! భగవంతుఁడగు వసిష్ఠమహాముని నాకేమియుం జెప్పుమనలేదా?

అష్టా—వినుము.

ఉ. “అల్లుఁడుఁ గూఁతురుం గలసి ♦ యాగ మొనర్చెదమంచుఁ బిల్వ మే
మెల్లర మేఁగినారము; మ ♦ హిస్వహియించితివీవుఁ గ్రొత్తగాఁ;
బిల్లతనంబు నీకు; రఘు ♦ వీరులకుం బ్రజలెల్ల రక్తులై
చల్లఁగనుంటఁ జేకుఱు య ♦ శంబెధనం; బెటుసంచరించెదో!”
అని.

రాము—గురువులమాట సతిక్రమింతునా?

తే. గీ. స్నేహముఁ ద్యజించి దయనువ ♦ ర్జించిసౌఖ్య
మునువిసర్జించి దుదకుఁ బ్రా ♦ ముల వహించి
ప్రాణనాయకి జానకిఁ ♦ బాసియైనఁ
బ్రజలనెల్లర సంతోష ♦ పఱచువాఁడ.

సీత—కనుకనే యార్యపుత్త్రుఁడు రఘుకులధురంధరుండగుట.

రాము.—ఎవఁడురా అక్కడ? భగవంతుఁడగు నష్టావక్రుని విశ్రమింపఁజేయుము.

అష్టా.—(లేచినడిచి) ఓయీ! లక్ష్మణకుమారుఁడు వచ్చినాఁడు.

(అని నిష్క్రమించును.)

లక్ష్మ.—(ప్రవేశించి) ఆర్యునకు జయమగుఁగాక! ఆర్యా! చిత్రకారుఁడు మనము చెప్పినచొప్పునఁ దమచరిత్రము నీచిత్రఫలకమునందు వ్రాసి తెచ్చినాఁడు. చూడుఁడు.

రాము.—తమ్ముఁడా! దుర్మనాయమానయగు జానకినూరార్ప నెఱుఁగుదువు. అదియెంతవరకు వ్రాయఁబడినది?

లక్ష్మ.—దేవిగారి యగ్నిశుద్ధిపర్యంతము.

రాము.—పాపము శాంతించుఁగాక!

తే. గీ. పుడమిఁ బొడమినది మొదలు ♦ పూతయైన
సీతకును శుద్ధియంచు న ♦ చింపవలెనె?
శుద్ధి యొనరింప వలెనటం ♦ చును గడంగి
యేను నిప్పును గడిగెదు ♦ వారు గలరె?

దేవీ! దేవయజనసంభవా! ప్రసన్నురాలవగుము. ఈవాదు నీవు బ్రదికియున్నంతవఱకుఁ దప్పునది కాదు.

తే. గీ. తలఁపు బందుగు నౌదార్య ♦ వలెనుగాని
మానవతి మఱియెంత సేయుట ♦ మంచిగాదు;
పూలదండను దలఁపయిఁ ♦ బూనకుండఁ
గాలనిడి నేలరాయుట ♦ కర్జమగునె!

సీత.—ఆర్యపుత్త్రా! కానిండు. జరిగినదానికి విచారింపనేల? చిత్రపటముఁ జూడఁ బోవుదము రండు.

లక్ష్మ.— ఇదిగో! చిత్రపటము.

సీత—ఆకసమునుండియార్యపుత్త్రునినుతించుచున్నట్లున్నారు. వీ రెవరు!

లక్ష్మ—దేవీ! ఇవియన్నియుఁ దాటకాసంహారకాలంబునఁ గృశాశ్వ శిష్యుండగు విశ్వామిత్రునిచే నార్యునకుఁ బ్రసాదింపఁబడిన జృంభకాస్త్రములు.

రాము—జానకీ! ఈదివ్యాస్త్రములకు నమస్కరింపుము.

తే. గీ. వేదములఁ గాచుకొనఁగ బ్ర ♦ హ్మాదిమునులు
వేనవేలేండ్లు తపముఁ గా ♦ వించుటయుఁ ద
పోమయంబులు తత్తేజ ♦ ములు ఫలించి
జృంభకాస్త్రంబులయ్యె; రా ♦ జీవనయన!

సీత—దివ్యాస్త్రములారా! మీకు నమస్కారము.

రాము—ఈయస్త్రంబులు తప్పక నీసంతానముఁ జెందఁగలవు.

సీత—అనుగ్రహింపఁబడితిని.

లక్ష్మ—ఇదిగో! ఇయ్యది మిథిలావృత్తాంతము.

సీత—ఆహా! దలన్నవనీలోత్పలశ్యామల స్నిగ్ధమసృణ శోభమాంసలంబగు దేహసౌభాగ్యంబున కచ్చెరువడి మాతండ్రి జనకుండు తప్పవాల్పక చూచుచుండ ననాదరత్రుటిత శంకరశరాసనుండును, శిఖండ ముగ్ధముఖమండలుండునగు నార్యపుత్త్రుండెంత చక్కగా వ్రాయఁబడెనో

లక్ష్మ—అమ్మా! వైదేహీ!

తే. గీ. అవధరించితివే; వసి ♦ ష్ఠాది
బంధువుల నిందు గౌతమ ♦ ప్రముఖులగు పు
రోహితులఁ గూడి వి ♦ దేహనృపతి
వినయ నమితాంగులగు మిమ్ము గౌర ♦ వించుచుండె.

రాము—ఇదియో చూడఁదగినది.

తే. గీ. దాతయుఁ బ్రతిగృహీతయుఁ ♦ దానె యగుచుఁ
గుశికతనయుండు దనకుఁదా ♦ గూర్చెనద్ది
జనకరఘువ్వన్వయాయ రా ♦ జన్యబాంధ
వంబది ప్రియంబుగాదె ? యె ♦ వ్వారలకును.

సీత—ఈనలువురుఁ దత్కాలకృత గోదానమంగళులై వివాహదీక్షఁ
గైకొనియున్న మీయన్నదమ్ములు, ఆహా! ఇప్పుడు నాకానమ్మ
యముునం దక్కడ నున్నట్లే యున్నది.

రాము—ఔను.

తే. గీ. కంకణంబులు గల్లురు ♦ గల్లు రనఁగ
గాంతముం డందియిచ్చిన ♦ కరము నన్ను
సమ్మదాంబుధిఁ దేల్చిన ♦ సమయ మిపుడు
జరుగుచున్నట్టు లుండెఁ జి ♦ త్తరువుఁ జూడ.

లక్ష్మ—ఇదిగో! ఈమె పెద్దవదినె. ఈమె మాపిన్నవదినె మాండవి.
ఈమెమఱదలు శ్రుతకీర్తి.

సీత—వత్సా! లక్ష్మణా! ఈమె యెవతె ?

లక్ష్మ—(సిగ్గుతోఁ జఱునగవునగి తనలో) ఆర్య్యరా లూర్మిళ నడుగు
చున్నది. కానిమ్ము. మాఱుమాటలచే నీమెను మఱపిం
చెదను. (ప్రకాశముగ)

లక్ష్మ—అమ్మా! ఇది చూడఁదగినది. దీనిని జూడుము. ఇతఁడే
భగవంతుఁ డగు పరశురాముఁడు.

సీత—(భయముతో) లక్ష్మణా! నాయొడలు వణకుచున్నది.

రాము—మహర్షీ ! నీకు నమస్కారము.

లక్ష్మ—అమ్మా! చూడుము. ఇతఁ డార్యునిచే—(అనునంతలో)

రాము—(ఆక్షేపముతో) లక్ష్మణా! చూడఁ దగిన వింక నెన్నియో గలవు. మఱియొందు చూపుము.

సీత—(స్నేహబహుమానములతోఁజూచి) ఆర్యపుత్త్రి! మీ కీవిన యాతిశయ మలంకారముగ నున్నది.

లక్ష్మ—ఇదిగో! మన మందఱ మయోధ్యకు వచ్చినారము.

రాము—(కన్నీటితో) తలఁచుకున్నచో గుండె నీ రగును.

ఆ. వె. తండ్రిగారు బ్రదికి ♦ యుండఁగా దల్లు లె
ల్లరును మంచిచెడ్డ ♦ లరయుచుండఁ
గ్రొత్తక్రొత్తపెండ్లి ♦ కొడుకులమై యున్న
దినము లెల్ల నవి యు ♦ తిక్రమించె.

మఱియు నప్పుడు,-

ఆ. వె. ఊడి మఱల వచ్చు ♦ చున్న పల్వరుసతో
ముగుదచూపుముద్దు ♦ మొగముతోడ
వెన్నెలలఁ బరాభ ♦ వించు నంగములతో
సీత నన్ను సంత ♦ సింపఁ జేసె.

లక్ష్మ—ఇదిగో! మంథర.

రాము—(సత్వరముగ నిం కొకవైపునకుఁ జూపుచు) దేవీ! వైదేహీ!

తే. గీ. శృంగిబేరపురంబును ♦ జేరియున్న
యింగుదీపాదపం బిది ♦ యో లతాంగి!
ప్రాణమిత్రుఁ నిషాదాధి ♦ పతిని మున్ను
కలసికొంటిమి దీనిచెం ♦ గటఁ దలంతె.

లక్ష్మ—(నవ్వి తనలో) ఆర్యుఁడు కైకేయీ వృత్తాంతము దాఁటించినాఁడు.

సీత—ఇది జటావల్కలధారణవృత్తాంతము.

లక్ష్మ—తే. గీ. ప్రాజ్ఞుఁ డగు పుత్త్రుపై భూమి ♦ భరము వైచి
వార్ధకంబునఁ దొంటియి ♦ క్ష్వాకునృపులు
గడవఁ జేసిన యారణ్య ♦ క వ్రతంబుఁ
జిన్ననాఁటనె మాయన్న ♦ సేకరించె.

సీత—ఈమె ప్రసన్నపుణ్యసలిల యగుభాగీరథీనది.

రాము—అమ్మా! రఘుకులదేవతా,! నీకు నమస్కారము.

చ. మును సగరాశ్వమేధహయ ♦ ముం గమనింపఁ గడంగి భూతధా
త్రిని బెకలించి పోయిన పి ♦ తృప్రపితామహు లందుఁ గాపిలా
గ్నిని మడియంగ నాదట భ ♦ గీరథుఁ డుగ్రతపం బొనర్చి వా
రిని భవదీయవారినిఁ ద ♦ రింపఁగఁ జేసెను గాదె? యీశ్వరీ!
తల్లీ! నీ వరుంధతివలెనే కోడలగు జానకిని గనిపెట్టుచుండుము.

లక్ష్మ—ఇది భరద్వాజునిచేఁ దెలుపఁబడిన చిత్రకూటపర్వతమునకుఁ బోవుదారిలోఁ గాళిందీతటంబున నున్న శ్యామ మను వట వృక్షము.

రాము—(ఆదరముతోఁ జూచుచున్నాఁడు.)

సీత—ఆర్యపుత్త్ర! మీ కీప్రదేశము జ్ఞాపకమున్నదా?

రాము—జానకీ! ఇది యెట్లు మఱవు వచ్చును?

తే. గీ. దారిబడలిక వాడిన ♦ తమ్మితూండ్ల
నవఘళింపఁగఁ జాల నీ ♦ యంగకములు
కవుఁగిలింతల దీరిన ♦ యవుల నాదు
హృదయమున వైచి యిట నిదు ♦ రింపలేదె?

లక్ష్మ—ఇది వింధ్యాటవీముఖంబున జరిగిన విరాధవృత్తాంతము.

సీత—ఈ సమాచార మింకఁ జాలును. ఆర్యపుత్త్రుఁడు తనచేతి
వినసకఱ్ఱను నాకు గొడుగుగాఁ బట్టికొని దక్షిణారణ్యమును
బ్రవేశించినసంగతిఁ జూతము.

రాము—తే. గీ. దేవి ! కనుఁగొంటె ? గిరినదీ ♦ తీరభూమి
మనము చూచిన యా తపో ♦ వనము లివియె
యతిథిపూజాపరాయణు ♦ లైన మునులు
కాపురముఁ జేయుచున్నారు ♦ గాదె ? ఇచట.

లక్ష్మ—ఇది ప్రస్రవణపర్వతము.

రాము—తే. గీ. ఊర్మిళాజాని సేవించు ♦ చుండ నిచట
మనము గడపినదినములు ♦ మఱచితివిగా !
తలఁతె ? గోదావరీతీర ♦ ములను నీవు
నేను నడపినచర్యల ♦ నీరజాక్షి !

మఱియు,

తే. గీ. మొగము మొగమునఁ గూరిమి ♦ మిగులఁ జేర్చి
యల్ల నల్లన నెద్దియో ♦ నాడుకొనుచు
నశిథిలాలింగనంబుల ♦ నలరు మనకుఁ
దెలియకుండఁగ రాత్రియే ♦ తెల్లవాఱె.

లక్ష్మ—ఇది పంచవటియందలి శూర్పణఖాసంవాదము.

సీత—అక్కటా ! ఆర్యపుత్త్రా ! ఇంతవఱకే నీదర్శనము.

రాము—సఖి ! వియోగభీరు ! ఇది చిత్రపటము.

సీత—ఏ మైన నగుఁ గాక ! దుర్జనుఁడు కష్టమే కలిగించును.

రాము—ఆహా ! జనస్థానవృత్తాంత మిప్పుడు జరుగుచున్నట్లే యున్నది.

లక్ష్మ—తే. గీ. పావు లిప్పటికిని వెతఁ ♦ జావునంత
బంగరుకురంగమున భంగ ♦ వఱచి రిచట
జానకిని బాసి యున్న దా ♦ శరథిఁ జూడ
రాయి సైతము పొగులు వ ♦ జ్రంబుఁ బగులు.

సీత—(కన్నీటితోఁ దనలో) అక్కటా! దినకరకులానందనా! నాకై నీ వెట్లువెతలపాలయితి?

లక్ష్మ—(సాకూతముగ రామునివంకఁ జూచి)ఆర్యా! ఇది యేమిటి?

తే. గీ. జాఱినసరమ్ముకరణిఁ గ ♦ న్నీరు వాఱి
పుడమిపైఁబడి యిటు నటుఁ ♦ బొరలుచుండె
నావుకొన్నను దుఃఖము ♦ చూపఱులకుఁ
దెల్ల మగుచుండె వా తెర ♦ యల్లలాడ.

రాము—వత్సా!

తే. గీ. ప్రతికృతి నొనర్పఁ దలఁచి య ♦ ప్పటి ప్రియావి
యోగదావానలంబున ♦ కోర్చినాఁడ;
మఱల నిపు డది హృదయమ ♦ ర్మవ్రణంబు
కరణి వేధించుచుండెఁ జి ♦ త్తరువుఁ జూడ.

సీత—ఛీ! ఛీ! ఇప్పుడు నేనును మేరమీఱిన భయసంభ్రమములచే న న్నార్యపుత్త్రశూన్యగాఁ దలఁచుకొనుచున్నాను.

లక్ష్మ—(తనలో) పోఁగాక! ఈపాటి యాప్రసంగము మఱపించెదను. (చిత్రపటమువంకఁ జూచి ప్రకాశముగ) ఇది మన్వంతరపురాణుండైన తాతజటాయువు విక్రమోదాహరణము.

సీత—హా! తండ్రీ! నీయపత్యస్నేహ మకృత్రిమము?

రాము—హా! తండ్రీ! కాశ్యపా! శకుంతరాజా! మఱల నీవంటిసాధువు లెచట లభింతురు?

లక్ష్మ—ఇది జనస్థానమునకుఁ బశ్చిమముగా దనువను కబంధుని యుని కిపట్టును దండకారణ్యభాగమును నగు కుంజవంత మను పర్వతము. ఇది తత్సమీపమున నున్న మతంగాశ్రమము. ఇది శ్రమణి యను సిద్ధశబరి. ఇది పంప యను పద్మాకరము.

సీత—ఇచ్చటనే కాఁబోలును. ఆర్యపుత్త్రుఁడు ధైర్యమును వదలి గొంతెత్తి దుఃఖించుట.

రాము—దేవీ! ఈ పంపాసరోవరము మిగుల రమణీయము.

తే. గీ. అంచత్రెక్కలరాయిడి ♦ సంచలించు
జలజములు గల యీప్రదే ♦ శముల మున్ను
కాంచినాఁడను కన్నీరు ♦ గ్రమ్మి తొరఁగి
మఱలఁ గ్రమ్మెడునంతఁ బ ♦ ద్మదళనేత్ర!

లక్ష్మ—ఈతఁ డార్యుఁ డగు హనుమంతుఁడు.

సీత—చిరనిర్విణ్ణజీవలోకప్రత్యుద్ధరణగురూపకారి యగు మహానుభావుఁడు మారుతాత్మజుఁ డితఁడా.

రాము—క. కన సాటిలేని దోశ్శ
క్తిని మనలం ద్రిభువనములఁ ♦ గృతకృత్యులఁ జే
సినయనఘుఁ డంజనానం
దనుఁ డీతం డెంతయును ము ♦ దం బెసఁగించుఁ.

సీత—వత్సా! లక్ష్మణా! కుసుమితకదంబతాండవితమయూరబృందం బగు నీపర్వతము పేరేమి? ఇందు ననుభావసౌభాగ్యమాత్ర పరిశేషసుందరశ్రీనొప్పి మూర్ఛాక్రాంతుండైన యార్యపుత్త్రుఁడు దుఃఖాక్రాంతుండ వగు నీచే నవలంబితుఁడై యొక చెట్టునీడ నున్నట్టు కనుపట్టుచున్నాఁడు.

లక్ష్మ—తే. గీ. తల్లి! యది మాల్యవత్పర్వ ♦ తంబు దీని
శృంగమున జలద మొకఁడు వ ♦ సించియుండు

రాము— తమ్ముఁడా! వినఁ జాల నం ♦ తనెయుఁడుగుము
నెండియు వియోగ మబ్బిన ♦ విధము దోఁచె.

లక్ష్మ—ఈపై నార్యపుత్త్రికకు నచ్చటి రాక్షసులకు నొకదానికంటె నొకటి వెఱుగుపుట్టించు కర్మములు జరిగినవి. ఆర్యురాలు పరిశ్రాంత యైనది; కావున నొక్కింతసేపు విశ్రమించుఁగాత!

సీత—ఆర్యపుత్రా! నా కీచిత్రపటదర్శనమువలన నొక్క మనోరథము కలిగినది.

రాము—అట్లయిన న న్నాజ్ఞాపింపుము.

సీత—ఆర్యపుత్త్రా! ప్రసన్నగంభీరము లైన వనపఙ్క్తులయందు విహరించి పవిత్రనిర్మలశిశిరసలిలయగు భాగీరథిలో మఱల నొకసారి యవగాహనం బొనరింపవలె నని యున్నది.

రాము—వత్సా! లక్ష్మణా!

లక్ష్మ—ఆర్యా! ఇదిగో! ఇక్కడనే యున్నాను.

రామ—గర్భవతియగు మీ వదిన కోరిన కోరిక శీఘ్రముగ సఫలముగాఁ
వలయు నని యిపుడే మన గురువులు కబు రంపిరి; కావునఁ
గుదుపు లేని యరద మొకం డాయితమ్ము గావింపుము.
సీత—ఆర్యపుత్రా! మీరును నాతో రావలయును.
రాము—కఠినహృదయా! అది నాతోఁ జెప్పవలెనా!
సీత—అట్లయిన నాకుఁ జాల సంతసము.
లక్ష్మ—మీ చెప్పినచొప్పునఁ గావించెదను.

(అని నిష్క్రమించును.)

రాము—సఖి! ఆగవాక్షముచెంతఁ బరుండుము.
సీత—ఈ పరిశ్రమమునఁ గలిగిన నిద్దురచే నా కొడలు స్వాధీనము కా
కున్నది. మీ రనినయట్లే చేయవలయు.
రాము—అట్లైనఁ గట్టిగా నను నీకౌఁగిటఁ బట్టికొనుము.

తే. గీ. ఐందవమయూఖచుంబిత • స్యందినూత్న
చంద్రమణిహారలతలకు • సాటివచ్చు
భయజనితఘర్మజలములఁ • బరిఢవిల్లు
బాహువల్లరి నామెడఁ • బరఁగుఁ గాత!

(అని యట్లు చేయించి యానందముతో) సఖి! ఇది యేమి?

తే. గీ. నిదురయో లేక మోహమో • మదమొ కాక
యిదిసుఖమొ దుఃఖమో నిశ్చ • యింపరాదు;
రమణి! నీ వంట నొక వికా • రంబు వొడమి
భ్రమముఁ గలిగించు పమ్మిడాల • నమును జేయు.

సీత—మీాకు నాయందు దట్టి యనుగ్రహము. అంతకంటె నే మున్నది!

రాము— తే. గీ. జీవకుసుమంబు నిర్మల ♦ భావ మందెఁ;
బరవశం బయ్యె నింద్రియ ♦ పటలి వారి
జానసా! నీ పలుకులు క ♦ ర్ణామృతంబు
లంతరంగంబునకును ర ♦ సాయనములు.

సీత—(ప్రియంవదా! రమ్ము శయనింతము.

రాము—సఖీ! అట్లుచూచెద వేమి?

తే. గీ. జనకజా! నిన్నుఁ బెండ్లియా ♦ డినది మొదలు
భవనమునఁ గాననంబున ♦ బాల్యమందు
జవ్వనమునఁ దలాడగా ♦ సంతరించు
నది యిదిగో! రామబాహు వు ♦ న్నదియె కాదె?

సీత—(నిద్ర నభినయించుచు.) అవునవును ఇదియున్నది ఆర్యపుత్త్రా! ఇదియున్నది. (అని నిద్రఁ బోవుచున్నది.)

రాము—ఆహా! ఈమె యిష్టసల్లాపము లొనరించుచునే నిద్రవోయినది. (చూచి)

తే. గీ. నయనముల కమృతవర్తి యీా ♦ నాతిమూర్తి;
కంఠమున కీ గృహేందిర ♦ కరము సరము;
చందనం బీవెలంది సం ♦ స్పర్శ; మీాపె
విప్రయోగంబె నా కొక్కఁ ♦ డప్రియంబు.

(ద్వారపాలకుఁడు ప్రవేశించి)

ద్వార—మహారాజా! అతఁడు వచ్చినాఁడు.

రాము—ఎవఁడు?

ద్వార—మీా యాసన్నపరిచారకుఁ డగు దుర్ముఖుఁడు.

రాము—(తనలో) అంతఃపురపరిచారకుఁ డగు దుర్ముఖుఁడా? అతఁడు పౌరజానపదుల మనోభావముల నెఱుఁగ గూఢచారిగ నాచే నంపఁబడియె (ప్రకాశముగ) ర మ్మని చెప్పుము.

(ద్వారపాలుఁడు నిష్క్రమించును.)

(ప్రవేశించి)

దుర్ము—(తనలో) అక్కటా! ఇట్టి యీ జనాపవాదమును దేవి యెఱుంగకుండఁ బ్రభువున కెట్లు తెలియఁ జేయుదును? విచారింప నేల! మందభాగధేయుఁ డగు నా కిదియే నియోగము.

సీత—(కలవరించుచున్నది) అయ్యో! ఆర్యపుత్త్రా! ఎక్కడకుఁబోతివి?

రాము—చిత్రపటదర్శనమువలనఁ గలిగిన యీ వియోగభావనయే ప్రియురాలికి స్వప్నోద్యోగము సేయుచున్నది. (ప్రేమముతో నామె యొడలు తడవుచు)

తే. గీ. కష్టసుఖముల నెప్పట్లఁ ♦ గలసిమెలసి
సంచరించెను హృదయవి ♦ శ్రామభూమి
స్నేహసారాంశ మనురాగ ♦ సింధుసీమ
సీత కల్యాణముల నధి ♦ ష్ఠించుఁ గాత!

దుర్ము—(సమీపించి) దేవా! జయ మగుఁగాక!

రాము—దుర్ముఖా! నీ వెఱింగి వచ్చిన విశేషము లేమో నుడువుము.

దుర్ము—శ్రీరామరాజ్యము దశరథమహారాజుగారిని మరపించుచున్నదని పౌరులును జానపదులును స్తోత్రము చేయుచున్నారు.

రాము—ఇట్లనుట జనుల కెప్పుడును స్వభావమే. జనులు నాయెడ నేమైన దోషారోపణముఁ జేయుచుండిరేమో చెప్పుము. దానికి వెంటనే ప్రతివిధానముఁ జేసెదను.

దుర్ము—(కన్నీటితో) మహారాజా వినుము! (చెవిలో) ఇట్లు.

రాము — అక్కటా! ఈ వాగ్వజ్ర మతితీక్ష్ణము. (అని మూర్ఛిల్లును.)
దుర్ము — దేవా! ఊరడిల్లు మూరడిల్లుము.
రాము — (నిట్టూర్చి)

తే. గీ. సుదతి పొరుగింట నుంట త ♦ ప్పిద మటంచు
వినఁ గన఼ఁగ రాని శాంతిఁ గా ♦ వించినాము
విధివశముగాదె యాలర్క ♦ విషముపగిది
వెండియు నఖండముగ నది ♦ విస్తరిలుట.

అయినచో మందభాగ్యుఁడ నగు నే నిప్పు డేమి చేయుదును?
(విమర్శించి కరుణముగ) ఇంతకన్న నిఁక నే మున్నది?

తే. గీ. ఏకరణినైన లోకుల ♦ కెల్లరకు ము
దంబు సమకూర్చుచుంట పె ♦ ద్దల మతంబు;
నన్ను విడనాడి తుదకుఁ బ్రా ♦ ణముల విడచి
నాన్నగా రది నెరవేర్చి ♦ నారుగాదె?

ఇప్పుడే యీ సమాచారముం గుఱించి గురువుగారును గబు
రంపినారు. ఇదియునుంగాక,

తే. గీ. ఇనకులంబున నుద్భవిం ♦ చినకడింది
భూమిపాలుర చరిత మ ♦ ద్భుతము; దాని
నేనొకఁడ నలుపుసేసితి ♦ నేని యట్టి
పరమనిర్భాగ్యు నన్నుఁ జె ♦ ప్పంగవలెన?

హా! దేవీ! దేవయజనసంభవా! హా! స్వజన్మానుగ్రహ పవి
త్రితవసుంధరా! హా! మునిజనకనందినీ! హా! పావకవసిష్ఠారుంధతీ
ప్రశస్తశీలశాలిని! హా! రామమయజీవితా! హా! మహారణ్యావాస ప్రి
యసఖీ! తాతప్రియా! హా! స్తోకప్రియవాదిని! నీకిట్టి దురవస్థ యెట్లు
కలిగినది?

తే. గీ. లోకులా నీకతాన ను ♦ శ్లోకు లైరి;
నీ యెడల వారి మాటలా ♦ నియతిఁ దప్పె;
ముజ్జగంబుల నేలెడు ♦ ముగుద వయ్యు
ననదవలె నీవు నిడుమల ♦ నందనుంటి.

దుర్ము—కటకటా! అగ్నిపరిశుద్ధినొంది పవిత్రగర్భవతి యగు దేవిగారికి దుర్జనాపవాదమువలన మహారాజుగా రిట్లుచేయుట తగవుగాదు.

రాము—పాపము శాంతించుఁగాత! జానపదు లన్నఁ జాల దుర్జనులు.

తే. గీ. జనుల కిక్ష్వాకువంశంబు ♦ సమ్మతంబు;
దైవవశమున నీ కింవ ♦ దంతి గలిగె;
నగ్నిపరిశుద్ధ సలిపితి ♦ మనుచుఁ జెప్ప
నెక్కడిదో? దూరవృత్తాంత ♦ మెవఁడు నమ్ము!

కావున నీవు పొమ్ము.

దుర్ము—హా! దేవీ! (అనినిష్క్రమించును.)

రాము—అక్కటా! ఎంతకష్టమువచ్చినది! ఘోరకర్మాచరణంబున నృశంసుఁడ నగుచున్నాను.

తే. గీ. చిన్నతనమునమండి నేఁ ♦ బెంపఁ బెరిఁగి
మనసు నాయందె నిల్పిన ♦ మానవతిని
గైతవంబున మృత్యుము ♦ ఖంబునందు
వైచుచుంటిని యొఱుకల ♦ వాని కరణి.

కావునఁ బాతకి నగు నన్నీ పావనురాలు ముట్టికొనఁ దగదు.

(అని సీతతల నెత్తి బాహువు నాకర్షించి)

తే. గీ. ఏమియు నెఱుంగ వో ముద్ద! ♦ యిప్పుడయిన
నను విడు మపూర్వకర్మచం ♦ డాలుఁడితఁడు;

మంచిగంధముఁ జెట్టని • మదిఁ దలంచి
కొండొక విషద్రుమంబును • గొలుచుచుంటి.

( లేచి )

కటకటా! జీవలోక మిప్పు డెంత మార్పుఁ జెందినది! ఇంక రాముఁడు బ్రతికియున్నఁ బ్రయోజనము లేదు శూన్య మగు నీ జగము కారడవివలెఁ దోఁచుచున్నది. నా సంసార మంతయు నిస్సార మైనది. శరీర మెల్లఁ గష్టభూయిష్ఠ మైనది. నే నింక దిక్కులేనివాఁడనైతి ఏమి సేయుదును? ఏమి గతి? అవును.

తే. గీ. కొఱంత లేకుండ నిముసములఁ • గుసుమకోమలికె
తరలిపోయిన జీవంబు • మఱల నచ్చె;
నాయములు సోక నంటుచు • నక్కటకట!
ప్రాణములు వజ్రకీలక • ప్రాయ మయ్యె.

అమ్మా! అరుంధతీ! భగవానులారా! వశిష్ఠవిశ్వామిత్రులార! దేవా! పావక! దేవీ! భూతధాత్రి! తండ్రీ! జనకమహారాజ! అమ్మా! కౌసల్యా! స్వామ్యా! హనుమంత! ప్రియసఖా! మహారాజా! సుగ్రీవా! మహోపకారీ! లంకానాయకా! విభీషణా! సఖీ! త్రిజట! ఈరామ హతకుఁడు మిమ్ముల నందఱఁ దస్కరించినాఁడు. తిరస్కరించినాఁడు.

అవునుగాని——ఇప్పు డప్పగమపావనుల నాహ్వానము సేయుటకు నే నెవ్వాఁడను?

తే. గీ. ఇట్టి విశ్వాసఘాతకుఁ • డీ దురాత్ముఁ
డట్టివారల నామము • లనువదింప
నా మహాత్ముల పయిత మ • వ్యాహతముగ
దురితసంతతు లెల్లెడఁ • బొరయకున్నె.

తే. గీ. నమ్మకంబున నా హృద • యమ్మునందుఁ
బడి నిదురఁ జెందు ప్రియధర్మ • పత్ని వీడి
భయచలితపూర్ణగర్భను • బాపినగుచుఁ
గట్టడి మృగంబులకు బలి • నెట్టుచుంటి.

(సీతపాదముల శిరమునఁ దాల్చి) దేవీ! నీచరణసరసిజద్వంద్వము రాముని యుత్తమాంగమున నుంచుట కిదియే కడసారి. (అని యేడ్చుచున్నాఁడు.) (తెరలో)

అబ్రహ్మణ్య మబ్రహ్మణ్యము.

రాము—ఓహో! ఇది యేమో తెలియవలెను.

(తిరిగి తెరలో)

తే. గీ. యామునతటాధివాసులై • యహరహంబు
నుగ్రతప మాచరించుచు • నుండు మునులు
రామ! లవణాసురుని కోడి • రక్షకుండ
వంచు నినుఁ జూడ నిచటికే • తెంచినారు.

రాక్షసభయ మిప్పటికినిఁ గలదా? అయినచో నీదురాత్ముని గుంభీనసపుత్త్రుని దునుమాడుటకు శత్రుఘ్ను ననిపెద. (అని కొన్ని యడుగులు నడచి తిరిగి వచ్చి) హా! దేవి! ఇట్టి నీ విఁక నేమగుదువో! భగవతీ! వసుంధరా! ఉత్తమచరిత్రయగు నీ పుత్త్రిక జానకిఁ గాపాడుకొనుము.

తే. గీ. జనకరఘ్వన్వవాయరా • జన్యతిలక
గోత్రమాంగళ్యదాయిని • గుణగణాఢ్య
అనఘ యగు దేవయజనము • నందు నీవు
కడుపు చుమ్మలువాఱఁగఁ • గన్నబిడ్డ.

(అని శోకించుచు నిష్క్రమించును.)

సీత—హా! సౌమ్యా! ఆర్యపుత్త్ర! ఎక్కడ నుంటివి? (అని శీఘ్రముగ లేచి) అయ్యో! అయ్యో! నావిభు నెడఁ బాసినట్లు దుస్స్వప్నము వచ్చినది. నే నా భయముచే వ్యాకుల నైతిని.

(అని యంతటఁ జూచి)

అయ్యో! అయ్యో! నిదురించుచున్న న న్నొంటరిగ దిగ విడిచి నానాథుఁడెచటికిఁ బోయెను. అవుఁగాక! అతఁడు నాకంటఁ బడినచో నేనాతనిపైఁ గోపించెదను. ఇక్కడఁ బరిచారకు లెవరున్నారో?

(ప్ర వే శిం చి)

దుర్ము—దేవీ! లక్ష్మణకుమారుఁడు "రథ మాయత్తమైనది; దేవిగారు వచ్చి యధిష్ఠింప వచ్చు" నను మనవి చేయఁ బనిచినాఁడు.

సీత—ఇదిగో! వచ్చి యధిష్ఠించెదను. (అని లేచి పరిక్రమించి) నా కడుపదరుచున్నది. మెల్ల మెల్లఁగా నెల్లుదము.

దుర్ము—దేవీ! ఇటురమ్ము తల్లీ.

సీత—తపోధనుల కందఱకు వందనములు. రఘుకుల దేవతల కెల్లరకు నభివాదములు. ఆర్యపుత్త్రపాదపద్మములకుఁ బ్రణామములు. సకల గురుజనమునకు సాష్టాంగములు.

(అని యందఱు నిష్క్రమింతురు.)

ప్రథమాంకము సమాప్తము.





శ్రీ

# ఉత్తరరామచరితము.

## ద్వితీయాంకము.



(తెరలో)

తపస్విని! నీకు స్వాగతము.

(తరువాత సధ్వగవేషధారిణి యగు తాపసి ప్రవేశించును.)

తాపసి—అదిగో! ఈవనదేవత ఫలకుసుమపల్లవంబుల నొప్పు నర్ఘ్యముం గొని దూరమునుండి నన్నుఁ బూజింప వచ్చుచున్నది.

(ప్రవేశించి)

వనదేవత—(అర్ఘ్యమునిచ్చి)

తే. గీ. నేఁడు సుదినంబు; పెద్దల • తోడిచెలిమి
పూర్వపుణ్యంబునం గాని • పొందరాదు;
విశ్రమింపుఁడు తాపస • విధికిఁ దగిన
పండ్లు దుంపలు నిట సుల • భములు మీకు.

తాప — ఈ విషయ మై యింతగాఁ జెప్పవలసిన దే మున్నది?

తే. గీ. వినయమధురంబు నుడి సతి ♦ వృత్తి, పరిచ
యం బనింద్యంబు, బుద్ధి క ♦ ల్యాణి, ముందు
వెనుక మాఱని యనురాగ ♦ మును గలట్టి
సాధుచరితంబు నెన్న వ ♦ శంబు గాదు.

(కూర్చుచుందురు.)

వన దేవత — పూజ్యురాలా! ఆత్రేయి! నీ వెచటనుండి వచ్చుచుంటివి? ఈ దండకారణ్యమున కరుగుదెంచుట కేమిపని?

ఆత్రే — తే. గీ. వేదవేదాంగవిదు లగ ♦ స్త్యాదు లిచటఁ
బలువురు వసింతురు మహానులు ♦ వారితోడ
నుపనిషద్విద్య నేర్వఁగ ♦ నొప్పు సంచు
నిటకు వచ్చితి వాల్మీకి ♦ యిరవునుండి.

వన — భగవతీ! ఇతర మును లెల్లను వేదాంతాభ్యాస మొనరింపఁ బురాణబ్రహ్మవాది యగు ప్రాచేతసు నుపాసించు చుందురు గదా ని విట్లాతని వదలి యీ దేశమున కేల వచ్చితివి?

ఆత్రే — ఆతని యొద్ద నా యధ్యయనమునకుఁ బెద్దవిఘ్నమట్లు తటస్థించుటచే నింతదూర మిట్లు రా వలసి వచ్చినది.

వన — ఆ విఘ్న మట్టిది?

ఆత్రే — ఆ భగవానుఁ డెవ్వరో యే దేవత పాలువిడిచిన చిన్నపిల్లనిరువురఁ దెచ్చి యిచ్చెను. వా రతనికే కాక తిర్యగ్జంతువులకు సయితము ప్రేమ పుట్టించు చున్నారు.

వన — వారి కేవైన నామము లున్నవా?

ఆత్రే—ఆ దేవతయే «కుశలవు" లని పేరులును వారి పరిభావము ను జెప్పినది.

వన—వారి పరిభావ మెట్టిది?

ఆత్రే—పుట్టినతోడనే వారికి సరహస్యప్రయోగ సంహారము లగు జృంభకాస్త్రములు లభించిన వఁట.

వన—ఆహా! ఇది చాల విచిత్రము.

ఆత్రే—వారి నా భగవానుఁడు వాల్మీకిమహాముని పెంపుడుతల్లివలె బోషించి రక్షించె. పిమ్మటఁ జౌలము నొనరించి వేదములు గాక తక్కినమూఁడువిద్యలను గఱపె. అనంతరమునఁ బదునొఁ కండవయేఁట క్షత్రియవిధిచే నుపనీతులఁ జేసి వేదములఁజెప్పె· అతిదీప్తప్రజ్ఞులగు నా వటువులతో మాబోంట్లకు సహాధ్యాయ నయోగము దుర్లభము. ఏలన:—

తే. గీ. ప్రాజ్ఞునకు విద్యఁ గఱపిన ♦ పగిది నొజ్జ
మందునకుఁ జెప్పినను భేద ♦ మందుఁ గల్గు
మణి గ్రహించినక్రైవశి ♦ మంటిగడ్డ
యించుకయు బింబమును గ్రహి ♦ యింప లేదు.

వన—ఇదియా నీ యధ్యయనమునకు విఘ్నము?

ఆత్రే—మఱియు నిం కొకటి గలదు.

వన—అ దేది?

ఆత్రే—ఇది యిట్లుండ నా బ్రహ్మర్షి యొకనాఁడు మధ్యాహ్నకృత్య ముల నేఱవేర్చుటకుఁ దమసానది కేగి యచటఁ గవగూడి సం చరించు క్రౌంచపక్షుల యం దొకదాని నొక యెఱుకు చంపు టఁ గనుఁగొని యాకస్మికముగఁ బొడమిన వాగ్దేవిప్రభావం బున నొక యానుష్టుభచ్ఛందము నుడివెను.

* "శ్లో. మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్." అని.

వన—వేదములకంటె మఱియొకచోట ఛందస్సు లవతరించుట కిదియే మొదలు.

ఆత్రే—పిదప నొకనాఁ డావిఖ్యాతశబ్దప్రకాశుఁ డగు నా బ్రహ్మర్షిం జేరి భూతభావనుం డగు పద్మయోని యి ట్లనియె. "బ్రహ్మర్షీశ్వరా! వాగ్బ్రహ్మంబునఁ బ్రబుద్ధుఁడ వైతివి. కావున శ్రీరామచరితము నొకకావ్యముగ రచింపుము. అవ్యాహతప్రకాశ మగు నీ యార్ష చక్షుస్సు ప్రకాశించుఁ గాత. నీవే కవుల కెల్ల నాద్యుఁడవు." అని చెప్పి యంతర్హితుం డయ్యె. పిమ్మట నా భగవానుఁడు ప్రాచేతసుఁడు రామాయణ మను నితిహాసము రచియించె.

వన—ఆహా! ప్రజలపుణ్యము ఫలించినది.

ఆత్రే—కావున నే యచ్చట గొప్పయధ్యయనవిఘ్నము తటస్థించె నని చెప్పితిని.

వన—అవును. నీవు చెప్పినది యుక్తముగ నే యున్నది.

ఆత్రే—వనదేవతా! నా మార్గాయాసముం దీర్చుకొంటిని. నా కిపు డగస్త్యాశ్రమమునకుఁ ద్రోవఁ జెప్పుము.

వన—ఇచటి నుండి పంచవటి కేగి యాగోదావరీతీరమున నే పోవ లయును.

---

* తే॥గీ కుసుమశరచాపలంబులఁ ♦ గూరియున్న
క్రౌంచమిథునంబు నందు నొ ♦ క్కండు నీవు
కఠినమతిఁ జావ నేసితి ♦ గాన నింక
మహిని బెక్కేండ్లు బ్రదుకకు ♦ మా నిషాద.

ఆత్రే—(కన్నీటితో) ఇది తపోవనమా ? ఇది పంచవటియా ! ఈ నది గోదావరియా ? ఇదియే యాప్రస్రవణపర్వతము ? నీవే యా జనస్థానదేవత వగు వాసంతివి ?

వన—అవును. నీచెప్పిన వన్నియు నివియే.

ఆత్రే—హా ! వత్సా ! జానకీ !

తే. గీ. అప్పుడప్పుడు కథాప్రసం ♦ గాంతరములు
నీవు చెప్పుచుంటివిగా ♦ యివి ? కుమారి !
వీనిఁ గనుఁగొన్న స్మరణీయ ♦ మైన నిన్నుఁ
గన్నులారఁగఁ జూచిన ♦ కరణి నుండె.

వాసం—(భయవిహ్వలతతో) స్మరణీయ యనుచున్న దేమి ? (ప్రకాశముగ) ఆత్రేయీ ! సీత కేమి యత్యాహితము వచ్చినది ?

ఆత్రే—అత్యాహితమొక్కటే కాదు. అపవాదముగూడ (చెవిలో) ఇట్లని.

వాసం—అక్కటా ! ఎంతదారుణమగు విధి తటస్థించినది !

(మూర్ఛిల్లును)

ఆత్రే—వాసంతీ ! ఊఱడిల్లు మూఱడిల్లుము.

వాసం—హా ! ప్రియసఖీ ! నీ పుట్టు విట్టు లైనదా ? అహా ! రామభద్రా ! అవును. నిన్ననవలసిన పని యేమున్నది ! అయ్యో ! ఆత్రేయీ ! లక్ష్మణుఁ డరణ్యమున విడిచి వచ్చినతరువాత నేమి జరిగినదో తెలిసినదా !

ఆత్రే—లేదు ; లేదు.

వాసం—అయ్యో! అరుంధతీవసిష్ఠులు గురువులుండ వృద్ధ లగు రాజమాతలు జీవించి యుండ నిది యెట్లు జరిగినది ?

ఆత్రే—అప్పుడు పెద్దలందఱు ఋష్యశృంగుని యజ్ఞముం జూడ నేగిరి ఇప్పు డది పరిసమాప్తం బైనది. ఋష్యశృంగుఁడును వారిని బూజించి సాగ నంపెను. పిదప భగవతి యగు నరుంధతి కోడలులేని యయోధ్యకు రా నొల్ల ననియె. రామమాతలును దానినే యనుమతించిరి. వారి నూటంకము వలన వసిష్ఠమహర్షి యుఁ బ్రాచేతసాశ్రమమునకుఁ బోయి నివసింపఁ దలఁచి యున్నాఁడు.

వాసం—మఱి యిప్పు డా రామభద్రుఁ డేమి చేయుచున్నాఁడు ?

ఆత్రే—ఆతఁ డిప్పుడు రాజర్షితు నగు నశ్వమేధ మొనరింప సమకట్టి యున్నాఁడు.

వాసం—అయ్యో! ఛీ ఛీ! రాముఁడు తిరిగి పెండ్లియాడెనా ?

ఆత్రే—పాపము శాంతించుఁ గాక! లేదు: లేదు.

వాసం—అయినచో నీ యజ్ఞమునఁ ధర్మచారిణి యెవతె ?

ఆత్రే—బంగారుచేఁ జేయఁబడిన సీతాప్రతికృతియే ధర్మపత్నిగా గ్రహింపఁ బడియె.

వాసం—ఆహా!

తే. గీ. పూలకన్నను మార్దవం ♦ బునఁ జెలంగుఁ;
జాలకఠినంబు లగు మఱి ♦ బూలకన్న;
మహితు లగు వారి హృదయమ ♦ ర్మములఁ దెలియఁగ
నెవ్వఁ డిద మిత్థ మనుచు నూ ♦ హింపఁగలఁడు ?

ఆత్రే—వసిష్ఠమహర్షి పరదేశగతుం డగుటచే వామదేవానుమతంబున మేధ్యాశ్వము విడువఁ బడియె. దానికి శాస్త్రానుసారంబుగ రక్షకులు నియమింపఁ బడిరి. లక్ష్మణాత్మజుం డగు జంద్రకేతున కు దివ్యాస్త్రసాంప్రదాయము నెల్ల నెఱిఁగించి చతురంగసైన్య సమేతునిఁ గావించి వారల కధిష్ఠాతగా ననిపిరి.

వాసం—(ఆనందబాష్పములు గురియు) అమ్మా! బ్రదికితిని. లక్ష్మణకు మారున కంతటి కొమరుండు గలఁ డని చెప్పితివి.

ఆత్రే—ఈ నడుమ నొక బ్రాహ్మణుఁడు గుండె బాఁదుకొనుచు మృతుఁడగు సుతుని రాజద్వారముచెంతఁ బడవైచి యబ్రహ్మణ్య మని యుద్ఘోషింప మొదలు వెట్టెను. అంతట "రాజాపచారము లేకుండఁ బ్రజల కకాలమృత్యువు కలుగ" దని కరుణామయుండగురామభద్రుఁడాత్మదోషనిరూపణముఁజేయుచుండ,

తే. గీ. "పుడమి పై నొక్క కాఁపు శం • బూకుఁ డనెడు
వాఁడు తప మాచరించు చు • న్నాఁడు; నీకు
వాఁడు తలఁ ద్రుంపఁ దగినట్టి • వాఁడు; వాని
జంపి బ్రదికింపుమా రామ • చంద్ర! ద్విజుని."

అని యిట్లొక్క యశరీరవాక్కు బయలువెడలెను. అది విని కృపాణపాణి యై పుష్పకము నధిష్ఠించి యా జగత్పతి యెల్ల చోటుల శూద్రతాపసాన్వేషణ మొనరింపఁ బ్రారంభించెను.

వాసం—శంబూకుఁ డను శూద్రుం డధోముఖుం డై ధూమపాన మొనరించుచు నీ జనస్థానమునఁ దపముఁ జేయుచున్నాఁడు. తిరిగి మా రామభద్రుం డొకమా ఱీ వనంబునలంకరించునా?

ఆత్రే—వాసంతీ! నే నింకఁ బోయి వచ్చెదను.

వాసం—ఆర్యా! ఆత్రేయి! మంచిది. ఎండ చాలఁ దీక్ష్ణముగనున్నది.

తే. గీ. కొమ్మలను జేరి పిట్టలు ♦ కూయఁ దీర
భూరుహంబులు గౌతమిఁ ♦ బూజసేయ
నెండవేఁడిమి సడలి వే ♦ దండగండ
పిండకషణంబున నె రాలు ♦ చుండుపూల.

(అని పరిక్రమించి నిష్క్రమింతురు)

ఇది విష్కంభము.





# ఉత్తర రామ చరితము.

## ద్వితీయాంకము.



(పిదపఁ బుష్పకాధిరోహణఁ జేయు ఖడ్గమును ధరించి సదయుం డగు రాముఁడు ప్రవేశించును.)

రామ — తే. గీ. మృతిని జెందిన బ్రాహ్మణ ♦ సుతుఁడు బ్రదుక
హస్తమా! త్రుంచు మీ ముని ♦ మస్తకంబు;
నెలలు నిండిన సీతఁ గా ♦ నలను విడిన
కఠిను హస్తంబ వైతివి ♦ కరుణ యేల?

(అతికష్టముగ ఖడ్గముఁ బ్రయోగించి)

రామునకుఁ దగిన పని జరిగెను. ఆ బ్రాహ్మణపుత్త్రుఁడు జీవించునా?

(శంబూకుఁడు దివ్యపురుషుఁడై ప్రవేశించి)

దివ్య — దేవా! జయ మగుఁ గాక!

తే. గీ. క్షితి భయము మాన్పి నీవు శా ♦ సించుచుండ
బ్రదికె నీ కుఱ్ఱ; నే నిట్టి ♦ పదవిఁ గంటి;
వీఁడె శంబుకుఁ డెఱఁగుచు ♦ న్నాఁడు; ఘనుల
చేతఁ జచ్చియు ముక్తిని ♦ జెందవచ్చు.

రాము—ఓయీ! మా కీ రెండును బ్రియములే కావున నీవునీయు
గ్రతపఃఫలము ననుభవింతువు గాక.

తే. గీ. మోదముల కిమ్ము; లానంద ♦ మునకుఁ దావు;
లమితపుణ్యవిభూతుల ♦ కాలయములు;
తైజసంబులు; నీకు వై ♦ రాజలోక
ములు; చిరంబు వసింపఁ గఁ ♦ గలుగుఁ గాత!

శంబూ—స్వామీ! ఈ మహిమ మీ యనుగ్రహమువలనఁ గలిగినదే
తపస్సువలన నే మున్నది? అది యీ గొప్పయుపకారము
మాత్రి మొనరించినది.

తే. గీ. మూఁడుజగముల నేలెడు ♦ వాఁడ వొక్క—
కాఁపువానిని నను వెదు ♦ కంగ రాఁ గ
తంబు నాదు తపోమహి ♦ మంబ; కాక
యున్న దండక యేడ? న ♦ యోధ్య యేడ.

రాము—ఇది దండకారణ్యమా యేమి! (అంతటఁ గనుఁగొని) ఔను.

తే. గీ. పచ్చికబయళ్ళు నిర్ఝర ♦ ఝాంకృతముల
మొరయు దిక్కుల నాశ్రమ ♦ మ్ముల వనముల
గిరులఁ, దీర్థంబులను; బరి ♦ కించిచూడఁ
బరిచితంబులు దండకా ♦ పరిసరములె.

శంబూ—దేవా! ఇది దండకావనమే. పూర్వము నీ విచట నివసించి,

తే. గీ. బాహుబలమున నొరునితో ♦ డ్పాటు లేక
పల్లురక్కసులను బదు ♦ నాల్గువేలఁ
దున్మి ఖరదూషణత్రిమూ ♦ర్ధులను ముగురఁ
ద్రుంచి నిష్కంటకంబు గా ♦ వించి తధిప!

కావున నే మాబోఁటి జానపదులు సైత మీ సిద్ధక్షేత్రమున నిర్భయముగ సంచరింప వలనుపడియె.

రాము—ఇది యొక దండకారణ్యమే కాక జనస్థానముకూడనా?

శంబూ—అవును. సర్వభూతములకు రోమాంచముగలిగించు నీయున్నత్తచండ శ్వాపదకులాక్రాంతవికటగిరిగహ్వరంబు లగు జనస్థానపర్యంతదీర్ఘారణ్యములు దిక్కులముగ నున్నవి.

తే. గీ. చండసత్త్వస్వనములు ని ♦ శ్శబ్దములు ప్ర
సుప్తభుజగంబు లైన యీ ♦ చోటులందుఁ
దొండ లెంతయు దాహము ♦ తోడ నుండి
కొండచిలువల చెమటలఁ ♦ గ్రోలుచుండె.

రాము—తే. గీ. పూర్వము ఖరాసురుండు కాఁ ♦ పురము సేయు
తావకం బగు నీ జన ♦ స్థానముఁ గన
మున్ను జరిగిన వృత్తాంత ♦ ములును నేఁడు
కనుల వ్రేలాడు చున్నట్లు ♦ కనఁగఁ దోఁచు.

(నలుదెసలఁ బరికించి) సీత కారామములనినఁ బ్రీతి మెండు ఆకాంతారము లివియే. నాకింతకంటె భయంకర మేమున్నది?. (కన్నీరు నించి)

తే. గీ. కమ్మవిరితేనె తావులు ♦ గ్రమ్ముచుండు
వనుల మన మిద్దఱము నుండ ♦ వలయు ననుచు
సీత యెంతయు ముచ్చటఁ ♦ జెందుచుండు
నాపె యనురాగమును జెప్ప ♦ నలవి గాదు.

తే. గీ. ఏదియు నొసర్చ నక్కఱ ♦ లేదొకనికి
మోదము జనించు నొక్కని ♦ మొగముఁ జూడ
నెవని కెవ్వఁడు ప్రియుఁ డగు ♦ నెంచి చూడ
వాని కవ్వాఁడు చెప్పఁగ ♦ రాని విందు.

శంబూ—ఆర్యా! ఈ దుస్తరారణ్యప్రస్తావము చాలును. ఇంక మద
కలమయూరకంఠకోమలచ్ఛవి నొప్పి యవిరళనివిష్టనీలబహుల
చ్ఛాయాతరుషండమండితంబు లై నిర్భయసంచారవివిధమృగ
యూథములు గలిగి ప్రశాంతగంభీరంబు లగుచు శ్వాపదకులశ
రణ్యము లగు నీ యరణ్యములఁ గనుఁగొనుము.

తే. గీ. ఇచ్చట మదించి విహగము • లెక్కి త్రొక్కఁ
బ్రిబ్బపూవులతావు లా • గుబ్బతిలఁగ
ప్రీలఁ బంక్తిన యల్లొనే • రేళ్ళు వంగి
వఱుతఁ బడ మ్రోయు నేఱులు • వాఱు చుండ.

మఱియు—

తే. గీ. దీన గిరిగహ్వరములఁ బ్రి • తిధ్వనించి
భల్లుకాంబూకృతములు వ • ర్ధిల్లు చుండె
గజదళితసల్లకీగ్రంథి • కటుకషాయ
శిశిరనిష్యందగంధము • చెలఁగు చుండె.

రాము—(కన్నీరునాఁపుకొని) భద్రా! నీకు దేవలోకమార్గములు మం
గళప్రదము లగుఁ గాత! నీ వికఁ బుణ్యలోకగమనమునకు వి
మానము నధిష్ఠింపుము.

శంబూ—పురాణబ్రహ్మర్షి యగు నగస్త్యునకు నమస్కరించి యనంతర
మున శాశ్వతపదమునకుఁ బోయెద.

(అని నిష్క్రమించును)

రాము—తే. గీ. ఈ వనం బదె వెండియు • నిపుడు చూడఁ
గలిగె మే మిందు మును చిర • కాల ముండి
గృహుల మారణ్యకుల మయి • విహితరీతిఁ
జూరగొంటిమి సంసార • సుఖములెల్ల.

తే. గీ. అవియె విరువన్మయూరము ♦ లగు నగంబు
లవియె మత్తహారిణంబు ♦ లగు వనములు
నీపవంజులనీలవా ♦ నీరపరివృ
తంబు లై యొప్పు నీ సరి ♦ త్తటము లవియె.

తే. గీ. మేఘమాల యనంగ స ♦ మీపమునకుఁ
గనుఁగొనం దగు నిది ప్రస్ర ♦ వణనగంబు
గౌతమీనది యిచ్చటఁ ♦ గ్రాలు దీని
శృంగమున గృధ్రరాజు వ ♦ సించువాఁడు.

తే. గీ. దానికిఁగ్రిందనె మేమును ♦ దాటియాకు
టింటిలోపల నివసించు ♦ చుంటి మప్పు
డిందు గోదావరీనది ♦ యందు వ్రాలు
తరుల శకునిరుతంబులఁ ♦ దనరు వనము.

వివిధవిస్రంభాతిప్రసంగ నిదర్శనము లైన యీ నగ పరిదేశములుగల్గి జానకీప్రియసఖి యగు వాసంతి యను వనదేవత కునికిపట్టగు నా పంచవటి యిచ్చటనే యున్నది. ఏమిది? మృతప్రియుఁడై యున్న రామునకిట్టి దురవస్థ వచ్చినది.

తే. గీ. విషము చిరకాలమునకు వ్యా ♦ పించినట్లు
హృదయశల్యము రాపిడిఁ ♦ గదలినట్లు
వ్రణము మాని పడంపడి ♦ వ్రస్సినట్లు
లధిక మై శోక మిపుడు మో ♦ హంబు సేయు.

అయినను బూర్వపరిచితము లగు నీ భూప్రదేశములను జూచెదను. (నిరూపించి) భూతసన్నివేశ మంతయు మార్పుఁ జెందినది.

తే. గీ. నదులు ప్రవహించునెడఁ బులి ♦ నంబు లయ్యె
విరళఘనభావములు మాత్ర ♦ వృక్షములకు
శైలసంస్థానమునఁ గాక ♦ చాలఁగాల
మునకుఁ జూచుట నదె యను ♦ శౌనఁగఁ జాల.

అయ్యో! నే నేమి సేయుదును? పంచవటీదర్శనముఁ జేయ లేక నేను మానుకొన్నను దత్స్నేహము నన్ను మాననీయక బలవంత పెట్టుచున్నది. (కరుణముతో)

శా. ఎం దానాళుల నాపెతో స్వగృహమం దె ట్లట్టు లే నిమ్ములం
బొందం గంటి; యదీయగాథ లె సతంబుల్ నిత్యు లై చెప్ప నొ
ప్పుం దత్పంచవటీవనిం, బ్రియతమం బొనాఁడె యిష్టాంటి నే
చందానం గనుఁ బాపి రాముఁ డె టుపేక్షం జూడకే పోయెదన్.

( ప్ర వే శిం చి. )

శంబూ—దేవా! జయమగుఁ గాత! అగస్త్యభగవానుఁడు నీ విచటికి వచ్చితి వని నావలన విని "వత్సల యగు లోపాముద్ర నీవు వచ్చి విమానావతరణముఁ జేయునప్పుడు చేయవలసిన శుభోపచారముల నాచరింప వలె నని కాచుకొని యున్నది. మహర్షు లందఱు నీరాక కెదురు చూచుచున్నారు. కావున మమ్ము సంభావనఁ జేయ నొకమాఱు రావలెను. తరువాత నతివేగము గల విమానము నధిష్ఠించి స్వదేశమునకుఁ బోయి యశ్వమేధ ప్రయత్న మొనరింపవచ్చు" నని సెల విచ్చినాఁడు.

రాము—ఆ భగవంతుని యాజ్ఞానుసారముగనే వర్తించెదను.

శంబూ—దేవా! ఇటురమ్మిటురమ్ము.

రాము—(పుష్పకముఁ గదల్చి) భగవతీ! పంచవటి! పెద్దలమాట నతిక్రమింపనేరక రాముఁడొక్కక్షణకాలము నిన్ను విడుచుచున్నాఁడు. క్షమింపుము.

శంబూ—దేవా! కనుఁగొనుము.

శా. కూజత్కుంజకుటీరకౌశికఘటా ♦ ఘూత్కారవత్కీచక
భాగ్రజత్సంభ్రమమయూరకాకకుల మీ ♦ క్రౌంచావతక్షోణి భృ
దాగ్రజం బిందు నటచ్ఛిఖండిరుతభీ ♦ తవ్యాళముల్ గోహణ
త్వాగ్జస్కంధములందుఁ గోటరములం ♦ గంపించుచుం డాగెడున్.

మఱియు—

తే. గీ. దక్షిణమహీంధరములు గ ♦ ద్గదనదత్ప్ర
భూతగోదావరీజలం ♦ బులు పరస్ప
రోపఘాతలుఠత్తరం ♦ గోల్బణములు
మహితపుణ్యనదీసంగ ♦ మములు నవియె.

(అని యందఱు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.



శ్రీ

# ఉత్తర రామ చరిత ము.

## తృతీయాంకము.

( తరువాత నదీద్వయము ప్రవేశించును. )

ఒక తె—సఖీ! మురళా! తొందరగలదానివలె నుంటి వేమి?

ముర—చెలీ! అగస్త్యభగవానుని ధర్మపత్ని లోపాముద్ర గోదావరి తో నిట్లు చెప్పు మని నన్ను బంపెను. "కోడలిని విడిచినది మొదలు రామభద్రుని స్థితి యెట్లున్నదో నీవే యెఱుంగుదువు.

తే. గీ. మానసంబున నెవ్వగ ♦ మఱుఁగుఁగాని
వెలికిఁ దెలియంగనీఁడు గం ♦ భీరుఁ డగుట
గాఢ మగు పుటపాకము ♦ కరణి నెయ్యెఁ
గాన నయ్యెడు రాముని ♦ కరుణరసము.

అట్టి యిష్టజనవినిపాతంబునఁ గలిగిన శోకసంతాపముచే రామభద్రుఁ డిప్పుడు మిగులఁ జిక్కి యున్నాఁడు. ఆతని జూచి పూవువంటి నా హృదయము చలించుచున్నది. ఇపుడు మరలి వచ్చు రామభద్రుఁడు పంచవటీవనమున మున్ను భార్యాసహితముగ విహరించిన ప్రదేశములను దప్పక చూచును. అప్పుడు స్వభావముచే ధీరుఁడైనను

రామభద్రున కిట్టి యవస్థయందు శోకాతిశయమున నుద్భవించిన క్షోభ మువలనఁ బ్రతిపదంబును విచారకరములైన మహాప్రమాదములు సంభ వించు నని యూహింప నలసియున్నది. కావున నో భగవతీ! గోదావ రి! పూజ్యురాల వగు నీవు సావధానముగ నుండవలయును.

తే. గీ. శిశిరసురభిళబహుళవీ ♦ చీసమీర
పోతముల నల్లనల్లన ♦ పొలయఁ జేసి
దుఃఖభరమున రామభ ♦ ద్రుండు మూర్ఛఁ
జెందునపుడెల్ల నీవు ర ♦ క్షింపు మమ్మ." అని.

తమస—స్నేహ మున్నందుల కిట్టి దాక్షిణ్యముచితమే. కాని రామభ ద్రునకుమాత్రము మొదటినంజీవనోపాయమే సమకూడినది.

ముర—అది యెట్లు?

తమ—అది యంతయు వినుము. లక్ష్మణుఁడు ప్రాచేతసాశ్రమసమీప మున విడిచి వచ్చినపిమ్మట సీతాదేవి ప్రాప్తప్రసవవేదన యై దుఃఖాతిశయమున గంగానదిలో దిగె నని వింటివిగదా? ఆ సమయముననే యచ్చట నామె యిరువుర శిశువులఁ గనెను. అనంతరముఁ బృథివీభాగీరథు లిరువురు నామెను బాతాళము నకుఁ గొనిపోయిరి. పాలు విడచినతరువాత గంగాదేవి తా నా పిల్లల నిరువురను వాల్మీకిమహర్షి కప్పగించెను.

ముర—(ఆశ్చర్యముతో)

గీ. ఇట్టివారికిఁ గల్గిన ♦ యట్టి దైవ
దుర్విపాకమునైత మ ♦ ద్భుతమ యగునః
నాకధుని, భూతధాత్రి, వా ♦ ల్మీకి, దొరయు
నవఘు లెద్దానఁ దోడ్పడి ♦ యరయువారొ.

తమ—ఇప్పుడు భగవతియగు భాగీరథి శంబూకవృత్తాంతముచే రామభద్రుఁడు జనస్థానమున కరుగుదెంచినవాఁడని సరయూముఖంబున విని స్నేహాతిశయంబున లోపాముద్ర యెట్లు సంశయించెనో యట్లే తానును సంశయించి యేదియో గృహకృత్యము నెపము వెట్టి సీతాసమేతయై గోదావరికడకు వచ్చినది.

మురల—భగవతి యగు భాగీరథి బాగుగ నేయాలోచించినది. « రాజ్యపరిపాలనము సేయుచుఁ బ్రజాభ్యుదయకరంబు లగు నా యా కార్యములం దగిలి యుండు రామభద్రునకుఁ జిత్తవైకల్యము గలుగదుగాని యిప్పుడు వ్యాపారాంతరము లేక శోకమాత్రద్వితీయుండై యున్న యితనికిఁ బంచవటీప్రవేశము గొప్పయనర్థము ” అని కాని; సీతచే రామభద్రుఁ డెట్లు సమాశ్వాసింపఁబడువాఁడో ?

తమ—భగవతి భాగీరథి « వత్సా ! దేవయజనసంభవ ! ఇప్పు డాయుష్మంతు లగు కుశలవుల పండ్రెండవది యగు జన్మవత్సరసంఖ్యామంగళగ్రంథిమహోత్సవము వచ్చినది. కావున నీకుఁ బురాణశ్వశురుండును మనువంశకర్తయు నగు సూర్యభగవానుని, స్వహస్తాపచితంబు లగు పూవులఁ బూజింపుము. పుడమిపై సంచరించు నిన్ను మత్ప్రభావంబున వనదేవత లైనఁ గనుంగొన నేరరు. మానవులమాటఁ జెప్ప నేల ? ” అని సీతాదేవి నాజ్ఞాపించెను. నేనును « తమసా ! నీయందు సీత కనురాగము మెండు. కాన నీవే యామెకు సహచారిణివి గమ్ము.” అని యాజ్ఞ పట్టనైతిని. నే నిపు డా నియోగము నాచరింతును.

మురల—ఈవృత్తాంతమును నేనును భగవతి యగు లోపాముద్రకు నివే

దింపఁ బోయెదను. రామభద్రుఁడును వచ్చినవాఁడేయని యూహింతును.

తమ—ఇదిగో! గోదావరీహ్రదమునుండి బయలుదేఱి:—

గీ. చెదరుఁగొప్పును, దెల్లనై ♦ చిక్కియున్న
చెక్కులుం, గల మోము రం ♦ జిల్ల, సీత
తనువుఁ దాల్చిన విరహార్తి ♦ యనఁగఁ గరుణ
మూర్తియో యనఁగా, వన ♦ మ్మునకు నెడలె.

ముర—అమె యిదిగో!

గీ. బంధనాలూనమృదుపల్ల ♦ వంబు కరణి
మిసిమి దఱఁగిన యీమె నె ♦ మ్మేను హృదయ
కమలశోషకదీర్ఘశో ♦ కమ్ము వేచఁ
గైతకదళమ్ము శారద ♦ ఘర్మమట్లు.

(అని నిష్క్రమించిరి.)

ఇది విష్కంభము.

(తెరలో.)

అయ్యో! అయ్యో!!

(పిమ్మటఁ బుష్పాపచయవ్యగ్రయగు సీతకరుణాత్సుక్యములతో
వినుచుఁ బ్రవేశించును.)

సీత—ఓహో! ప్రియసఖి యగు వాసంతి మాటాడుచున్నది.

(మఱలఁ దెరలో)

గీ. అందుగుచిగుళ్ళఁ గరమున • నంది యిచ్చి
మున్ను జానకి పెంచిన • చిన్నియేన్గు

సీత—దాని కేమి?

(మఱలఁ దెరలో)

ఉవిదతో నోలలాడుచు • నుండ నొండు
మదపుటేనుంగు దానిని • మాఱుకొనియె.

సీత— (తొట్రుపాటుతోఁ గొన్ని యడుగులు నడిచి) ఆర్యపుత్త్రా! నా బిడ్డను రక్షింపుము! రక్షింపుము! (చింతించి) కట కటా! పంచవటీదర్శనమునఁ, జిరపరిచితము లగు నా యక్షరములే మందభాగ్య నగు నన్ననుసరించు చున్నవి. హా! ఆర్యపుత్త్ర! (అని మూర్ఛిల్లును)

(ప్రవేశించి)

తమ—ఊఱడిల్లు మూఱడిల్లుము!

(తెరలో)

విమానరాజమా! ఇచ్చటనే నిలువుము!

సీత—(భయోల్లాసములతో) ఆహా! వర్షాకాలమేఘధ్వనివలె గంభీరం బై యెచ్చటిదియో మాటల చప్పుడు చెవుల సోఁకి మందభాగ్యనగు నాకును దోడుతో వేడుకఁ బుట్టించు చున్నది.

తమ—(కనుల నీరు పెట్టుకొని, చిఱునగవుతో) వత్సా!

గీ. ఎచటఁ గల్గినదో నిర్ణ • యింప రాని
యస్ఫుటనినాదమును విని • నంత నిట్టి

దాన వయ్యుఁ బయోధర ♦ ధ్వని మయూరి
యట్లు చకితోత్సుకత్వము ♦ నందె దేల!

సీత—భగవతీ! స్ఫుటముగా త్తే దనియెద వేమి? స్వరమును బట్టి గ్రహించితిని. నిజముగా నీ మాట లార్యపుత్త్రునివే.

తమ—ఔఁ గాక! తపముసేయుచున్న శూద్రుని శిక్షింప నిక్ష్వాకు వంశ్యుఁ డగు రాజు దండకారణ్యము నకు వచ్చె ననివిందును.

సీత—మేలు! ఆ రాజు ధర్మమును వెలితి లే కుండఁ గాపాడుచు న్నాఁడు.

(తెరలో)

గీ. ఎచటిమృగములు, చెట్లు నా ♦ కిష్టబంధు
లెందుఁ దడవు వసించితి ♦ నింతిఁ గూడి,
యివ్వియే యవి, పలుసెల ♦ యేళ్ళ గుహలఁ
బరఁగు గోదావరీప్రాంత ♦ గిరితటములు.

సీత—అక్కటా! ప్రాతఃకాలచంద్రమండలమువలెఁ దెల్లవడి, చిక్కి, దుర్బలం బైన యాకారముతో నున్న యార్యపుత్త్రుఁడు నిజ సౌమ్యగంభీరానుభావమాత్రమున గుఱుతుపట్టఁ దగిన వాఁ డయ్యెను. భగవతీ! తమసా! నన్నుఁ బట్టుకొనుము. (అని తమసను గౌఁగిలించుకొని మూర్ఛిల్లును)

తమ—వత్సా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

(తెరలో)

ఈ పంచవటీదర్శనమున:—

గీ. ఇంతదనుక మనమ్మున ♦ నెటులో యిమిడి
యుండు దుఃఖాగ్ని యిప్పుడు ♦ మండఁబోవఁ

దోలుదోలుత నావరించిన ♦ ధూమ మనఁగ
ముందుగా నన్ను మోహమ్ము ♦ ముట్టడించు.

హా! ప్రియా! జానకి!

తమ—(తనలో) గురుజనము శంకించిన విషయ మిదియే.

సీత—(మూర్ఛ దేఱి) అయ్యో! ఇది యెట్లు?

(మఱలఁ దెరలో)

హా! దేవి! దండకారణ్యవాసప్రియసఖి! విదేహరాజపుత్త్రి!

(అని మూర్ఛిల్లును)

సీత—హా! హా! మందభాగ్య నగు నన్నుఁ బేర్కొనుచు నార్యపుత్త్రుఁడు నయనకువలయముల మూసికొని సొమ్మసిల్లెను. అయ్యో! నిశ్శ్వాసము లాడక భూతలమునం బడి వ్యత్యాసముగా నున్నాఁడు. భగవతీ! తమసా! రక్షింపుము! రక్షింపుము! ఆర్యపుత్త్రుని బ్రదికింపుము! అని పాదములపైఁ బడును.

తమ—

గీ. ముజ్జగమ్ముల నేలు నీ ♦ ముద్దుమగని
ప్రాణముల నిల్పు మమ్మ! క ♦ ల్యాణి! నీవ;
హృదయతాపముఁ దీర్చి స ♦ మ్మదముఁ గూర్చు
నీ కరస్పర్శ మా రాము ♦ నికిఁ బ్రియంబు.

సీత—ఏమైన నగుఁ గాక! భగవతి యగు తమస చెప్పినట్లు చేసెదను. (అని తొందరపాటుతో నిష్క్రమించెను)

(తరువాతఁ గన్నుల నీరు విడుచు సీత స్పృశింప నాహ్లాదముతో నిట్టూర్చుచు భూమిపైఁ బడి యున్న రాముఁడు ప్రవేశించును)

సీత—(కొంచెము సంతోషముతో) ముజ్జగమునకు మఱలఁ బ్రాణము వచ్చిన ట్లూహించెదను.

రాము— ఆహా! ఇది యేమిటి?

గీ. చందనాశ్చ్యోతమో? పీడి ♦ తేందుకిరణ
కందళాసేకమో? యిది, ♦ కాక, యుడికి
యున్న ప్రాణమ్ము నెడియు ♦ నుల్లసిల్ల
సంతరించిన జీవనౌ ♦ షధిరసంబొ?

మఱియు:

గీ. చిత్తపరితోషణమ్ము సం ♦ జీవనమ్ము
స్పర్శ మిది నిక్కముగఁ బూర్వ ♦ పరిచితంబె
మొదల సంతాపజం బగు ♦ మూర్ఛఁ దేర్చి
మఱల నానందనమునఁ బ్ర ♦ మ్మసిలఁ జేయు.

సీత—(భయకరుణములతో నవలకుఁ దొలఁగి) ఇప్పుడు నా కింతమా
త్రమే చాలును.

రాము—(కూరుచుండి) వత్సల యగు దేవిచే నేననుగ్రహింపఁ బడ
లేదుగదా?

సీత—అమ్మో! ఆర్యపుత్త్రుఁడు నన్ను గుఱ్ఱించిన ట్లున్నాఁడు.

రాము—కానిమ్ము! చూచెదను.

సీత—భగవతీ! తమసా! మన మావలకుఁ బోవుదము రమ్ము! ఆ
ర్యపుత్త్రుఁడు నన్నుఁ జూచి, యానతి లేకుండ సమీపించినం
దులకు మిపులఁ గోపించును.

తమ—వత్సా! భాగీరథీప్రసాదమున నీవు వనదేవతలకు సైతము గ
నఁబడవు.

సీత—ఔను ఇది గలదు.

సీత—(భయగద్గదములతో) ఆర్యపుత్త్రా! కడచిన వృత్తాంతమున కిది తగినది కాదుగదా? (కన్నీటితో) భగవతీ! జన్మాంతరములందును మఱల లభించు ననుకొనని దర్శనముగల యార్యపుత్త్రుఁడు మందభాగ్య నగు నన్నుద్దేశించి యిట్లు పలుకుచుండ, వజ్రకఠినహృదయనై యాతని యెడ నేమని నిర్దయత్వము వహింతును? నేనే యాతని హృదయము నెఱుఁగుదును. నా హృదయము నీతఁ డెఱుఁగును.

రాము—(కలయఁజూచి, విచారముతో) హా! ఇచట నేదియు లేదు.

సీత—భగవతీ! నిష్కారణముగాఁ బరిత్యజించినవాఁడైన నితని నీ విధముగాఁ జూచుటచే నా హృదయావస్థ యెట్లోయున్నది.

తమ—ఎఱుఁగుదును. వత్సా! ఎఱుఁగుదును.

మ. తలఁపన్ గొంకొకయూరకగల్గమిఁ దట • స్థం; బకప్రియపాత్రప్రైపై
గలుషం; బీ చిరవిప్రయోగమున ద్రా • క్సంగంబుచే స్తంభిత
మ్ము; లసద్వృత్తిఁ బ్రసన్న; మాత్మవిభవ • వ్యామోహమ్మునన్ దుఃఖితం
బలఘుప్రేమద్రుతమ్మున య్యెభవదీ • యస్వాంత మొక్కింతలోన్.

రాము—దేవి!

గీ. తనువు గొనిన భవత్ప్రసా • దమ్ము సంగఁ
బరఁగు స్నేహార్ద్రశీతల • స్పర్శ మిప్డు
చిక్కిని నన్ను నానందప • ట్టైసు; మనోభి
రామ! నీవు కనంబడ • రా వదేమొ?

సీత—ఇవి యగాధమానస దర్శితస్నేహ సంభారములు, నానంద నిష్యందములు, నమృతమయములు, నగు నార్యపుత్త్రుని శోకాలాపములు. వీనియందు విశ్వాసముచే నిష్కారణపరిత్యాగ శల్యితమైనను నాజన్మలాభము బహుమతముగ నున్నది.

రాము—ఇంకను బ్రియురా లెక్కడ? నిజముగా నిది యనవరతసంక ల్పముచే రామభద్రునకుఁ గలిగిన భ్రాంతి.

(తెరలో)

ఔరా! ఎంతప్రమాద మెంతపరిమాదము?

గీ. అంకుగుచిగుళ్ళఁగరమున (అనిపూర్వార్థము చదువఁబడును)

రాము—(కరుణౌత్సుక్యములతో) దాని కేమి?

(మరలఁ దెరలో)

గీ. ఉవిదతో నోలలాడుచునుండ (అని యుత్తరార్థము ప ఠింపఁబడును)

సీత—అక్కటా! దాని నిప్పు డెవరొక్కనువా రెవరు?

రాము— నాప్రియురాలిపుత్త్రుని దిరస్కరించుచున్న యీ దుష్టబుద్ధి యెక్కడ? (అని లేచుచున్నాఁడు)

(ప్రవేశించి)

వాసంతిక—(తొట్రుపాటుతో) దేవా! త్వరపడుము త్వరపడుము.

సీత—ఆహా! నాప్రియసఖి యగు వాసంతియా?

రాము—ఏమి? దేవికిఁబ్రియసఖియగు వాసంతియా?

వాసం—దేవా! త్వరపడుము, త్వరపడుము. ఇట్లు జటాయుశిఖరమున కు దక్షిణముగా నున్న సీతాతీర్థమునుండి గోదావరిసద నవత రించి దేవిప్రియపుత్త్రుని సంభావించెదవుగాక!

సీత—అక్కటా! తండ్రీ! జటాయు! నీవు లేక యీజనస్థానము పా డుపడియున్నది.

రాము—కటకటా! ఈపూర్వకథాప్రసంగములుహృదయమర్మములను ఛేదించునవిగదా!

వాసం—దేవా! ఇటు రమ్ము ఇటురమ్ము.

తే—భగవతీ! నిజమే; వనదేవతగూడ నన్ను గనుంగొనసేర కున్నది.

తమ—వత్సా! దేవత లందఱికంటె మందాకినిప్రభావము ప్రకృష్టతమము. నీకు సందేహ మేల?

సీత—అట్లయిన ననుసరించి పోవుదము రమ్ము. (అని పరిక్రమింతురు)

రాము—భగవతీ! గోదావరి! నీకు నమస్కారము.

వాసం—(నిరూపించి) దేవా! విజయుఁడు వధూద్వితీయుఁడు నగు దేవిపుత్త్రికుని జూచి సంతసింపుము.

రాము—ఆయుష్మంతునకు జయమగుఁగాక!

సీత—ఆహా! నాకొడు కింతటివాఁ డయ్యెనా?

రాము—హా! దేవి! వర్ధిల్లుచున్నదానవు.

గీ. బిసకిసలయమ్ముఁ బోని ప • ల్మొసిమి యొసఁగ
మున్ను నీ కర్ణపల్లవ • మ్మును హరించు
కొడుకుఁగుఱ్ఱ కడిందియే • న్గుల జయించి
ప్రియమున కర్హమైన సం • పదలఁ బొదలె.

సీ—ఈ దీర్ఘాయువు సౌమ్యదర్శన యగు తనప్రియురాలితో నీక వియోగము నొంద కుండుఁ గాక.

రాము—సఖీ! వాసంతి! చూడు చూడు. ఈ బిడ్డ కాంతానువర్తనమునందు సైతము చాతుర్యము గడించెను.

మ. చెలి కుత్థాతమృణాలకాండకబళ • చ్ఛేదంబులుం బద్మగం
ధిలనీరమ్ములపుక్కిలింతలును బ్రీ • తిం బెట్టుఁ దుండంబునన్
జలసేకంబొనరించు నాపిదప నా • చ్ఛాదించు నెయ్యంబెదన్
బలియంగానననాళనాళినలినీ • పత్రాతపత్రంబునన్.

సీ—భగవతీ! తమసా! ఇది యిట్టి దైనది. ఆ కుశలవు లిప్పటి కెట్టివారైరో యెఱుఁగనుగదా?

తమ—ఇది యెట్టిదో వారు నట్టివారే యగుదురు.

సీ—నే నెట్టి యదృష్టహీనురాలను! ఆర్యపుత్త్రవిరహమే గాక పుత్త్రవిరహమును సంభవించెను.

తమ—దైవసంకల్ప మిట్లున్నది.

సీ—కొంచెము వెడబడిన మల్లెమొగ్గలఁ బోలు పలువరుసయు మొలకెత్తు నలంతి నగవును గలిగి కలకలలాడు నా కొడుకుల ముఖపద్మము లార్యపుత్త్రునకు ముద్దాడఁ దాయెను. నేను బిడ్డలఁ గన్న ఫలమేమి?

తమ—దేవతానుగ్రహమున నట్లగుఁగాక.

సీ—భగవతీ! తమసా! బిడ్డలు పిలఁపునకు వచ్చుటఁ జన్నులు చేఁప నిప్పుడు క్షణమాత్రము పిల్లలతండ్రి సన్నిధానమున సంసారిణి నైతిని.

తమ—ఇంతియఁ జెప్పవలసిన దేమున్నది? సంతానము స్నేహమునకుఁ బరమావధిగదా? మఱియు నది తల్లిదండ్రుల కన్యోన్య సంశ్లేషము జేయునదియును.

గీ. దంపతుల యంతరంగత ♦ త్త్వములయందు
బలసి యుండిన యనురాగ ♦ బంధములకు
స్నేహరసనంశ్రయంబునఁ ♦ జేసి కలుగు
ప్రేమపదమయి మగు గ్రంథి య ♦ పత్యమండ్రు.

వాసం—దేవర యీ వంకకును దిలకించుఁ గాక.

గీ. అచిరనిర్గతముగ్ధబ ♦ ర్హమునఁ దనరు
సమయమున సీత పెంచిన ♦ నెమిలి యిప్పు
డురుమణికిరీట మో యన ♦ నుచ్ఛిఖ మయి
వెలఁదితోఁ నీపమునఁ గూర్చి ♦ వెట్టు చుండె.

సీ—(కౌతుకస్నేహాద్రములతో) ఇదియే యది.

రా—బిడ్డా! సంతసింపుము. మే మిప్పుడు వర్ధిల్లు చున్నారము.

సీ—ఇట్లగుఁ గాక!

రా— గీ. భ్రామలు నటియింపఁ జక్రచం ♦ క్రమణగతులఁ
దృష్టి మెలపుచు ముద్దు ని ♦ దేహతనయ
తాళమానంబుఁ దెలుప న్రు ♦ త్యంబు సలుపు
నిను దనయువమాక్షి వాత్సల్య ♦ మునఁ దలంతు.

ఔరా! తిర్యగ్జంతువులును బరిచయము మఱవవు.

గీ. దయిత పెంచినయది యీ క ♦ దంబశాఖ
కొలఁదిపూవులు నిప్పుడు ♦ కొమరుమిగులు.

సీ—(కన్నీటితో) ఆర్యపుత్త్రుఁడు బాగుగా నానవాలుపట్టెను.

రా— గీ. స్వజనమునఁ బలె నిట సంత ♦ సంబు గనుట
గిరిమయూరము దేవిని ♦ మఱవలేదు.

వాసం—దేవర యిందుఁ గూరుచుండుఁ గాక! ఇది దేవర యాశ్రమ
స్థానము.

(రాముఁడు కూర్చుండును.)

వా— గీ. అలమికొను లేయనఁటితోట ♦ యందునీవు
లలనతోఁ శయనించు శి ♦ లాతల మిదె

యుండుఁ గూర్చుండి జానకి ♦ తృణము నిడుట
లేఁడిపిల్లలు దీనిని ♦ వీడ వెపుడు.

రా—ఇది చూడఁ జాలను (అని కన్నీరు విడుచుచును వేరొకచోటఁ గూర్చుచుండును.)

సీ—సఖీ! వాసంతీ! ఆర్యపుత్త్రునకు నాకును దీనిం జూపి యేమి పని చేసితివి? అయ్యో! అయ్యో! అతఁడే యార్యపుత్త్రుఁడు. అదియే పంచవటి. ఆమెయే ప్రియసఖి యగు వాసంతి. అవియే వివిధవిస్రంభసాక్షులయిన గోదావరీకాననప్రదేశములు. అవియేపుత్త్రనిర్విశేషము లగు మృగములు పక్షులు పాదపములును. అదృష్టహీనురాల నగు నాకు మాత్ర మివి యన్నియుఁ గానవచ్చుచున్నను లేనివియే. జీవలోకమున కిట్టిమార్పు గలిగినది.

వా—సఖీ! సీతా! రామభద్రునియవస్థఁ జూడ వేమి?

చ. కలువలఁ బోలు నంగములు ♦ కన్నులపంటవు సేయు మాకు ని
చ్చలుఁ గనవచ్చుఁ గ్రొత్తయయి ♦ సంతసముం బొనరించు వాఁడు దు
ర్బలుఁడు విషాదమంథరుఁడు ♦ పాండుశరీరుఁడు నౌట నెట్టులో
తెలియఁగవచ్చునట్లయిన ♦ దుష్టులకుం బ్రియముం ఘటించెదుర్.

సీ—సఖీ! చూచుచునే యున్నాను.

తమ—వత్సా! నెచ్చెలిం బ్రియుని జూడుము.

సీ—హా! దైవమా! ఈతఁడు నన్నును నేనితనిని విడిచియుండి నట్లెంచితిఁవి? కావున జన్మాంతరమందును దుర్లభదర్శనుం డగు ప్రాణవల్లభు నించుకసేపైనను బాష్పసలిలవ్యవధానములేకుండఁ గనుఁగొనియెదను. (అనిచూచుచున్నది.)

తమ—(కౌఁగిలించుకొని కన్నీటితో)

క. ఆనందశోక జనితము
లౌ నశ్రులు వెల్లి ఁబొడుచు ♦ ననురాగార్ద్రో
త్తానమధుర నీ చూపిది
ప్రస్నేహం దుద్ధకుల్య ♦ బలె నలరించున్.

ఉ. పూవులపండ్ల తేనియలఁ ♦ బూజ లొనర్చుతఁ జెట్లు; చల్లఁగా
వీవుతఁ బద్మకోశముల ♦ విప్పు వనానిలముల్; మనోహరా
రావముగా విహంగములు ♦ రక్తగళంబులు గూయుఁ గావుతన్
దేవుఁడు రామభద్రుఁడరు ♦ దెంచెను గానకుఁ దాన వెండియున్.

రా—సఖీ! వాసంతీ! రమ్ము. ఇందుఁ గూరుచుండుము.

వా—(కూర్చుండి కన్నీటితో) మహారాజా! లక్ష్మణకుమారునకుఁ గుశలమా?

రా—(విననియట్లు నటించి)

గీ. గఱికపరకలు నీళ్ళు ని ♦ వ్వరిలు నొసఁగి
సీత పెంచిన మృగముల ♦ క్రీడిశుకముల
ఖగములం జూడ నెదియో వి ♦ కార మొక్కఁ
డొదవి గుండియ నీరయి ♦ యూరుచుండె.

వా—మహారాజా! లక్ష్మణకుమారుని కుశల మడిగితినయ్యా!

రా—(తనలో) ఓహో! "మహారాజా" యని ప్రేమలేని పిలుపు. సౌమిత్రియెడల మాత్రము బాష్పస్ఖలితాక్షరముగాఁ గుశల ప్రశ్నము. కావున నీమె సీతావృత్తాంతము వినెనని తలంచెదను. (ప్రకాశముగా) ఆ. కుమారుఁడు లక్ష్మణునకుఁ గుశలమే.

వా—(కన్నీరు విడుచుచు) ఓ దేవా! ఇఁక నేమనను? నిర్దయుఁడ వైతివి.

సీ—సఖీ! వాసంతి! నీ వేల యిట్లు నోరు చేసికొనియెదవు? ఆర్యపుత్త్రుఁ డెల్లరకుఁ బూజార్హుఁడు. అంతకంటెను నా ప్రియసఖికి.—

వా— గీ. నీవె నా జీవితంబవు ♦ నీవె నా ద్వి
తీయహృదయంబు నయనచం ♦ ద్రికవు నీవె
యంగసుధ నీవ యని యిన్ని ♦ యన్ని ప్రియము
లాడి యా ముగ్ధనే—చాలు ♦ నట నిఁ కేల?

(అని సొమ్మసిల్లును)

తమ—బాగు. వాక్యసమాప్తిఁ జేయనియు మూర్ఛయుఁ దగి యున్నవి.

రా—సఖీ! ఊఱడు మూఱడుము.

వా—(ఊఱడిల్లి) దేవా! యీ యకార్య మేల చేసితివి?

సీ—సఖీ! ఊరకుండు మూరకుండుము.

రా—లోకము సైఁపదని.

వా—ఏమికతమున.—

రా—ఎదియో దానికే తెలియును.

తమ—చిరకాలమునకు లోకోపాలంభము,

వా— గీ. నిర్దయా! కీర్తియే కదా ♦ నీ కభీష్ట
మింత కెక్కు డపఖ్యాతి ♦ యేది యుండు?
నేణలోచన కడలియం ♦ దేమి యయ్యె?
నకట! యే మని తలఁచితి ♦ వయ్య! చెపుము.

సీ—సఖీ! వాసంతి! నిర్దయురాలవునీవే. ఇట్లు పలపించువాని నూరక వాగించు చుంటివి.

తమ—స్నేహము శోకము నిట్లనిపించు చున్నవి.

రా—ఇందుఁ జింతింపవలసిన దేమున్నది?

గీ. చకితబాలకురంగాక్షి ♦ జనకజాత
గర్భమదమట నెందును ♦ గదలలేమిఁ
గ్రూరమృగములు చంద్రికాం ♦ కూరమృదుళ
నంగలతికను దప్పక ♦ మ్రింగివైచె.

సీ—ఆర్యపుత్రా! ఇదిగోఁ బ్రాణములతో నున్నాను.

రా—హా! ప్రియా! జానకీ! యెందుంటివి?

సీ—అయ్యో! అయ్యో! ప్రాకృతునివలె నార్యపుత్త్రుఁడు నెలుఁగెత్తి యేడ్చుచున్నాఁడు.

తమ—వత్సా! ఇది యుచితమైనదియే. దుఃఖితులు దుఃఖపరిహార మొనరించుకొనవలయుఁగదా?

గీ. చెఱువు నిండి పయింబడి ♦ పొరలునప్పుడు
కలుఁజు వెడలిన వెల్లువ ♦ మలఁగుకరణిఁ
బట్టరానివిచారము ♦ నెట్టుకొనిన
గట్టిగా నొక్క మాఱేడ్వఁ ♦ గాని పోదు.

విశేషించి రామభద్రునిజీవితము బహువిధకష్టములుగలది.

మ. మనుమార్గంబున నీజగం బఖిలముం ♦ బాలింప నౌ: జీవమున్
వనితాశోకముపూవు ఘర్మమువలెన్, ♦ వాడంగఁజేయుందనం
తన కాంత న్విడియుంట రోదనవినో♦దంబుఁ మరాపంబు; గా
వున నేఁడేనియునూర్పులంగొలుపునే ♦ ద్పుంగొంతలాభంబెకా?

రా—కష్ట! మోహాహో! కష్టము!

ఉ. ఆయతమైన చింత హృక • యమ్ముగను వ్రీలుచు రెండుసేయు; దీ
కాయము మోహభారమును • గాంచు; ప్రమతమ్ముగఁ జేతనత్వముం
బాయును; చిత్తతాప మతి • మాత్రము మై నుడికించు; బూదిగాఁ
జేయును; ధాతమర్మములఁ • జింపు; హరింపఁడు జీవితమ్ములన్.

ఓ! భగవానులారా! పౌరజానపదులారా!

చ. అనభిమతంబు దేలి గృహ • మందు వసించుటయన్న మీకుఁ; గా
వునఁ బెనుగానలోఁ దృణము • పోలిక వీడితి; వెన్కఁ జింతసే
యను; జిరకాలసేవితము • లయ్యెయిభావము లిప్పు డెంతయున్
మనసుఁ గరంప నేడ్చెదము • మమ్మరికింపుల మీరుసైఁపుఁడీ.

వా—(తనలో) (క్రోధోద్రేక మతిని గూఢము (ప్రకాశముగ) దేవా!
కడచినదానికి నగవ నేల? ధైర్యము నవలంబింపుము.

రా—“ధైర్య” మనెద వేమి?

గీ. భూతలాక్షశ్వరిని గోలు • పోయినట్టి
జగమునకుఁ బది రెండవ • వత్సరము లయ్యె
నతివపేరును మాసిన • యట్లు తోఁచుఁ
బోవ దింకను రాముని • జీవనంబు.

సీ—మోహితవలె నార్యపుత్త్రుని యీ ప్రియవచనములచేఁ బరవశ
నగు చున్నాను.

తమ—వత్సా! ఔను.

గీ. శోకదారుణములు స్నేహ • సుందరములు
నైన యీ పల్కు లంత హృ • ద్యములు గావు
ప్రబలవిషగర్భములు మక • రందధార
లగుచునియ్యవి యెల్ల నీ • యందుఁ దోఁచు.

రా—ఓ వాసంతీ!

గీ. అడ్డముగ గుచ్చి వ్రేసిన ♦ యట్టి కొఱవి
యమ్ముకైవడి ; సవిషదం ♦ తమ్ము కరణి
మదిఁ గలఁచు శోకశంకువు ♦ మర్మములను
జింపుచున్నను నేను సై ♦ రింపలేదె ?

సీ—ఇట్లు మందభాగ్య నగు నేను మఱిమఱి యార్యపుత్త్రున కాయా
సము గలిగించుచుంటిని.

రా—ఈ రీతి సతిగూఢముగ నంతఃకరణమును బ్రమానుపఱిచిన వాఁడ
నైనను నా కిపుడు పరిచితవస్తుదర్శనమువలన నీ చిత్తవికారము.

మ. అతివేలమ్ముగఁ బొంగి పొర్లు కరుణం ♦ బాఁగంగ నే నెట్టులో
జతనంబుం బొనరింప ; నయ్యది సమ ♦ స్తం బూరకే పోవ, నై
కతబంధంబు మహారయం బగు జలౌ ♦ ఘం బట్లు కూలార్చుచు
ద్గతమై చిత్తవికారమెయ్యదొ బలా ♦ త్కారంబునైఁ ద్రోఁచెడున్.

సీ—దుర్వారదారుణారంభ మగు నార్యపుత్త్రుని దుఃఖసంక్షోభమున
నిజదుఃఖము మఱచి నాహృదయము వీలుచున్నది.

వా—(తనలో) అక్కటా ! దేవర యత్యాసక్తుఁడయ్యెను, గావున
మఱియొక ప్రసంగమునకు మఱలించెదను (ప్రకాశముగ) దే
వా ! చిరపరిచితము లగు నీ జనస్థానప్రదేశముల నవలోకించి
మన్నింపుము.

రా—ఇట్లగుఁగాక ! (అని లేచి పరిక్రమించును)

సీ—ప్రియసఖ యొనరించిన వినోదనోపాయము దుఃఖోద్దీపక మనియే
తలంచెదను.

వా—దేవా! దేవా!

మ. చెలి యేతెంచెడునట్టి మార్గమున దృ♦ ష్టి న్నిల్పి నీ వీలతా
నిలయంబందున నుంటివి, వారి యపు డెం♦ తేఁబ్రొద్దు గోదావరీ
పులినక్షోణిని హంసలం గని ముదం♦బుం జెంది యేతెంచు చీ
వలుకం గాంచినయట్టులైన మొగిచే♦హస్తాబ్జముల్ భీతమై.

సీ—వాసంతీ! ఎంత కఠినురాలవు? హృదయమర్మమున నాటుకొనిన శల్యముల మెఱమెఱు నీ వృత్తాంతములచే మందభాగ్య నగు నన్ను మఱల నార్యపుత్త్రుని తలఁపునకుఁ దెచ్చుచుంటివి.

రా—ఓ చండీ! జానకీ! ఇట నటఁ గాన వచ్చుచుంటివి. నన్ను గరుణింపవు.

శా. దేవి! నా హృదయంబు బిట్టువిచెడుఁ♦ దేహంబు సంశీర్ణమై
పోవున్, శూన్యముగాఁ దలంచెద జగ♦మ్మున్, లోఁగడున్ బ్రజ్వలన్
బ్రోవంగా నక యంధకారమునయం♦దుఁ మున్నునాత్మంబు,మో
హావేశంబగు; నేమి సేయుదును గ♦ష్టా! మందభాగ్యుండనై.

(అని మూర్ఛిల్లును)

సీ—అయ్యో! అయ్యో! మఱల నార్యపుత్త్రుఁడు మూర్ఛ నొందినాఁడు

వా—దేవా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

సీ—ఆర్యపుత్త్రా! మందభాగ్యనగు నన్నుద్దేశించి సకలలోకమాంగళికావతారుండ వగు నీవు సారెసారెకు జీవితసంశయదారుణంబగు దుర్దశ నొందుచుంటివి. అయ్యో! నే నిఁక బ్రదుకలేను

(అని మూర్ఛిల్లును)

తమ—వత్సా! ఊఱడిల్లు మూఱడిల్లుము. మఱల నీ పాణిస్పర్శవే రామభద్రునకు జీవనోపాయము.

వా—ఏమి? యింకను నిట్టూర్పు వుచ్చుకున్నాఁడు. అయ్యో! ప్రియ సఖీ! సీతా! ఎక్కడ నున్నావు? జీవితేశ్వరుని సంభావింపుము. (సీతసంభ్రమముతో సమీపించి హృదయమునందు లలాటము నందును దాఁకును)

వా—ఆహా! రామభద్రునకు మఱలఁ జైతన్యము వచ్చినది.

రా—గీ. తనువు వెలపల లోపలి ♦ ధాతువులకు
నమృతమయలేపములు వెట్టి ♦ నట్టు లేదొ
యొకఁడు తాఁకుడు ప్రాణము ♦ లొసఁగి మఱల
హర్షమయమోహమును జేయు ♦ నట్టులుండె.

(ఆనందముతోఁ గనులు విప్పక యే) సఖీ! వాసంతీ! ఆహా! వర్ధిల్లు చున్నావు.

వా—ఏమి?

రా—సఖీ! మ ఱేమున్నది? మఱల జానకి దొరకినది.

వా—దేవా! రామభద్రా! ఆమె యెక్కడ?

రా—(స్పర్శసుఖము నభినయించి) చూడుము. ఇదిగో నెదుటనే.

వా—ఓయీ! రామభద్రా! ప్రియసఖీవిపత్తిదుఃఖదగ్ధనై యున్నను నన్ను మర్మచ్ఛేదదారుణంబు లగు నతిప్రలాపముల మఱిమఱి యేల దహించు చున్నావు?

సీ—తొలఁగిపోవ నిచ్చగించుచుంటిని; కాని దీర్ఘదారుణం బగు సంతాపము నొకింతలో నడంచు చున్న చిరస్నేహసంభారసౌమ్య శీతలం బగు నార్యపుత్త్రస్పర్శమున వజ్రలేపముచే నతుకఁ బడి నట్లు నా యగ్రహస్తము రా కున్నయది.

రా—సఖీ! ప్రలాపములు గావు.

చ. పరిచితచంద్రమశ్శిశిర ♦ పాదము, గంకణభూషితమ్ము, నే
కరము వివాహకాలమునఁ ♦ గైకొనినాఁడనో యేను మున్ను

సీ—ఆర్యపుత్రా! నీ విపు డిప్పటి వాఁడవే.

రా—భా। స్వాగలన ప్రవాళినన్న ♦ రంబు తదన్యకకోపమానసుందర
మగు హస్త మయ్యదియె ♦ నా కిది కోలభియించె నియ్యెడన్.

(అని పట్టుకొనును)

సీ—అయ్యో! అయ్యో! ప్రియస్పర్శమోహితనగు నాకుఁ బ్రమాద
ము సంభవించినది.

రా—సఖీ! వాసంతీ! ప్రియాస్పర్శనాశ్లేషమున నానందపరవశుఁడ న
యితిని. కావున నీవును నీవును బట్టుకొనుము.

వా—అక్కగారూ! ఉన్మాదమే.

సీ—(సంభ్రమముతోఁ జేయి లాగికొని తొలఁగును)

రా—అయ్యో! ప్రమాదము.

గీ. కంపమానమ్ము ఘర్మాంబు ♦ కణయుతమ్ము
జడము నగు జానకీకర ♦ సరసిజమ్ము
కంపమానమ్ము ఘర్మాంబు ♦ కణయుతమ్ము
జడము నగు నాకరమునుండి ♦ జాఱిపోయె.

సీ—అయ్యో! అయ్యో! ఇప్పటికిని బహుళఘూర్ణమానవేదనం బగు
హృదయమును నిలుపఁజాల కున్నాను.

తమ—(స్నేహకౌతుకస్మితములతోఁ జూచి)

గీ. వల్లభస్పర్శసుఖమున ♦ వత్స మొదలు
కంపఘర్మాంబురోమాంచ ♦ కలిత మయ్యె
వాతపరిధూత మై నూత్న ♦ వారిఁదడిసి
కోరగించిన కడిమిలేఁ ♦ గొమ్మవోలె.

సీ—(తనలో) పరవశ నగు నన్నుఁ జూచి భగవతి యగు తమస ,, ఇట్లు పరిత్యజించిన మగనియం దింత యనురాగమా ? " యని తలంచు నేమో యని సిగ్గుపడుచున్న దానను.

రా—(కలయఁ జూచి) అయ్యో! ఏమిది ? లేదే! ఓ నిర్దయురాలా! వైదేహీ!

సీ—ఇట్టి నిన్నుఁ జూచుచుండియు బ్రతికియున్న నేను నిర్దయురాలనే.

రా—ప్రియసీ! ఎందుంటివి ? దేవీ! యనుగ్రహింపు మనుగ్రహింపుము. ఇట్టి నన్ను విడువఁ దగవు.

సీ—ఓయీ! ఆర్యపుత్త్రా! నీ మాట విపరీతమువలె నున్నది.

వా—దేవా! ప్రసన్నుఁడ వగుము. మేరమీఱిన హృదయమునులో కోత్తర మగు నిజధైర్యముచేఁ గుదురుపఱచుకొనుము. నా ప్రియసఖి యెక్కడ నున్నది?

రా—నిజమే. లేదు. ఉన్నచో వాసంతిమైనఁ గనఁ గొనదా ? ఇది స్వప్నమేమో? నేను నిద్రపోలేదే. రామునకు నిద్ర యెట్లు? తప్పక యిది యనేకవారపరికల్పితము ననుల్లంఘనీయము న గు విప్రలంభమే మాటిమాటికి నన్ననుసరించు చున్నది.

సీ—కఠినురాల నగు నేనే యార్యపుత్త్రుని వంచించితిని.

వా—దేవా! చూడు చూడు!

చ. అదిగో! జటాయురుద్ఘటిత • మైనది రావణు నల్లయున్న తే
రెదుటఁ బిశాచవక్త్రము లి • వే ఖరవాహము లస్థిశేషముల్
కదిసి జటాయుపక్షతుల • గండ్రలు నేసి యసిన్ సవిద్యుదం
బుద మనభీత సీతఁ గొని • పోయె నిశాచరుఁ డిట్లు మింటికిన్.

సీ—(భయముతో) ఆర్యపుత్త్రా! తండ్రి వధింపఁబడుచున్నాఁడు. రక్షింపుము. రక్షింపుము. నేను నపహరింపఁబడుచున్నదానను.

రా—(వేగముతో లేచి) ఓరీ! పాపా! తాతప్రాణసీతాపహారీ! లంకాపతీ! యెక్కడకుఁ బోయెదవు?

వా—ఓ దేవా! రాక్షసకులప్రళయధూమకేతూ! ఇంకను నీకుఁగ్రోధవిషయము గలదా?

సీ—ఆహా! భ్రాంతురాల నైతిని.

రా—ఇప్పటికి యీ విపర్యాసము వే జోకలాగున్నది.

చ. పెరపులకల్మి నెల్లరకు ♦ విస్మయముం గలిగించు వీరసం
గరములఁ గాలయాపనము ♦ గా రిపుఘాతముదాఁక జానకీ
విరహము మున్నటోసయిచి ♦ వేగితి, నెట్లుసహింతు నూరకే
నిరవధికంబు దుర్భరము ♦ నేఁటిమహాప్రళయమ్ముగ్రమ్మరిక?

సీ—పూర్వవిరహమున బహూకరింపఁబడితిని. ఇప్పటికి వియోగము నిరవధిక మనుట హతాశనైతిని.

రా—ఓహో! కష్టము.

ఉ. వానరనాథు చెల్మి కపి ♦ వర్యుల వీర్యము జాంబవంతు వి
జ్ఞానము, వాయువందనుప్ర♦చారము, వ్యర్థములౌనెడఁ; నలుఁ
డేనియు సేతుబంధము ఘ ♦ టింపఁగ నేరనిచోట; నూర్మిళా
జాని శరమ్ములుం జొరని ♦ చక్కటిఁ నెక్కడనుంటి? నెచ్చెలీ!

సీ—పూర్వవిరహమును బహూకరించుచున్నాఁడు.

రా—సఖీ! వాసంతీ! మిత్త్రములకు రామదర్శన మిపుడు దుఃఖమునకే. ఎంతతడవు ని న్నేడిపింతును? కావున నాకుఁ బయనమునకనుజ్ఞ నిమ్ము.

సీ.‌ -(ఉద్వేగమోహాములతోఁ దమసను గౌఁగిలించుకొని) అయ్యో! భగవతీ! తమసా! ఆర్యపుత్త్రుఁ డిపుడు వెడలుచున్నాఁడు. ఏమి సేయుదును? (అని మూర్ఛిల్లును.)

తమ—వత్సా! జానకీ! ఊరడిల్లు మూరడిల్లుము. దైవ మనుకూలము కాఁగలదు. కావున నాయుష్మంతులగు కుశలవులకు ద్వాదశవర్ష పూర్తిమంగళముల సంపాదింప భాగీరథీసమీపమునకే పోవుదము.

సీ—భగవతీ! అనుగ్రహింపుము. దుర్లభదర్శనుని క్షణమాత్రమైన్యఁ జూచెదను.

రా—నా కిపు డశ్వమేధమునకై యొక సహధర్మచారిణి గలదు.

సీ—(ఆక్షేపముతో) ఆర్యపుత్త్రా! ఎవతె?

వా—పెండ్లి యాడుటయునా?

రా—లేదు లేదు సువర్ణవికారమగు సీతాప్రతిమ.

సీ—(నిట్టూర్చి కన్నీటితో) నీ విపు డార్యపుత్రుఁడ వైతివి ఇపుడు పరిత్యాగరూపమగు నా హృదయశల్య మార్యపుత్రునిచేఁ బెఱికి వేయఁబడినది.

రా—దానియందేని బాష్పపూరితములగు నా కన్నుల వినోదపెట్టెదను.

సీ—ఆర్యపుత్రునిచే నిట్లు బహుమానింపఁబడుచు నతని నిట్లు వినోదపెట్టుచు జీవలోకమున కాశాబంధన మైన యా ప్రతిమ ధన్య కదా?

తమ—(స్మితస్నేహాస్రములతోఁ గౌఁగిలించుకొని) ఓ వత్సా! నీవు నిన్నిట్లు పొగడుకొను చున్నావు.

సీ—(సిగ్గుతో) భగవతిచేఁ బరిహాసింపఁబడితిని.

వా—ఈ సమాగమము మాకు మహాప్రసాదము. కార్యహాని కాకుండఁ బయనింపుము.

రా—అట్లగుఁగాక !

సీ—నా కిపుడు వాసంతి ప్రతికూలురా లయినది.

తమ—వత్సా ! రమ్ము పోవుదము.

—అటే.

తమ—పోవుట యెట్లు ?

గీ. అధికతృష్ణాన్వితమ్మయి ♦ యధిపునందుఁ
గీలిత మ్మట్టులున్న నీ ♦ వాలుఁజూపు
బాల ! మర్మనికృంతనో ♦ పమములైన
గాఢయత్నమ్ములను ద్రిప్పఁ ♦ గడఁగుచుంటి.

సీ—బహుపుణ్యాదర్శనీయములగు నార్యపుత్త్రపాదపద్మములకు నమస్కారము (అని మూర్ఛిల్లును)

తమ—వత్సా ! ఊరడిల్లుము.

సీ—(ఊరడిల్లి) మేఘమధ్యమునఁ బూర్ణచంద్రదర్శన మెంతకాలము ?

తమ—ఆహా ! సంవిధానకము ?

గీ. కరుణరస మొక్కటియెభిన్న ♦ కారణములఁ
బెక్కురూపలుగాఁ గాని ♦ పించుచుండు
నుదక మొకఁడావర్తబు ♦ ద్బుదతరంగ
మయవికారము లొందియు ♦ మాఱదుగద !

రా—విమానరాజమా ! ఇటు ఇటు.

(అందఱు లేచుచున్నారు.)

తమ—
వా— } (సీతారాములగుఱించి)

గీ. ధారుణియు నాకధునియుభం ♦ దఃప్రరోక్త
యాదిముఁడునగుయుమ్మదీ ♦ యకులపతియు
ముని యరుంధతీధవుఁడుమా ♦ కోంట్లతోడ
మంగళమ్ముల నీకు నొ ♦ సంగుఁగాత !
(అని యందఱునిష్క్రమింతురు)

తృతీయాంకము—సమాప్తము.



శ్రీ

# ఉత్తరరామచరితము.



## చతుర్థాంకము.

(తరువాత నిరువురు తాపసులు ప్రవేశింతురు)

ఒకఁడు—సౌధాతకీ! ఇప్పు డరుదెంచిన యతిథిజనుల సత్కరింపనగు నధికారంభంబుల వాల్మీకిమహాముని యాశ్రమపదంబునకుఁ గలిగిన రామణీయకముఁ జూడుము.

మ. అదె! నేఁడీనిన యాలు వెచ్చనగు నీ♦ వారాన్నమండంబుఁ దీ
పొదవంగ్రోలఁగ శేషమాశ్రమమృగం♦బుత్సాహియై త్రావెదుర్
బొదలంబోయెడు నేతియోగిరపుఁదా ♦ వుల్ కొన్ని వెన్వెంట రా
స్పదరాకల్పితశాకపాకముల గ ♦ ర్ధంబుల్ పిసాళించెదుర్.

సౌధా—అనధ్యయనకారణములగు నీ సరసేన మీనగిష్టములు గల తపోధనులకు స్వాగతము.

మొదటివాఁడు—(నవ్వి) సౌధాతకీ! నీకుఁ బెద్దలయందలి బహుమానమునకుఁ గారణ మపూర్వముసుమీ.

సౌధా—దాండయనా! ఇప్పుడు స్త్రీసమూహమును మొలఁబెట్టుకొని వచ్చిన యీ యతిథి పేరేమి?

దాండాయనుఁడు—ఛీ! పరిహసింపకుము. ఇతఁడు ఋష్యశృంగాశ్రమమునుండి యరుంధతిని బురస్కరించుకొని దశరథమహారా

జు ధర్మపత్నులం దోడ్కొని వచ్చిన వసిష్ఠుడు. నీ విట్లు పేర్కొ లేద వేమి ?

సౌధా—వసిష్ఠుడా ?

దాండా—అవును.

సౌధా—నేనుమాత్రి మితడొక వ్యాఘ్రమనుకొంటిని.

దాండా—ఏమంటివి ?

సౌధా—అతడు వచ్చినతోడనే పాప మా పుల్లావు పెయ్య మడ మడలాడింపబడినది.

దాండా—“ సమాంసో మధుపర్క ” యను నామ్నాయము బహూకరించుచు గృహస్థులభ్యాగతుడగు శ్రోత్రియునకు బెయ్యనుగాని గంపయెద్దుగాని వండుదురు. అది ధర్మముగా సూత్రకారులు చెప్పుచున్నారు.

సౌధా—ఓయీ ! దొరకితివి.

దాండా—ఎట్లు ?

సౌధా—వసిష్ఠమిశ్రులు వచ్చినవెంటనే యరుదెంచిన రాజర్షి యగు జనకునకు వాల్మీకిమహాముని దధిమధువులతోడనే మధుపర్కము నొసరించెను గాని వత్సతరినిమాత్రము పట్టలేదు.

దాండా—మాంసభక్షణమును మానినవారల కీకల్పమును గొండఱు చెప్పుచున్నారు. పూజ్యుడగు జనకుడు మాంసభక్షణమును మానినవాడు.

సౌధా—ఏమి కారణము ?

దాండా—సీతాదేవికిఁ గలిగిన యట్టి దైవదుర్విపాకమును విని వానప్రస్థుఁడై చంద్రద్వీపతపోవనంబునఁ దపంబొనరించుచున్న యాతనికిఁ గొన్ని యేండ్లు గడచినవి.

సౌధా—అక్కడనుండి యెందులకు వచ్చినాఁడు.

దాండా—ఇప్పుడును బ్రియమిత్రుఁడగు ప్రాచేతసుని జూచుటకు.

సౌధా—ఈతని కిపుడు వియ్యపురాండ్ర దర్శనమైనదో లేదో తెలిసినదా?

దాండా—ఇపుడే భగవానుఁడగు వసిష్ఠుఁడు "నీ కితఁడు స్వయముగా వచ్చి ప్రేమముతోఁ జూడఁదగినవాఁ" డని చెప్పుట కరుంధతిని కౌసల్యాదేవికడకుఁ బంపినాఁడు.

సౌధా—ఈ ముదుసలు లందఱు నెట్లు పరస్పరమును గలసికొనిరో యట్లే మనమును వటువులతోఁ గూడి యాడుకొనుచు నీ యనధ్యాయమహోత్సవమును బహుమానింతము. ఆ జనకుఁ డిప్పు డెక్కడనున్నాఁడు.

దాండా—ఈతఁ డట్లు ప్రాచేతసవసిష్ఠుల నుపాసించి యిప్పు డాశ్రమమునకు వెలుపలనున్న చెట్టుక్రిందఁ గూరుచున్నాఁడు. ఇతఁడు—

గీ. హృదయమునయందు నిరతము ♦ గుదురుకొనిన
యట్టి సీతావిపద్దుఃఖ ♦ మతిశయింపఁ
బరితపించుచునుండె నం ♦ తరమునందుఁ
జిచ్చుపెరిఁగిన ముదుసలి ♦ చెట్టు వోలె.

(అని నిష్క్రమింతురు.)

చతుర్థాంకము.

ఇది విష్కంభము.

(తరువాత జనకుఁడు ప్రవేశించును.)

జనకుఁడు—

చ. తనయకుఁ గల్గె నట్టి దురి ♦ తంబు; మనోవ్రణకారి దుర్భరం
బును నగు దాన నుద్భవముఁ ♦ బొందిన దుఃఖము తీక్ష్ణమై చిరం
తనమయిన స్నవీనము వి ♦ ధంబునఁ గానఁగనై మదీయమ
ర్మనిచయముం గరాళము లె ♦ అంగునఁ గోయుచుఁ బాయదయ్యెడున్.

కష్టము. ఇట్లు ముదిమిచేతను, బట్టరాని దుఃఖముచేతను, బరాకసాంతపనపరిభృతులగు తపమ్ములచేతను, శోషితములైన ధాతువులు గల నా పనికిమాలిన శరీర మిప్పటికిని బడదయ్యెను. ఆత్మహత్యఁ జేసికొనినవారి నంధకారబంధురములగు నసూర్యములను లోకములలోఁ బడఁద్రోయుదు రని ఋషులు తలంచుచున్నారు. అనేకసంవత్సరము లతిక్రమించినను బ్రతిక్షణమును దలఁచుకొనుచుండుటఁ జేసి క్రొత్తదివలె దారుణంబగు నీ దుఃఖవేగము నన్ను విడువకున్నది. ఓ తల్లీ! దేవయజనసంభవా! సీతా! నేను సిగ్గుచే బిగ్గరగా నేడ్చుటకును వీలు లేకుండ నిన్నిట్లు దైవము సృజించెను. హా! పుత్రి!

గీ. మొలకలెత్తెడు దంతముల్ ♦ నిలుకడగన
రాని రుదితస్మితమ్ములు ♦ రమణఁ జూపఁ
దొక్కుముద్దాడుపల్కుల ♦ తోఁ జెలంగు
పసితనమునాఁటి నీ ముఖా ♦ బ్జముఁ దలంతు.

భగవతీ! వసుంధరా! నిజముగా నీ వతికఠినురాలవుగానున్నావు.

ఉ. ఈ వసలుం డరుంధతి ము ◆ నీంద్రులు గంగ యెఱుంగువారు త
ద్భావమహాత్వయుక్తి; రఘు ◆ వంశగురుండు సహస్రభానుఁ డీ
దేవుఁ డెఱుంగు; వాగ్గిమణి ◆ తీరునఁ గంటివి విద్యవంటి యా
పావని, నట్టి నీ దుహిత ◆ బన్నము సైఁచెదవేమి? దారుణా!

తెరలో.

భగవతీ! మహాదేవీ! ఇటు ఇటు.

జనకుఁడు—(చూచి) ఓహో! గృష్టి దారిఁజూప భగవతి యగు నరుంధతి వచ్చుచున్నది. (లేచి) "మహాదేవీ!" యనుచున్నాఁ డేమో? (నిరూపించి) హా! మహారాజదశరథుని ధర్మపత్నియు నా ప్రియసఖియు నగు కౌసల్య! ఈమె 'నామెనో' యని యెవరు గుర్తింపఁగలరు?

గీ. దశరథునియింట సిరి యనఁ ◆ దనరు నీకు
సిరియ షో యుపమానముఁ ◆ జెప్ప నేల?
అకట! దైవవిపర్యయం ◆ బట్టి యీమె
దుఃఖమయమగు భూతమై ◆ తోఁచు నిప్డు.

ఇది మఱియొక దశ—

ఆ. గీ. మున్ను నాకుఁ జూడ ◆ ప్రమూర్తిభవించిన
యుత్సవంబుకరణి ◆ నుండు నీమె
క్షతమునందుఁ బడిన ◆ క్షారంబుగతి నట్టి
సాధ్వి దర్శనం బ ◆ సహ్య మయ్యె.

(తరువాత నరుంధతి, కౌసల్య, కంచుకియుఁ బ్రవేశింతురు.)

అరుంధతి—“నీయంత నేగి విదేహరాజు చూడఁదగువాఁడని మీ కులగురుని యానతి, అందులకే యే నంపఁబడితి” నని నేను బలుకుచుండ నడుగడుగునకు నింత సందియపాటేమి?

కంచుకి—దేవీ! “మనమును గుదురుపఱుచుకొమ్ము భగవానుఁడగు వసిష్ఠుని యాదేశము ననుసరింపు” మని విన్నవించుచున్నాను.

కౌసల్య—ఇట్టి సమయమున మిథిలానాథుని జూడవలసెఁగదా? యని యొక్కమాఱుగా దుఃఖములన్నియుఁ బొడసూపుచున్నవి. మూలబంధము దెగిపోవు నా హృదయము నిలుపలేకున్నాను.

అరుం—ఇందు సందియ మేమున్నది?

గీ. బాంధవవియోగదుఃఖముల్ ♦ ప్రజల కాత్మ
నెల్లసమయమ్ములం బ్రవ ♦ హించుచున్న
నాప్తజనులు గనంబడి ♦ నట్టివేళఁ
బొంగి వేవెల్లువల యట్లు ♦ పొరలుచుండు.

కౌస—వన్నెయగు కోడలి కిట్టి పాటు గా నా రాజర్షికి మొగ మెట్లు చూపఁగలము?

గీ. ఇతఁడె జనకకులోద్వహుం ♦ డెపుడు మీకు
వినుతి యొనరింపఁదగినట్టి ♦ సీరకాఁడు
యాజ్ఞవల్క్యమునీంద్రుఁ డీ ♦ యనఘచరితు
సాంతముగఁ జదివించె వే ♦ దాంతవిద్య.

కౌస—మహారాజునకు హృదయానందకరుఁడును వత్సయగు కోడలికిఁ దండ్రియు నగు నారాజర్షి యీతఁడే. అహో! అహో! మహోత్సవము ప్రీపింపని దివసమ్మున సంభావింపఁబడితిని. హా! దైవమా! అది యంతయు లేదు.

జన—(సమీపించి) అమ్మా! అరుంధతి! విదేహరాజగు సీరధ్వజుఁడు నమస్కరించుచున్నాఁడు.

ఉ. తొలుతటి యయ్యవారికిని ♦ దొడ్డగురుండగు నీ విభుండు దా
నలఘుమహానిధానమును♦నయ్యుఁ బవిత్రుఁడ నంచు నెంచు నీ
వలనన; యట్టి సర్వజన ♦ వంద్యచరిత్ర కశేషలోకమం
గళకును నీ కుమస్సునకుఁ♦గైవడి నొదలఁ జాఁగి మొ్రొక్కెదన్.

అరుం—నీకుఁబరబ్రహ్మము సాక్షాత్కరించుఁగాక! సత్వమూర్తియై వెలుగు నీ దేవుఁడు నిన్నుఁ బవిత్రుఁజేయుఁగాత!

జన—అయ్యా! గృష్టీ! ఈరాజమాతకుఁ గుశలమా?

కంచు—(తనలో) అవిశేషముగా నతికఠినముగఁ దిరస్కరింపఁబడితిమి. (ప్రకాశముగ) ఈ క్రోధముననే చిరకాలమునుండి రామభద్రముఖచంద్రదర్శనము మాని యతిదుఃఖతయగు నీ దేవిని దుఃఖపెట్టుట నీకుఁ దగదు. రామభద్రునకు నిది యేదో దైవదుర్నియోగము. ఎల్లెడలను హేయమగు నపవాదమును వెలయించిన పౌరజానపదు లల్పులై యగ్ని పరిశుద్ధిస్థితము నమ్మ రని యట్టి ఘోర మొనరించెను.

జన—ఆ! నా కూతును బరిశుద్ధఁ జేయుట కగ్ని యేపాటిది. కష్టా! ఇటు లాడు జనునిచే రామపరిభూతులమయ్యు మే మింకను బరిభవింపఁబడుచున్నాము.

అరుం—(నిట్టూర్చి) ఇది నిజమే. వత్సను బరిశుద్ధఁ జేయుట కగ్ని యను నక్షరము లతిక్షుద్రములు. సీత యనుటయే చాలును. హా! వత్సా!

మ. శిశువో శిష్యవొ నీవుమాకవుదు పో! ♦ చింతింప; నీ శుద్ధతా
తిశయం బెప్పుడు మాకునీయెడలభ ♦ క్తిం బెంపుఁజెందించెడిః
శిశుతాస్త్రీత్వము లుండనిమ్ము జగతీ ♦ సేవ్యాంఘ్రివౌదీవుత్వా
దృశులందుఙ్గుణముల్ భజింపఁదగుఁగా ♦ కేలా?వయోలింగముల్.

కౌస—అమ్మా! వేదనలు తలయెత్తుచున్నవి.

అరుం—రాజర్షీ! మఱి యేమున్నది?

ఉ. ఈ విధిదుర్విపాకమున ♦ నీవుగసంబడ నొక్కమాఱుగా
నావిభుఁ డామహోత్సవము ♦ లాశిశురత్నము లాదిసంబులుఙ్
భావమునందుఁ దోఁచుడు భ ♦ వత్సఖి మూర్ఛితయయ్యెనెవ్వగం
బూవులవంటిచిత్తములఁ ♦ బొల్తురుగాదె? సతీమతల్లికల్.

జన—అయ్యో! ఎంతక్రూరుఁడను? చిరకాలమునకుఁ గనఁబడిన ప్రియసఖివల్లభను స్నేహముతోఁ జూడనైతిని.

మ. అతఁడే యెన్నికసేయఁగాఁదగిన వి ♦ య్యం బాతఁడే సత్సఖుం
డతఁడే నాహృదయంబు నిక్క మతఁడే♦యానంద మాతండె జీ
విత మింకంతకు నెద్దియైనను బ్రియం ♦ బే నద్ది యాతండె శ్రీ
యుతుఁడా కోసలదేశవల్లభుఁడు నా ♦ కొండెద్దిగాఁడయ్యెనో!

అయ్యో! ఆ కౌసల్య యీమెయే.

ఉ. మంతనమందు నీమెయును ♦ మానవనాథుఁడు వాదమాడి నా
చెంతకు వారి నేరములఁ ♦ జెప్పెడివారలు వేలువేలుగా

నంతట వారికాగ్రహము • నైనఁ బ్రసాదమునైనఁ జేయ నా
స్వాంతవశంబె దానిఁదలఁ•పంబనియేమి ? మనంబు నేర్చెదుర్.

అరుం—అయ్యో! కష్టము. ఈమె హృదయము చిరకాలమునుండి నిరోధింపఁబడిన నిశ్వాసములు గలిగి నిశ్చలముగా నున్నది.

జన—హా! ప్రియసఖీ! (అని కమండలుజలమునఁ దడుపును)

కంచుకి—క. మును మిత్రమువలె నెంతయు
నను రాగరసమ్ము మీఱ • ననుకూలతఁ జూ
పినదైవమకాండవివ
ర్తనదారుణమగుచు నిపు డ • దం బీడించుర్.

కౌస—(నిట్టూర్చి) హా! వత్సా! జానకీ! ఎందుంటివి? నవవివాహలక్ష్మీపరిగ్రహమునఁ గలకలలాడుచు, మొలకలెత్తు వెన్నెలగల నిండుచందురుఁ బురుడించు నీ ముఖపుండరీకము తలఁపునకు వచ్చుచున్నది. బిడ్డా! రమ్ము. మఱల నాయంకము నలంకరింపుము. "ఈ మెరఘుకులవృద్ధులకుఁ గోడలు గాని మనకుమాత్రము జనకసుత దుహితయే" అని యెప్పుడు మహారాజు పలుకుచుండును.

కంచు—దేవి యనినట్లే.

గీ. అయిదుగురు బిడ్డ లున్న నా • యవనిపతికిఁ
దర్దఁ బ్రియుఁడు సుబాహుసూ • దనుఁ డౌకండె
యట్లె నల్వురకోడండ్ర • యందు సీత
కరణి ననురాగపాత్ర మె • క్కటెయుఁ గాదు.

జన—హా! ప్రియసఖా! మహారాజా! దశరథా!… అన్నివిధముల నిట్లు హృదయంగముఁడ వగు నీ వెట్లు మఱపునకు వత్తువు?

ఉ. అల్లునికూర్మిచుట్టముల ♦ నందఱఁ గన్నియతల్లిదండ్రులే
యెల్లెడ గారవింతురు; విప ♦ రీతముగా నది యెప్డు నీవు వ
ర్తిల్లితి; విట్టినీవును గ ♦ తింపఁగ, బాంధవబీజ మద్దియుం
జెల్ల, మనంగనయ్యెద నిసీ! నరకంబుగఁ దోఁచు నీ ధరన్.

కౌస—అమ్మా! జానకీ! ఏమి సేయుదును? దృఢమైన వజ్రలేప మున నతికినట్లు మందభాగ్యనగు నన్ని చెడుప్రాణము విడువ కున్నది.

అరుం—రాణీ! ఊరడిల్లుము. నడుమనడుమ బాష్పవిరామమును జేయఁదగినదియే. అదియుంగాక ‹‹అది యట్లు కావలసినదైన దే గాని శుభముగాఁ బర్యవసింపఁగలదు›› అని ఋష్యశృం గాశ్రమమందు మీ కులగురుఁడు చెప్పినమాట మఱచితివా?

కౌస—నా మనోరథము లన్నియు నతిక్రమించినవి. ఇంక నా కిది యెట్లు?

అరు—రాజపత్నీ! మీ గురుని వాక్య మసత్య మని తలఁచుచుం టివా? సుక్షత్రియా! నీ వట్లు తలఁపఁదగదు.

గీ. బ్రహ్మవిజ్ఞానఘనులగు ♦ పరమఋషుల
పలుకులందును సందేహ ♦ పడుట తగదు
వారి వాక్కుల నిలుచు భ ♦ వ్యతమలక్ష్మి
విప్లుతార్థంబు నెన్నఁడు ♦ వీరలనరు.

(తెరలోఁ గలకలము-అందఱు విందురు.)

జన—ఓహో! ఇది శిష్టానధ్యయనమని యథేచ్ఛముగా నాడుకొను చున్నవడుగుల కోలాహలము.

కౌస—ఈ బాల్యము సులభమగు సౌఖ్యము గలది (నిరూపించి) ఆహా! వీరలనడుమ నీ బాలుఁడెవఁడు? అతిసుందరములగు నవయవముల రామభద్రుని కౌమారలక్ష్మి ననుకరించుచు నా కన్నులఁ జల్లఁగాఁ జేయుచున్నాఁడు.

అరుం—(తనలో సంతోషాతిశయముతో) ఇదియే భాగీరథి చెప్పిన రహస్యకర్ణామృతము. కాని, యాయుష్మంతులగు కుశలవుల లో నీతఁ డెతఁడో మాత్ర మెఱుఁగము. (ప్రకాశముగా)

చ. కువలయనీలవిగ్రహము • కూఁకటులుం గడు ముద్దుఁగొల్పఁ, నా
తత్ప్రవిమలకాంతిలక్ష్మి వటు • మండలి నెల్ల నలంకరించుచున్;
నవముగఁ బిన్నయైన రఘు • నందనుఁడో? యనునట్లు గాఁ గా
నవుచు, మదీయదృష్టికమృ • తాంజనమయ్యె నితం డెతండొకో?

కంచు—నిజముగా నీ బాలకుఁడు క్షత్త్రియబ్రహ్మచారి యని తలంచెదను.

జన—ఔను. అట్లే. ఈతనికి:—

మ. సిగకుం దాఁకెడు కంకపత్త్రిములతోఁ • జెన్నైన తూణీరముల్
దగు వెన్కన్; రురుకృత్తి భూతిలవపూ • తంబైన వక్షంబునం
దగుఁ; గ్రిందన్ గుణమేఖలావలయబ • ద్ధంబైన మాంజిష్ఠ మొ
ప్పగు; విల్ పిప్పలదండ మక్షసరమున్ • హస్తంబులం బొల్పగున్.

భగవతీ! అరుంధతీ! ఈతఁ డెవ్వరివాఁడని యూహించుచున్నావు?

అరుం—మేమిప్పుడేవచ్చితిమి.

జన—అయ్యా! గృష్టీ! మిగుల వేడుకగానున్నది. నీవుపోయి వాల్మీకిమహర్షి నే యడుగుము. మఱియు నాపిల్లవానితో "ఆ ముదుసలు లెవ్వరో నిన్నుఁ జూడ నభిలషించుచున్నా" రని చెప్పుము.

కంచు—చిత్తము. (అని నిష్క్రమించును)

కౌస—ఏమి తలఁచెదరు? ఇట్లు పిలిచిన వచ్చునా? రాఁడా?

జన—ఇట్టి యాకారవిశేషమును గుణసంపద విడిచియుండునా?

కౌస—(నిరూపించి) ఔరా! గృష్టిమాటలు వినయముతో విని యతఁడు తోడిబాలుర నెల్ల విడిచి యీవైపుగా వచ్చుచునే యున్నాఁడు.

జన—(చాలసేపు పరికించి)

చ. వినయవిశేషశీతల మ ♦ విజ్ఞజనేతరగోచరంబు మ
గ్ధ్యనిభృత మేతదీయమహి ♦ మాతిశయం బదియేమొకాని! నా
మనము విమోహనిశ్చలత ♦ మాన్పడియున్నను, బెద్దయిన్ప
ముక్కను గుఱుసూదియంటుకలు ♦ కైవడి బల్మిమెయిన్ హ
రించెడున్.

లవుఁడు—(ప్రవేశించి) పూజ్యులేమైనను వయఃక్రమౌచిత్యము నెఱుంగక వీరి కెట్లు నమస్కరింతును? (విమర్శించి) ఈయాచార మవిరుద్ధమయినదని పెద్దలవలన వింటిము. (వినయముతో సమీపించి) ఇదిగో మీయందఱకు లవుఁడు నమస్కరించుచున్నాఁడు.

అరుం—} భద్రా! అయుష్మంతుఁడ వగుము.
జన— }

కౌస—వత్సా! చిరంజీవి వగుము.

అరుం—వత్సా! రమ్ము (లవుని దొడపై నిడుకొని తనలో) ఆహా! ఉత్సంగ మొకటియేగాక నా చిరమనోరథమును నిండినది.

కౌస—వత్సా! ఇటుగూడ నొకమాఱు రమ్ము. (తొడపైఁ గూర్చుండఁబెట్టుకొని) ఆహా! నవకువలయశ్యామలంబగు దేహమున నేగాక పద్మకింజల్కములఁ గబళించుటఁ గషాయకంఠముల గు కలహంసల ఘోషమువలె గణగణలాడు గంభీరస్వరము చేతను రామభద్రు ననుసరించుచున్నాఁడు. కమలగర్భకఠోరమగు శరీరస్పర్శముగూడ నట్టిదే. వత్సా! నీ ముఖపద్మముఁ జూడనిమ్ము (గడ్డమును బైకెత్తిచూచి కన్నీటితో సాభిప్రాయముగ) రాజర్షీ! నీవు చూచుటలేదా? బాగుగ నిరూపింప సీతాముఖచంద్రుని పోలికయుఁ గనుపట్టుచున్నది.

జన—సఖీ! చూచుచునేయున్నాను.

కౌస—అయ్యో! పిచ్చియెత్తినట్లు నా హృదయ మెక్కడకో పోయి విలపించుచున్నది.

జన—ఉ. పోలుప సీతరూపు రఘు ♦ పుంగవుచందమువారలేక యీ
బాలునియందుఁగన్గొనఁగ ♦ వచ్చెదునచ్చునగ్రుద్దినట్లుగా
మేలిమిపల్కులుఁ విసయ ♦ మేదురభావము లవ్వియే కటా
యేలొకొ? నామనంబుపరు♦వెత్తుచునున్నదితప్పుత్రోవలఁ.

కౌస—వత్సా! నీకుఁ దల్లిగలదా? తండ్రి నెఱుఁగుదువా?

లవు—లేదు. ఎఱుఁగను.

కౌస—అట్లయిన నీ వెవ్వరివాఁడవు ?

లవు—భగవానుఁడగు వాల్మీకిమహామునివాఁడను.

కౌస—ఓయీ ! చెప్పఁదగినది చెప్పుము.

లవు—ఇంతవఱకే యెఱుఁగుదును.

(తెఱలో)

ఓహో! సైనికులారా! ఇదిగో! ఆశ్రమారణ్యభూముల నా క్రమింపవలదని చంద్రకేతుకుమారుఁ డాజ్ఞాపించుచున్నాఁడు.

అరుం— } ఓహో యజ్ఞాశ్వరక్షణ మొనరింప వచ్చిన చంద్రకేతు
జన— } కుమారుని గనుఁగొందుముగాన నిది సుదినము.

కౌస—లక్ష్మణకుమారుని పుత్త్రుఁ డాజ్ఞాపించుచున్నాఁడను నక్షరములమృతబిందుసుందరములై వినవచ్చుచున్నవి.

లవు—ఆర్యా ! చంద్రకేతు వనఁ నెవఁడు ?

జన—దశరథపుత్త్రులగు రామలక్ష్మణుల నెఱుఁగుదువా ?

లవు—వీరేకదా రామాయణ కథానాయకులు ?

జన—ఔను.

లవు—అయినచో నేల్లెఱుఁగకుందును ?

జన—ఆలక్ష్మణున కీ చంద్రకేతువు పుత్త్రుఁడు.

లవు—ఊర్మిళాదేవికొడుకా ? అట్లయిన మిథిలాధిపతియగు రాజర్షికి దౌహిత్త్రుఁడు.

అరుం—ఈచిన్నవాఁడు తన కథాప్రావీణ్యమును బ్రకటించినాఁడు.

జన—(ఆలోచించి) నీవీ కథయందంతగా నభిజ్ఞుఁడ వైనచో దశరథకుమారులకు నేయే భార్యలందే యే పేరులుగల యొందఱు పుత్త్రులు గల్గిరో చెప్ప చూతము.

లవు—ఆకథాభాగము మేముగాని యితరులుగాని యెన్నఁడు విని యుండనిది.

జన—కవిచే రచియింపఁబడలేదా ?

లవు—రచించెనుగాని ప్రకటింపలేదు. దానిలో నొకభాగమును రసవంతమగు నాటకముగాఁ జేసి స్వహస్తలిఖితమగునాపుస్తకమును వాల్మీకిమహర్షి తౌర్యత్రికసూత్రధారుఁడగు భరతాచార్యునకుఁ బంపెను.

జని—ఎందులకు ?

లవు—ఆభరతమహాముని దానినప్సరస్త్రీలచేఁ బ్రదర్శింపఁజేయుటకని.

జన—ఇది యంతయు మాకు గూఢార్థముగా నున్నది.

లవు—వాల్మీకిమహాముని కాగ్రంథమునం దెంతో యాదరము. ఎట్లన ? ఆపుస్తకమును గొందఱు శిష్యులచే భరతాశ్రమమునకుఁ బంపుచు వారికే ప్రమాదమును గలుగకుండఁ గాపాడుటకై ధనుర్ధరుఁడగు నా సహోదరునిగూడ బంపెను.

కౌస—నీకుసోదరుఁడును గలఁడా ?

లవు—ఆఁ. కుశుఁడను నార్యుఁడు గలఁడు.

కౌస—జ్యేష్ఠుఁడని తెలియవచ్చుచున్నది.

లవు—ఔను. ప్రసవానుక్రమంబున నాతఁడే పెద్ద.

కౌస—ఆయుష్మంతులగు మీరు కవలపిల్లలాయేమి ?

లవు—ఔను.

జన—వత్సా ! ఆకథాప్రపంచ మెంతవఱకున్నదో చెప్పుము.

లవు—అసత్యమగు పౌరజనాపవాదమున సంభ్రాంతుఁడైన రాజుచేఁ బరిత్యజింపఁబడినదియు నాసన్నప్రసవవేదనయు నగు దేవిని

వనముసం దొంటిగా విడిచి లక్ష్మణుఁడు మరలివచ్చునంత వఱకు.

కౌస—హా! వత్సా! ముగ్ధముఖ! ఏకాకిని వగు నీశరీరకుసుమమున కిప్పు డేదైవదుర్విపాకము వచ్చినదో.

జన—అయ్యో! బిడ్డా!

గీ. ఘనపరిభవమ్ము భీకర ♦ కాననమ్ము
నా ప్రసవకాలదుఃఖము ♦ నంది నీవు
క్రూరమృగములు చుట్టువా ♦ ర్కొనుచునుండ
నడవి మాటికి నను శర ♦ ణనుచుఁ దలఁతు.

లవు—ఆర్యులారా! వీరెవరు?

అరుం—ఈమె కౌసల్య. ఈతఁడు జనకుఁడు.

(బహుమాన ఖేదకౌతుకములతోఁ జూచుచున్నాఁడు)

జన—ఆహా! దుర్బుద్ధులగు పౌరుల నిర్దయత! ఔరా! రామభద్రుని యనమీాక్ష్యకారిత్వము!

మ. 1 మది నీవైశసవజ్రపాతఘును వే ♦ మాఱుగ విచారించు నా
2 కదనో నియ్యదిశాపచాపములఁ గ్రో ♦ధాగ్నిగ రగులొల్పఁగా

కౌస—(భయకంపములతో) భగవతీ! రక్షింపుము. కుపితుఁడగు రాజర్షిని బ్రసన్నుఁ జేయుము.

లవు—గీ. మానవంతులు పరిభూతు ♦ లైన వేళ
వారి కిదియె కోపప్రతీ ♦ కారముగద

అరుం—నృపకులేశ్వర! రాముఁడు ♦ నీదు బిడ్డ
పాలనీయులు కృపణు లీ ♦ ప్రజలు నీకు.

జన—మ. 3 హృదయం బెప్పుడు పుత్త్రితుల్యుఁడగుటన్ ♦ శ్రీరా
ముదండిపనో

4. ప్పుడు; పౌరుల్ ద్విజబాలవృద్ధవికలుల్ ♦ భంజింపఁగానర్హులే?

వటువులు—(సంభ్రమముతోఁ బ్రవేశించి) కుమారా! కుమారా! “అశ్వ మశ్వ” మని యొకానొక జంతువిశేషము జనపదములయందు వినవచ్చుచున్నది. దానిని మే మిప్పుడు ప్రత్యక్షముగాఁ జూచితిమి.

లవు—“అశ్వ మశ్వ” మని పశుసమామ్నాయమునందును యుద్ధకాండమునందును జదివితిమి. కావున నదియెట్టిదియో చెప్పుఁడు.

వటువులు—ఓయీ వినుము.

చ. కలదు వెడందతోఁక వెనుకన్ ; గదలించుచునుండు దానినిం
బలుమఱు నిట్టటుల్ ; నిడుద ♦ పాటిది కుత్తుక ; నాల్గెయుండు డె
క్కలు ; నును లేఁత గడ్డిపర ♦ కల్ దిను ; మామిడికాయలంతల
ద్దుల విడుఁ ; జెప్ప నేల? యది ♦ దూరమువోయెడు రమ్ము రమ్మిఁకన్.

(అని యుత్తరీయాజినమును హస్తములను బట్టుకొని లాగుచున్నారు).

లవు—(కౌతుకోపరోధవినయములతో) ఆర్యులారా! చూడుఁడు వీరు నన్నులాగుకొనిపోవుచున్నారు.

(అని వడిగాఁ బరిక్రమించును)

అరుం—
జన— } ఈతనికిఁ జాల వేడుకగానున్నది.

కౌస—ఆరణ్యకబాలుని రూపము నాలాపనములు మనల నందఱ నంతోష పెట్టినవి. భగవతీ! నేనాతనిఁ జూచుచు వంచింప

బడినట్లయితిని. కాన నిచటనుండి వేఱొకవైపున కేగి మనము పరువెత్తుచున్న యాచిరంజీవిని జూతము.

అరుం—ఆబాలుఁడు వేడుకతో నతివేగముగా దూరమున కేగినాఁడు. ఎట్లుకనఁబడును ?

కంచుకి—(ప్రవేశించి) భగవానుఁడగు వాల్మీకి „ మీకీ విషయము తగుసమయమునందుఁ దెలియనగు ” నని పలికెను.

జన—ఇది యేదియో యతిగంభీరముగానున్నది. భగవతీ! అరుంధతీ! సఖి! కౌసల్యా! మనమే పోయిభగవానుఁడగు ప్రాచేతసుని దర్శింతము.

(అని వృద్ధవర్గము నిష్క్రమించెను)

వటువులు—(ప్రవేశించి) కుమారా! వింతఁ గనుఁగొనుము.

లవు—చూచితిని. మఱియుఁ దెలిసికొంటిని. నిజముగా నిది యశ్వమేధసంబంధమగు హయము.

వటు—ఎట్లు తెలిసికొంటివి ?

లవు—మూర్ఖులారా! ఆకాండమును మీరును బఠించియే యుంటిరి గదా ? వేఱువేఱుగ నూఱుగురు కవచధారులు, నూఱుగురు దండధరులు, నూఱుగురు నిషంగవంతులును రక్షకులుగానుండిరి. కనుఁగొనుటలేదా ? తక్కిన సైన్యమును దానికిఁ దగినట్లే యున్నది. మీకు నమ్మకములేనిచో వారినడుగుఁడు.

వటు—ఓహో ! సైనికులారా! ఎందులకీ యశ్వము సేనాపరివృతమై తిరుగుచున్నది ?

లవు—(తనలో-వాంఛతో) అశ్వమేధ మనఁగా విశ్వవిజయులగు

క్షత్త్రియులకు బలిష్ఠము సర్వక్షత్త్రపరిభావియు నగు గొప్ప యుత్కర్షనికర్షముగదా?

(తెరలో)

గీ. అశ్వ మియ్యది సప్తలో ♦ కైకవీరుఁ
డయిన శ్రీరామచంద్రుని ♦ జయపతాక
అదియునుంగాక దశకంధ ♦ రాదిజనక
కులనిషూదను ఘనవీర ♦ ఘోషణంబు.

లవు—(గర్వముతో బలె) ఆహా! ఈయక్షరములు క్రోధసందీపనములుగానున్నవి.

వటు—చెప్పవలసినదేమున్నది? లవకుమారుఁడు ప్రాజ్ఞుఁడుగదా!

వటు—ఓహో! మీరిట్లుచాటుటకుఁబుడమిపై రాజులు లేరాయేమి?

(తెరలో)

ఓరీ! మహారాజునెదుట రాజు లెక్కడ?

లవు—ఛీ! మూర్ఖులారా!

గీ. లేకపోయినఁ బోదురు ♦ గాక! యిప్పు
డీ బిభీషిక లన్నియు ♦ నేమిపనికి?
నింకఁ బలుమాటలాడఁగా ♦ నేల? యిదిగో!
అపహరించెద నే నా జ ♦ యధ్వజంబు.

ఓ వడుగులారా! చుట్టుముట్టి మట్టిగడ్డలతోఁ గొట్టుచు నీగుఱ్ఱమును దోలికొనిపొండు. ఇది మనరోహితమృగములలో సంచరించుఁగాక!

పురుషుఁడు—(క్రోధముతోఁ బ్రవేశించి) ఛీ! చపలుఁడా! ఏమంటివి?

మా శస్త్రములు మిగుల వాఁడియైనవి. బాలకుల గర్వాలాపములనైనను సహింపవు. రాజపుత్రుఁడగు చంద్రకేతువు దుర్దాంతుఁడు. వింతగా నీ యరణ్యమును గనుఁగొనుచు వెనుకనున్న యీరాజపుత్త్రుఁడు రాకమునుపే మీరీచెట్లమఱుఁగు నుండి వడిగాఁ దొలఁగిపొండు.

వటు—కుమారా! చాలుఁ! చాలు! ఈగుఱ్ఱముతో నేమిపని? విండ్లు మ్రోయించుచు నీ శస్త్రపాణులు నిన్ను వెఱపించుచున్నారు. మన యాశ్రమపదమును దూరముగా నున్నది. ఇటుఁ రమ్ము లేడిగంతులతోఁ బరువెత్తి పోదము.

లవు—విండ్లు మ్రోఁగుచున్నవా? (అని విల్లు మోపెట్టుచు)

ఉ. జ్యారసనానిబద్ధవలయస్ఫుటకోటికగాళదంష్ట్రము
ద్యూరినిగూఢ ఘుర్ఘరితదుర్ధరఘోషము నాదు చాప మా
హారకృతిప్రసక్తహసదంతికభీకరవక్త్రయంత్రజృం
భారచనావిడంబి విషమప్రకటోదరమై తనర్చుతన్.

అని యథోచితముగఁ బరిక్రమించి యందఱు
నిష్క్రమింతురు.

ఇది చతుర్థాంకము.



శ్రీ

# వ్యాసాభ్యుదయము:

శతావధాని

వేంకటరామకృష్ణప్రణీతము.

ఇయ్యది

కాకినాడ సుజనరంజనీ ముద్రాక్షరశాలయందు

పోతాప్రగడ బ్రహ్మానందరావుగారిచే

ముద్రింపఁబడి

వేంకట రామకృష్ణకవులచే

ప్రచురింపఁబడియె.

1908.

వెల రు 0-5-0

# శుద్ధపత్రిక.

—:0:—

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 6 | 23 | నట్టు | నట్టి |
| 7 | 27 | దృపబుందు | ధినేత |
| 8 | 28 | డిటో. | డిటో. |
| 9 | 1 | డిటో. | డిటో. |
| 10 | 2 | డిటో. | డిటో. |
| 15 | 18 | వర్యంత | పర్యంత |
| 17 | 2 | నడి | నది |
| 20 | 39 | డింబ | డింభ |
| 23 | 21 | ననిచ్చు | నకునిచ్చు |
| 28 | 19 | సుతుఁడై | సుతుఁడై |

గీ॥ అనఘుఁడయి స్వపుత్రాపద * వాగ్నిచేతఁ
బరమహారణ్యముల భస్మ * పటలిఁజేసి
వసువులందఱిలోనఁ జే * ర్చడసియుపరి
చరవసు నృపాలుఁడేలు న * వ్వరవరంబు.

ఈపద్యము ప్రథమాశ్వాసమున 35 వదిగాఁ జదువవలెను.

ఓంశాంకర్యైనమః.

గురుభ్యోనమః.

# వేంకటరామకృష్ణీయము.

# శ్రీవ్యాసాభ్యుదయము.

## ప్రథమాశ్వాసము.



చ॥ జనకునిముద్దుపట్టియొక * సకెఁములాడువేళనమ్మమీ
జనకునియానఁగానలను * చాలశ్రమంపడియుంటినంచు బ
లికెఁనవినినికుఁవంజెకలి * కీశపథంబొనరింపకున్న న
మ్మనెయనిపలుకఁదాశరధి * మాటలుమమ్మనిశమ్ముఁబ్రోచుతన్॥ 1

చ॥ సతినతిసాధ్వీశీతగిరి * జాతమణీమణిఁబ్రకకఁనుంచి సం
గతకుటిలప్రచారిణిని * గంగనునాదలఁదాల్చినట్టి సి
ప్పితివతైసాంధ్యతాండవముఁ * జెంపుదొలంగియొనర్చుశంకరుం
డతులదయార్ద్రదృష్టులన * హర్ణిశమున్ మముఁబ్రోచుఁగావుతన్॥ 2

ఉ॥ పువ్వులుకానితల్లిహరి * పాకిఁటికామరనాకఁతూటికిం
బువ్వులునాలుగాకఁపరిఁ * బుట్టైనిదేమివిచిత్రమంచుఁ జె
న్నివ్వెఱభూమినడ్గనవు * నేయనియామెయువింతఁజెంద నా
యవ్వలఁగాంచినవ్వువిధి * యాయురనామయసిద్ధిమాకిడున్॥ 3

ఉ॥ భీకరులైనయట్టి బుధ * భృత్యులఁజేరగఁదీసివారికిన్
రూకలనిచ్చితన్ముఖస * రోజమునన్ విధిచేడెఁగోడలిన్
లోకులనోళ్లవైచిమది * లోముదమందెడుతాఁగరాగ ల
క్ష్మీకలితార్ద్రచిత్తయయి * చేరివసించుతమాగృహంబులన్॥ 4

మ॥ రతికాలంబుననొక్కసారి తమిదీ * రంభాతచుంబింపఁగా
జతురాస్యంబులనెంచినం దెలిసియా * చందంబు డెందంబునన్
జతురాస్యత్వముఁబూనిలేనగవుతో * సంతోషితస్వాంతుగాఁ
బతిఁజేయన్నమకట్టుసాధ్వీమము వి * ద్వచ్ఛ్రేష్ఠులంజేయుతన్॥ 5

సీ॥ దక్షధాత్రధ్వర * ధ్వంసనమ్మునకాది- హేతువైతనరులో * నైకమాత
మంచుమెట్టకుఁగూర్మిఁ * బెంచులేఁబట్టియై- మురువుఁజూపినయట్టి * ముద్దుగుమ్మ
యాహార్యతుల్యదే * వాహార్యనిష్టచే- హుమనిఁబెండ్లాడిన * యాదిశక్తి
కడుపారఁగావేల్పు * పడవాలుఁగమ్రేలు- బొజ్జదేవరఁగన్న * పుణ్యబోడి

గీ॥ ముక్తినాసక్తిఁగొల్చెడు * భక్తజనుల
గ్రచ్చులంగూర్చుచుండెడు * కల్పనగము
మేదురదయార్ద్రహృదయయై * మెలఁగునాతి
మంచుమలకొడ్డమమ్మును * మంచుఁగాత॥ 6

ఉ॥ శంకరుచంకనుండిహారు * సౌకనమ్మునిమ్ముటంచునా
తంకముఁజేయఁదండ్రియును * దల్లికినల్లనసీయకొంగ డా
చంకనుబెట్టినావనుచు * శాంకరినవ్వఁగఁదిట్టునట్టినా
గాంకునిపట్టిఁజేయుతద * యామతిమాకునింతరాయమున్॥ 7

వ॥ ఈకవుల మాతామహపితామహులన్నదమ్ముల ఓలోఁకి దక్షిణామూర్తి నారా
యణశాస్త్రులస్తుతి. 8

ఉ॥ కాకవులెల్లరుందమము * ఖంబులవంచుకొనన్సురాశిహో
వాకసమానమౌకవన * పద్ధతిఁజూపెనొకండుబాలవా
ల్మీకియటంచులోకముల * మేకొనెఁబేరుమశ్లోకఁడిట్టిసు
శ్రీకలితుల్దలంపఁదగ * కేతలిదండ్రులతాతలిర్వురున్॥ 9

క॥ భారవినికాళిదాసము । మారిశ్రీహర్షదండి * హాసామరవి
ద్యారణ్యముఖులఁదలఁతుము । దారులగీర్వాణకవివ * తంసులనెదలన్॥

ఉ॥ చక్కనిముద్దుపల్కులఁబ * సందుగభారతమంధ్రభాషనిం
పెక్కరచించియాంధ్రకవు * లీత్రయిమీఱినవారులేరనన్
నిక్కువమైనకీర్తినిగ * ణించిననన్నయనెఱ్ఱప్రగ్గడన్
దిక్కనసోమయాజిని మ * దిందలపోయుదుమెల్లవేళలన్॥ 11

ఉ॥ తొల్లిఁటిసత్కవీశ్వరులు * ద్రొక్కినదారులందక్కమాఱుగా
వెళ్లిననెవ్వరీనియమ * వేదులువారలదారిఁజేరఁగా
నెల్లరుఁగోడిగ్రుడ్డులకు * నీఁకలఁబీఁకెడువారెనవ్వులో
చెల్లయిఁకంప్రబంధములఁ * జేయుటయెట్టులొచెప్పుఁడీబుధుల్॥ 12

చ॥ కవివరులార? పూర్వకవి * కల్పకకల్పనలెందుమీకు మా
కవనమునందునెచ్చటను * గానఁగలేవనిచెప్పఁదప్పలే
దవియిటనూటవాఁటనొకఁ * డైననురెండయినంగనంబడన్
గవిజనమార్గమొక్కటియై * కావునమమ్మునుదూఱఁబోకుఁడీ॥ 13

వ॥ అని యిష్టదేవతావందనంబును శిష్టకవిస్తుతియు దుష్టకవినిరాకరణంబును
గావించి మారచింపంబూనినగ్రంథమునకు శ్రీసీతారామచంద్రుఁ గృతినాయ
కునిఁగాఁజేయుటకుఁ గతంబెమనిన. 14

సీ॥ సరససౌందర్యవి * స్తారసీమగనొప్పు- వలరాజుఁగన్నట్టి * వాఁడటంచు
రారాజులకునుదు * ర్లభమైనమేల్పైఁడి- వల్వఁదాల్చినమేటి * వాఁడటంచు
నిఖిలశాస్త్రపురాణ * నిగమాంతచారినా- వసుమతిబేర్వడ్డ * వాఁడటంచు
నెచ్చోటఁగన్గొన్న * మచ్చయింతకలేని- వేఁడివేల్పుకొలమ్ము * వాఁడటంచుఁ
గీ॥ కోరువారలకొంగు బం * గారమనుచు
వేరుచోఁగాకయూరిలో * నూరటంచు
నవ్యలక్షణయుతయగు * కావ్యకన్య
కకుఁబతింజేయమాకుఁగౌ * తుకముపొడమె॥ 15

చ॥ బలమునదుష్టరాత్రిచర * వర్గములంబరిమార్చిభూమికిం
బలువునుడింపగానతిక్కృ * పామతిమానుషవేషధారియై
యిలపయిభూరివైభవయు * తేందుమతీసుతునందనుండుగా
నలరినయట్టిపాలకడలి * యల్లుఁడెయల్లుఁడుగాఁగఁజెల్లదే॥ 16

వ॥ అనియెంచి షష్ఠ్యంతమ్ముల నిట్లుచెప్పంగడగితిమి. 17

## షష్ఠ్యంతములు.

క॥ కమలదళాయతనేత్రున । కమలయశోభాప్రకాశ * తాళాంతునకున్
రమణీయగాత్రునకు శ్రీ । రమణీముఖపద్మతిగ్మ * రశ్మికిహరికిన్॥ 18

క॥ వరుసనకుఁగనకాంబరభా । స్వరునకుఁద్రైలోక్యపూత * చారిత్రునకున్
బరునకుభక్తాశ్రిత । త్వరునకు భవపాశనాశ * పటునామునకున్॥ 19

క॥ సురుచిరగుణునకుఁగరుణా । వరుణాలయునకు దిగీశ * వందితవిలస
చ్చరణారుణకమలునకఘ । తరణసుకరణునకు జనక * తనయాపతికిన్ ॥ 20

క॥ శ్రీమత్సుంకరపాలెం । గ్రామేవాసునకు శ్రీసు * వర్గ్రామణికిన్
కామితదునకున్ వేంకట । రామాహ్వయసత్కవీశ్వ * రస్తుత్యునకున్॥ 21

క॥ శ్రీమత్కాకరపర్తి । గ్రామనివాసునకు శ్రీసు * వర్గ్రామణికిన్
కామసమాకారునకున్ । గామదునకు రామకృష్ణ * కవిగేయునకున్॥ 22

క॥ శ్రీరమ్యాయోధ్యానగ । కీరమణునకున్ దయాప * రీతాత్మునకున్
వీరాధివీరునకు సీ । తారామునకున్ మదోద్ధ * తవిరామునకున్॥ 23

వ॥ సమర్పణంబుగా మాయొనర్పంబూనిన వ్యాసాభ్యుదయమ్మను శృంగారప్ర
బంధమునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 24



## కథాప్రారంభము.

గీ॥ కలుములకుఁబట్టుకొమ్మ వి * ద్యలకునిమ్మ
నిగమవరచక్రవర్తిని * స్థిద్రికీర్తి
మేటులకునికరవేల్పుల * పీటముకర
పుడమినొప్పునధిష్ఠాన * పురవరంబు॥ 25

సీ॥ సకలవిద్యాప్రౌఢి * సరివారిలో మెప్పుఁ-గొనియున్న బమ్మకుఁ * గూడుపడియె
పటుతరజయయశః * పటలిచేఁదనరారు- జమదగ్నిసుతుపేరు * సన్నగిల్లె
నవనిధీశ్వరతనై * భవయుక్తుఁడైయున్న- రాజరాజయశమ్ము * బూజుఁగట్టె
హాలసంపదలఁబెద్ద * యైయున్నబలరామ- భద్రమూర్తిసుకీర్తి * నిద్రవోయె

గీ॥ వేదవేదాంగవిద్యాప్ర * వీణులగుచు
శక్తిసాహసరాజ్యసం * యుక్తులగుచు
హలకలితసంపదలమేటు * లగుచుఁదనరు
నచటిద్విజరాజన్యవైశ్యశూ * ద్రాళివలన॥ 26

చ॥ పురములలోఁగడుం బొడఁగుఁ * బొందికఁబొందుచు నించుమించుగా
దారయగునల్లవేలుపుల * తోరఁపుఁబ్రోలికటంచు నెంచి తా
మరవిరిచూలి వజ్రిమణి * మండితకంకణముల్ నుతింపుచున్
నిరుదుగ నిచ్చ నాఁగఁబుట * భేదనమందలి కోటమీటగున్॥ 27

క॥ దినకరహరినిచయము నే । మనుసత్వరగతులఁ దుల్య * మగునందు మన్నై
నను జిత్రగతుల మాత్రోఁ । జనఁజాలవటంచు గేలి * సలుపు హయంబుల్॥ 28

చ॥ ఎదుటను నిల్చె దేని సమ * యించెదమంచు దలంచి కాదె వే
ల్పుదొరను జేరియాకసము * పొంతఁజేరించెద వంచుఁ దొండముల్
జదల నిగిడ్చి యాపురపు * సామజరాజులు వెల్లరేన్గు నిం
దదన రసెల్ల వేళలను * దర్జనభర్జనఁ జేయు భూవరా!॥ 29

చ॥ చటులకటాక్షసంపదల * సంయమివర్యుల నైన రాగలం
పటులుగఁ జేయఁజాలు పుర * భామినులప్పురి సౌధవీథికా
పటలములం జరించెదరు * భాసురలీలల నంజహ్రొద్దులన్
ఘటములఁ జెట్టికాఁచినవి * పోసిన బంగరు బొమ్మలో యనన్॥ 30

ఉ॥ హాటకరమ్యహర్మ్యసము * దంచితరత్నసముచ్చయప్రభా
పాటలితమ్ములైన రతి * పక్షనిశీథినులన్ సుధాయుతో
ద్ఘాటనమొప్పియుండు మిధి * టాకనిజేరఁగ ఘన్న రూపలై
చాటుగఁబోవు చుందురఖి * సారికలప్పురి మందు నెప్పుడున్॥ 31

సీ॥ రాజప్రభారాజి * భాజనమ్ముల ముద్దు- నెమ్మొగమ్ముల చేత * నమ్ముఁగలఁచి
చంచలాంచితకటా * క్షాంచలంబుల చేత- మోహాంధ్యమును జుట్టు * ముట్టఁజేసి
నిబ్బరంబగు గబ్బి * గుబ్బగుత్తుల చేత- గుండెదిట్టము నేలఁ * గూలఁదన్ని
బాలారుణమృణాల * జాలతుల్యములైన- చేతులఁ గౌఁగిండ్లఁ * జిక్కుపఱచి
గీ॥ కలవిపంచీనినాదసం * కలితములగు
గానవిద్యల చేతఁ జి * క్కాకుపఱచి
యధరమధురామృతంబుల * నాసఁగొల్పి
విటుల వలపింతురవ్వీటి * వెలయువిదలు॥ 32

ఉ॥ కందుకకేళిచే నలయి * కంగనియున్న సరోజలోచనా
బృందముఖారవిందముల * స్వేదము నార్చుచుఁ బెర్మిపొష్పవా

గీ॥ బలిమినాతండు పరుఁజల * పట్టెనేని
ప్రాణములఁ గ్రోలకుండఁడా * బాసిపోఁడు
శౌర్యబలసాహసంబుల * సాటిలేక
మహిని పాలించుచుండు న * మ్మనుజేంద్రుఁడు॥ 38

సీ॥ పరరాజరాష్ట్రసం* పాదనమ్మునఁగాక - కఠినత్వమెచ్చోటఁ * గానఁబడదు
చేయఁబూనినదుష్ట* శిక్షణంబునఁగాక - దయలేకయుంట* యెందయిన లేదు.
అన్యకాంతావద* నాలోకమునఁగాక - భయచిత్తమెచ్చోట* బయలుపడదు
జయయశశ్శ్రీసమా * ర్జనమునందేగాక - యాశయొద్దానియం * దైనలేదు

గీ॥ విపులతరదానధర్మాది * వితతిఁగాక
యింకయెందుఁదంద్రదోఁపదె * య్యెడలనైన
శ్రీకరుండగు వసురాజ * శేఖరునకు
నితనిఁబోలిననృపతి న * హిఁబ్రతిల్లె॥ 39

క॥ ఆరాజన్యునితాగవి । దారితపరదేశనృపవి * తతివశయగురం
భారమణియనెనుమతిఁ జ । ల్లారెడుగోరికలుసోమ * రాజులకెల్లన్॥ 40

ఉ॥ ఆనృపసార్వభౌముఁడొక * యంగనఁ జంగదపాంగవీక్షణా
సూనవిలాసనిర్జిత స * ముజ్జ్వలబంభరడింభకన్ సమా
సూనుశిలీముఖాస్త్రజయు * శోభనదేవతనాఁగనొప్పుచం
ద్రాననఁ బెండ్లియాడెఁ గిరి * కాశిదమానవతీశిరోమణిన్॥ 41

క॥ రూపమ్మున రతియును వి । ద్యాపరిణతి భారతియును * దయితోనుగతి
న్బ్రాపణమునఁ బార్వతియా । చాపలనేత్రకుసమాన * సతిగలదొకో॥ 42

వ॥ ఇట్లనుపమరూపలావణ్యసుగుణోదారయగు దారతో సర్వసుఖంబులనొందు
చు నొక్కనాఁడు. 43

సీ॥ వింధ్యనమ్ములుగొని * వేఁటకాండ్రొకవంక - నాఖేటసన్నాహ* మధిగమింప
నీటెలుబల్లెంబు* లిరుగేలఁ ధరియించి - భటులొక్కదిక్కునం * భ్రమముఁజూప
వలలనుర్లనుగొంచుఁ * దులలేనిక్రొవ్యాధ - సమితిసంతోషవి* స్తరముఁజేయ
కుంతసంతతిఁ జేతఁ * గొనియాటవికకంఠ - ముఖులట్టహాసవి* స్ఫూర్తిఁదనర

గీ॥ అఖిలపరివారములువెంట * నంటిరాగ
మణిమయస్తంభవిభ్రాజ * మానమైన

స్యందనం బెక్కి లోకైక * శరణుఁడైన
మేదినీపతి మృగయావి * నోదియయ్యె॥ 44

సీ॥ గంధవాహఘ్రాణ * గంధవాహములపైఁ- గదలి రాశ్వికజనా * గ్రణులు ఘనులు
హాలాహలానలా * భీలవాలములతోఁ- జనిరొ వీరభటవ్ర * జములు జములు
ఖరతరాగ్రస్ఫుర * చ్ఛరపరంపరలతోఁ- దలరిరి ధానుష్క * వరులు పరులు
సౌవర్ణభూషణ * సౌవర్ణ్యవిధములఁ- నరిగిరి రత్నకసిం * హములు మనులు
గీ॥ చలిదికావిళ్లు చిక్కములు * చల్లడములు
నల్లబట్టలు కోడవళ్ళు * పల్లసిగలు
ఆకుచెప్పుల జోళ్లుసొం * పాఱ వెనుక
మెల్ల మెల్లన నడచిరి * భిల్లజనులు॥ 45

క॥ క్రూరతర శరభ మృగశా । ర్దూల హరి ప్రకరదుర్గ * గోత్రము జనసం
చారాభావము విపులత । తారణ్యముఁ జేరె మాన * నాథుఁ డంతన్॥ 46

క॥ కలయంగ నిమ్మృగములు వ । గ్గులయమ్ములఁ బొదలవిడిచి పడిఁ * బరువిడునట్
వలలం దగులంగఁ దెరచి । బలసిరి యత్తఱిఁ గొంగి * తాతవిసేతల్॥ 47

క॥ మోదమ్మునఁ గనుచప్పగ । నోదమ్ములఁ బ్రవిద్య తెలియ * కుండఁగఁ బైపై
గాదమ్ముల సాదమ్ముగ । మేదుర మృగ మట్టెఁ దెచ్చి * మేఁగిరి మీఁదన్॥ 48

సీ॥ పాడిపించె మల్లులఁ * బురికొల్పి యందందుఁ- గడ తేనికపిదిసిం * గములగముల
మొత్తించె భటవర్గ * మునకునూఁ తనొసఁగి- చెలరేఁగియున్న దె * బ్బులులబులుల
మోదించె సకల * పాదకోటుల మది- బొంగించి మదపుటే * నుంగుగములఁ
జంపించె మన్నెంపు * జనులకు ధైర్యంబుఁ- గల్పించి శరభసం * ఘముల నెల్ల
గీ॥ ధీరుఁడై వేఁటలందారి * తేరినట్టి
విక్రమోదారుఁ డలవను * చక్రవర్తి
సకలమృగయావిధానకౌ * శలము చూపి
వెలుపుఁ దొలఁగించియుయ్యెయి * వేళలందు॥ 49

క॥ ఇటులటుఁ బటు మృగయాలం । పటుఁడై యారాజమౌళి * వన్యమృగములం
జటులతర మార్గణాగ్ని । చ్ఛటచ్ఛటల రూపుమాపి * శాంతించుటయున్॥ 50

సీ॥ కంటికింపగు మంచి * జుంటి తేనియఁ దెచ్చి- యిప్పించె నాకనిషా * దాద్యహుండు
పండిరాలిన యట్టి * పండ్లనన్నిటిఁ దెచ్చి- యిప్పించె నాకభి * ల్లాద్యహుండు

ముదిరిపండినచెట్ల * వెదురుబియ్యముఁ దెచ్చి - యర్పించె నొక కిరా * తాధిపుండు
పుండ్రేక్షువులఁ గంద * మూలంబులం దెచ్చి - యర్పించె నొక పుళిం * దాధిపుండు
గీ॥ పునుఁగుజవ్వాదిఁ బచ్చక * ప్పురముఁ దెచ్చి [ము
నరపతికి నొక్కరుఁడు పాయ * నముగ నిచ్చె
ఇటులు తక్కిన యెఱుకువా * రెల్ల నిడిరి
శక్తి కొలఁదిని గడురాజ * భక్తి చెలఁగ॥ 51
వ॥ ఇట్లు తన యెడఁ బ్రభు విశ్వాసముం జూపు నాటవికులఁ బాటించుచుఁ జనిచని 52
శా॥ కాంచెం బర్ణకుటీరనిర్గతహవి * ర్గంధాఢ్యధూమాసిత
ప్రాంచత్పల్లవవల్లరీపరిమిళ * త్ప్రాంశుస్థిరాజాతముం
గంచత్పుష్పకదంబసంభృతమధు * స్స్వాదప్రమత్తాళిగా
నాంచత్పుష్పసరోవరంబు నొకము * న్యావాసము న్ముందటన్॥ 53
సీ॥ కవులు తప్పినఁ జెప్పు * కవులు తత్కరసార - తటపక్వద్రాక్షాహ్మ * వటుజనంబు
పికశుకవ్రాకరమో * పిక చింతనలఁ జెప్పు - సామవేదిబ్రహ్మ * చారితతికి
సారెసారెకుఁ జెప్పు * శారికానికరంబు - శాస్త్రార్థములలోని * సంశయముల
భృంగితతుల్ జెప్పు * సంగీతముల రొప్పు - కులపతికన్యకా * తిలకములకు
గీ॥ చెట్లక్రిందను గూర్చుండి * చెన్ను మిగుల
భారతాదుల భక్తితోఁ * బఠనఁ జేయు
పండ్లుగడచిన వాచంయ * మీశ్వరులకు
వ్రాతతప్పులఁ దిద్దుసం * ప్రీతిఁ గోఁతి॥ 54
శా॥ అవ్యాజాదరమేదురంబగు మదిన్ * హర్యక్షముల్ హస్తియున్
సవ్యాపారపరస్పరోపకృతులన్ * సల్పున్ సదానీరమున్
గోవ్యాఘ్రంబులు రెండు నొందుకొలనన్ * గ్రోలున్ దదీయస్థలిన్
గ్రావ్యాదుండను శబ్దమే నహిఁ గదా * కాంక్షం బ్రతీక్షించినన్॥ 55
సీ॥ మండెడి పంచాగ్ని * మధ్యమందు వసించి - చలియింపక తపమ్ము * సలుపువారు
కాలిబొట్టనవ్రేలి * నేలనూనియుఁ దలం - కక జపదివసముల్ * గడపువారు
పవనాశనవ్రతపర * భావంబు నొందియుఁ - జింతింపక తపమ్ముఁ * జేయువారు
నుద్ధృతబాహుల * య్యనుపీడితులుగాక - నిష్ఠాగరిష్ఠులై * నెగడువారు

తారహారవిభూషి * తమ్మెఱచెలంగాడి- గళమున జపమాలి * కలధరించె
జయకరఖడ్గప్రశస్తమై తనరారు- హస్తమందున దండ * మమరఁదాల్చె
గీ॥ తీరుమీఱెడుగంగచెం * దిరపు నామ
మునను బొల్పువహించెడు * మోమునందు
దళతళఁజెలంగుభూతిరే * ఖలనిగిడ్చె
రాజఋషిధ్యానయా * వసురాజమౌళి॥ 65

చ॥ ఒకతఱిసన్మునీశ్వరుల * నోముచు నేమముతోడ నుండువే
ఱొకతఱిదుష్టభంబులగు * యోగములంబరిపాటిఁజేయునిం
కొకతఱిదృష్టినాసకొన * నుంచితలంచును జిత్స్వరూపముల్
సకలమునీంద్రబృందములు * చాఁగుబళాయనిసన్నుతింపఁగన్॥ 66

వ॥ ఆసమయంబున 67

క॥ ఆతనిసంయమనిష్ఠా । చాతురివిని సంతసించి * స్వాఃపతి యాభూ
నేతఁగనసముత్కంఠను । హీతలమునకేగఁగాన * హీనవిభూతిన్॥ 68

సీ॥ పటుతరస్వేచ్ఛతా * పటలంబు లొకవంక- నతిభక్తిమీఱజో * హారులొనఁగ
సరససౌందర్యశోభా * స్వరితైన యప్సరో- వనజపత్రేక్షణలు వీ * వనలవీవ,
ఋషిస్త్రీలావణ్యకాం * బులకునీడగునట్లు- తాలువాలసౌరదుం * దుభులుమ్రోయ
గంధర్వకాముఁ * గానము వీణలఁబూని- తనకీర్తివితతిని * స్తవముఁజేయ
గీ॥ నెంపకొందనుమించిన * ఏఁడిఁజెలఁగు
వల్లయేనుంగుసైనెక్కి * వేల్పుఱేఁడు
వసుమహారాజుఁజూడ మలా * లసతమహికి
దిగియెనర్ధాంగియగుశచీ * దేవితోడ॥ 69

వ॥ అంత నారాజన్యశేఖరుండును దనయెదుట సాక్షాత్కరించిన ఋషి పక్షపా
తియగు నగపక్షపాతిఁగని మనంబు వినయసంభ్రమములనంబుగా సగౌరవంబు
గాఁబ్రణమిల్లినన య్యింద్రుండిట్లనియె॥ 70

ఉ॥ నీవ్రతమాఱనీవగుమ * హోన్నతికిన్ సుగుణప్రశస్తికిన్
మానసముప్పొంగెనింతయును * మానముగాఁని వమాచరింపనే
మౌనికిఁజెల్లెనేర్పున్ భువన * మాన్యుఁడవైతివి రాజచంద్ర యీ
మైననుసంశయమ్ములేదు * నాదుమువేఁడుమువేఁడుమిచ్చెదన్॥ 71

క॥ అనఁదుఃఖశోకములమున । మునుకోరనీయకరొమిగుల * ముదితుం డై యి
ట్లనివలికె వినయముగ నిందు౹నితో నాభాభృదుత్త*రుఁడు ప్రియములరహ॥ 72

క॥ ఊహించిచూడఁగానీ । రైహికసుఖములుసఖమ్ము * లా? కాగోభృ
త్స్నేహాచిద్ధ్యానద్ర । త్యూహముగాకుండవరము * నానఁగుమనంగ॥ 73

ఆశ్వాసాంతపద్యములు.

క॥ రాత్రిమటరంకమృగగణ । నేత్రోర్భకశౌర్యధార్య * నిర్జితశత్రూ
నేత్రాహ్లాదకరోజ్జ్వల । గాత్రా! యనోవినాశ * కరసన్మిత్రా॥ 74

శా॥ శ్రీసీతారమణీమణీహృదయరా * జీవాలయేందిందిరా!
కౌసల్యాజఠరార్ణవాభినవరా * కాచంద్ర! నిస్తంద్రకీ
ర్తీ! సంపూర్ణవయోనభస్సదృశమూ * ర్తీ! స్వర్ణవర్ణోజ్జ్వల
ద్వాసా! కాకరవర్తినామనిగమే * వాసా! ప్రభూ! రాఘవా!॥ 75

ఇది

శ్రీసీతారామ కరుణాకటాక్ష సమాసాదిత సంస్కృతాం
ధ్ర పరిపాట్యేలేటి నారాయణ శాస్త్రిపుత్త్ర వేం
కటరామశాస్త్రి ద్వివేది రామచంద్రాభిధేం
ద్ర పుత్త్రరామకృష్ణశాస్త్రి ప్రణీతం
బైన వ్యాసాభ్యుదయంబను
శృంగారప్రబంధమ్ము
నఁ బ్రథమాశ్వా
సము స
మా ప్త
ము.

శ్రీశాంకర్యై నమః.

గురుభ్యో నమః.

# వేంకటరామకృష్ణీయము.

# శ్రీవ్యాసాభ్యుదయము.

## ద్వితీయాశ్వాసము.



క॥ శ్రీమహిళాసమలంకృత । వామా! వామామనోజ! * వందితదివిజ
స్తోమా! సుంకరపురివర । ధామా! ధామాభిరామ * దశరథరామా! ॥

వ॥ దేవా! యవధరింపుమనంతర కథావిధానం బెట్టిదనిన॥ 2

క॥ వెలుఁగుపడియా నృపోత్తరు । గరగరికకు డెందమందుఁ * గడునయ్యెడనా
తెలుగంటులనోర మొగమునఁ । జిలునవ్వొలయంగఁ జేసె * చిలుకంబలికెన్॥

చ॥ విపులపరాక్రమక్రమప * విదారిపుపర్వతగర్వపార్చికా
శ్యపిఁ జిరకాలమేలితన * యాలికిఁ బట్టముఁ గట్టి పిమ్మటన్
విపినమునాందిమౌనిజన * వేషముఁ జెందన మేలు కానిచో
జపముతపమ్ముఁ జేయుటలు * చన్నె వివేకనిధీ? యెఱుంగవే॥ 4

సీ॥ నయశాస్త్రములకట్టు * నటులోఁబడి మెలంగు - ప్రజలధర్మంబుల * పాలగుదురు
పన్నిచ్చుసామంత * వతులెల్లనాకట్టఁ - గర్వించి మదిలోనఁ * గప్పమీరు
చలరేగి జారచో * రులు దారులంగొట్టఁ - బుణ్యాంగనలఁ బట్టఁ * బూనుచుందు
రనుదర్పత్పరాభవ * మ్మునుగన్న శత్రువుల్ - హరియింత్రు దండెత్తి * యఖిలధన

గీ॥ ఆరుమూడగు రాజకా * ర్యంబులెల్ల [ము
మునులతపములు గంగలో * మునిఁగిపోవు
నిల్లుపెకుట్ట తెలుంగుల * నెన్న నేల
రాజు లేనట్టి రాష్ట్రమ్ము * రమ్యమవునె॥ 5

నిందుతో ప్రాణమిత్రత్వ * మెసఁగుకతన
వసునృపాలున కసమాన * వైభవునకు॥ 15

క॥ అసురాళి నెదుర్కొనుచో । నసమానపరాక్రమమున * నమరపతికిఁ దా
ను సహాయభూతుఁడైన । తైసల వెలిఁగించెఁదనదు * తేజంబెల్లన్॥ 16

వ॥ అంత॥ 17

## వసంతవర్ణనము.

సీ॥ ఏవానిచేదోయి * దేనకి ముల్లోకముల్- శాసించు మనిక్షుశ * రాసనంబు
ఏవానిహస్తరా * జీవంబునందుండి- పుష్పిత్తగుఁబుష్ప * కార్ముకంబు
ఏవానిసఖ్యంబు * గావించి జగమెల్లఁ- బిసుము పవమాన * పృషతకతతులు
ఏవానిదాస్యంబు * జేసిమీఁగుమ- హృదయముల్ జింపుఁగో * ములలనుంపు

గీ॥ అట్టి జగజెట్టియగు వచ్చి * పట్టియనుఁగు
నంగజుఁడు త్రిలోకవి * జయముఁగోరి
వచ్చునన్నియునకుదోసు * నచ్చునటుల
నవని నెల్లచోటుల * నవతరించె॥ 18

క॥ కలవారికెల్లమ భోగం । బులనెందుకు నిర్వహింప * బోయప్పుడు వి
దలుకాఁడనిఖిలభోగం।బులఁదుఱుఁగొని యదేమి * పున్నంబొకదా!॥ 19

సీ॥ నిలువెల్లఁబూచెనా * నలుగాంచె మోదుగా- రినవన్యకింశుక * వృక్షకములు
మొదలంటఁజిగిరించెఁ * దుదనుండి వెగత- ప్పినశిశిరమహీజ * బృందకములు
పల్లవించెశిఖాగ్ర * పర్యంతమునుఫుల్ల- విరిసిపోయినభూజ * ఫలనిజములు
పుష్పించెమూలంబు * మొదలుగా మొదలుతే- రినయట్టిచాంపేయ * వృక్షకములు

గీ॥ మొగ్గఁదొడఁగెనుమాతను * మూహమెల్లఁ
గిసలయమ్ములఁదాల్చెను * నసలగములు
కోరకించెఁదమ్ముగా * కుటజతతులు
కనులవిందుగఁగాసెను * కాలమందుఁ 20

గీ॥ సారెసారెకుఁజెట్లపైఁ * జేరుచుండ
నున్నసున్నని లేమావి * నున్నచిగురుఁ
దిని మదంబునఁ గుత్తుకఁ * దిప్పలేని
కోకిలమ్ములు కోయని * కూఁకలిడిరి॥ 21

సీ॥ సింగారమైనరా * చిలుకతేరునెక్కి- తనరారుమీనకే * తనమునెత్తి
యింపుగఁగండుఁగో*యిలలకుఁబురికొల్పి- మందమారుతునిస * న్మానపఱచి
కంటికింపగుతుంట * వింటియంచుల వంచి- తీరైనతుమ్మెద * నారిఁబోసి
బాగుగఁజిగురాకు*బాకుమొక్కలురాచి- గొనబగుపూవుల*కోలఁదొడఁగి
గీ॥ చెవినిదొరయఁగఁదెగలాగి * చిగురుబోండ్ల
లక్ష్యముగఁజేసియప్పుడా * లచ్చికొడుకు
వాయిమణఁగంగఁబలుసొల్లు * వేయఁదొడఁగె
విరహమనియెడు సంరంభము * వరలుకతన॥ 22
క॥ తమ్మికొలంకులఁజూమొ । త్తమ్ములఁగలకమ్మతేనెఁ * ద్రావుచుఁగడుమో
దమ్మందితేఁటికూటువ । జుమ్మనునాదఁజేసెనెల్ల * చోనయ్యెడలన్॥ 23
క॥ సంతసమున దంపతులు ని । తాంతమనోహరములైన * తద్దివసములం
దెంతయుసౌఖ్యమునొందిర । సంతునురించిరిసుఖాను*సంధుండగుటన్॥ 24
సీ॥ కర్ణభూషలుచేయఁ * గానయ్యెగిరిమల్లి- కాసుమమ్ములువిప్ర * కామినులకు
కంఠభూషలుచేయఁ*గానయ్యెమల్లికా- కుసుమముల్ జేవుల * కోమలులకు
హస్తభూషలుజేయ*నయ్యెబంధూకపు- ష్పములురత్నాకర * భామినులకు
సిగపూలుచేయఁ*గాఁదగెలోధ్రకుసుమపుం-జములుశూద్రసరోజ*సమముఖు
గీ॥ శ్రుతులకాభరణంబులై * సొంపుమీఱె [లకు
పల్లవంబులుశాలిక * పాలికలకు
భామినీసమ్మదాంబుధి * పర్వమగుచు
నలరుచుండఁగఁబుడమినా * యలరులతఱి॥ 25
చ॥ జలజపరాగపూగముల * చాటునకమ్మనిపూవుఁదేనియం
గలయఁగఁబూసినెమ్మెయిని * గన్పడకుండఁగఁజేసియొక్కరిం
దెలియనిరీతినడ్గుచుఁ * దెమ్మెరతెక్కలికాఁడుపాంథకాం
తలమనముల్ హరించుటకు * దక్కుమఁదారుచునుండెనయ్యెడన్॥ 26
ఉ॥ పానకమిక్షుఖండములు * బాగుగముగ్గినమావిపండులున్
తేనెలుగోరసంబుపయి * తేటలుగంధముతాళవృంతసం
తానములాకుఁబోకలును * దక్షిణలిచ్చిమహీసురాళిన

వ॥ అట్టివసంతసమయమున॥ 28॥

క॥ పితృదేవతాజ్ఞ చేఁబుత । మతియగు తనప్రాణసఖికి * మాంసముఁ దేఁగా
పతిబహువిధసేనా సం। వృతుఁడై విపినమునకరిగె * వేఁదుకమీఱన్॥ 29

సీ॥ పార్వణచంద్రబిం*బస్ఫూర్తిఁదనరారు, కలికిముద్దుమొగంబు * చెలువుఁదలఁచి
వికసితోత్పలకాంతిఁ*బ్రకటింపఁగాఁజాలు కొమ్మకన్నులచాకచక్యముఁదలఁచి
మదవిలసత్కోక * నదయుగ్మములఁగేరు-మగువచందోయిసోయగముఁదలఁచి
పటుసింహమధ్య వి*భ్రమభాసురంబైన-తరుణిలేఁగౌను చం*దమ్ముఁదలఁచి

గీ॥ మత్తగజయాన విభ్రాజ * మానములగు
నతివనడకలలోనిసొం * పలఁ దలంచి
మారశరపీడితంబైన * మానసమున
వివశతవహించె నందుఁబ్ర * ధ్వివిభుండు॥

వ॥ అట్టివట్టరాని తమకంబున గుట్టుచెడి యాజగజెట్టి రేతస్యందం బగుటయు
నాయమోఘవీర్యంబు నొకయజీర్ణపర్ణపుటంబునఁ బెట్టియంత॥ 31

గీ॥ నగముపైనున్న యొకకాకే * నంబుఁ బిలిచి
తానకకుండగ దానికు * త్తుకనుగట్టి
పదిలముగనేగి దీనిను * పత్నికిమ్ము
శీఘ్రముగఁ బొమ్మటంచును * జెప్పిపుచ్చె॥ 32

గీ॥ ఆఖగంబంత రాజకా * ర్యాభిలాషి
యగుచు బహుబాగరూకత * నరుగుచుండ
మార్గమున పర్ణపుటమును * మాంసమనుచుఁ
దలఁచితాఁకెను మఱియొక * పులుఁగుదాని॥ 33

ఉ॥ తాఁకికఠోరఖడ్గశిత * ధారల మీఱునఖంబులన్ మహో
ద్రేకముతో విహంగముత * దీయశరీరముఁ జీఱినద్దియున్
వీఁకఁ దొలంగనీక యుధ * వీథిఁదలంపడిజన్యపాండితీ
రేకతదానిమేనఁ బొన * రించెను గంటుతనానగంటులన్॥ 34

సీ॥ జంటిగవ లెవద్ది * మింటఁబర్వఁగతోడ- నొగనికొన్నిన్నదాని * నెత్తిదన్ను
మినుదారిమండిఖా * మికిఁ దారఁగానద్ది - పెనఁడిగ్గినుగ్గుగా * వించుచుండు

నంతనద్దియుధైర్య * మంతరింపఁగనీక - తెఱగంట్ల తెరువంటఁ * దఱుముచాని
నదిచాన నెదఁగోవ * మానజాలక వచ్చి - క్షితినాథగంబున * క్షితినిఁ బడియె॥

గీ॥ సొక్కటికి నొక్కి తెదురేగి * యుక్కుమీఱ
నొక్కి ఘోఁ దాఁకు రెక్కలు * చిక్కువడఁగ
దక్కి యొక్కపక్కి నొక్కపక్కి * త్రొక్కుచుంపు
మిక్కుటంబయి నేరము * సిక్కటిల్ల॥ 35

క॥ ఈరీతిఁ బోరునెడ వృథి । వీరమణిప్రాణపథుని * వీర్యము యమునా
వారిం బడెఁ దత్పునర్భవ । ధారాదారితసముద్ధ * తలగళితంబై॥ 36

గీ॥ అంతనానీటఁ గలమత్స్య * కొంత యొర్తు
తిండి కెత్తియగుటాడును * నుండియందుఁ
బడిన బిందుద్వయంబును * గుడిచెనంత
రంగమానందకాష్ఠమీ * ఱంగనధిప॥ 37

వ॥ ఆ రాజన్యవీర్యంబు మోఘంబగుటఁ జేసి యామత్స్యగాంతకు గర్భంబయ్యె నం
త కొంతకాలంబునకు సంపూర్ణతేజో విరాజమానమగు నామీనంబొక పల్లె
వాని యానాయంబునఁ జిక్కువడిన నఖండపరిమితానంద కందళితహృద
యారవిందుఁడై గృహంబునకరిగి॥ 38

క॥ ధీవరతఁ జెన్ను మీఱెడు । ధీవరతనయుఁడు తడుదర * దేశమ్మున నే
దో వస్తువున్న దనితన । భావంబున నెంచి దానిఁ * బెఱిఁ దఱిగెన్॥ 39

సీ॥ మునిముసినగవుల * ముద్దు వెన్నెలఁ గాయు మురిపెంపు మోముచం * దురులలోడ
విడచిన కెందమ్మి * విరులచందమునొందు - మడఁచినకన్నుల * చెడఁగులోడ
పాలనిగ్గులసుడెం * పలఁగొట్టుసమకట్టు - పసమించు మేనుల * మిసిమిలోడ॥

గీ॥ పొడమిరిరువురు శిశువులు * భూతలేంద్ర
చందనూనుయుగ్మంబియు * సందర్శిమందు
బుట్టినట్టుగ నప్పాని * పొట్టనుండి
పల్లెవానిని మోదంపు * వెల్లిఁ ద్రోసి॥ 40

క॥ జాలరివాఁడును వారల । పోలికఁ గని వీరు రాజ * పుత్రులటంచున్
బోలిచి పాల్పొవవిఁ జే । జాలముఁ జేయక రయి దాశ * జనపతి కొసఁగెన్॥ 41

ఆ॥ అంత దాశరాజు * సంతోషచిత్తుఁడై - జాతకర్మ ముఖ్య * సకలవిధులఁ
జేర్మిసలిపి వారిఁ * బెంపించె పాత్రుల - చేత సౌఖ్యగతులఁ * జెన్నుమీఱ॥ 42

వ॥ అట్టిరమణి॥ 43॥

క॥ అడవింటి తాని చెలికై । యడిమెయి మాపాదయు మడఁతి * వగిదిగనొప్పా
రెడి దాశరాజు పెంపుడు । పడఁతికి జవ్వనముచిగురు * పట్టదొడంగెన్॥ 44

ఉ॥ ఆచిగురాకుఁబోఁడి నవ * యౌవ్వనవేళల నేర్చినట్టియా
యాచిఱునవ్వులా నడల * యందములా గరువంపుచందమా
యాచెలువుల్ వెలయల్ పలుకు * లావలకారి వెలుగంగుచూపులున్
జూచినఁగాని నేనుడువఁ * జోద్యమటందురిఁ కేమిచేయుదున్॥ 45

క॥ అమ్ముద్దుగుమ్మహస్తము । కంబుజరేఖానుషంగ * కలితంబగుటన్
నెమ్మనమున నంబుజనా । ళమ్మని నిక్కువముగాఁద * లంపగవచ్చున్॥ 46

క॥ పడఁతి గళవిభ్రమమునే । ర్పఁడ జూచినయంత శంఖ * వర్గంబెల్లన్
వడవడవడవడవడఁకఁగ । నుడివడిహృదయమ్ముదుమ్మ * చుట్టులుతిరిగెన్॥

సీ॥ హరిపద సౌభాగ్య * మందు వెంతని కాను-నరసీజముల నెక్క * సక్కు మాడె
భూధర విజయంబు * పొడఁగాంచి చందోయి యమశేంద్రుతోడన * యాటలాడె
పల్లవ నశ్యనం * పదలవంబని మోవి-జారనారులఁ గేలి * సలుపఁగడఁగె
రాజజయ శ్రీవి * రాజితమ్మయి మోము-పరశురాముని భంగ * పాటుఁదలఁచె

గీ॥ పదములరుణాంబుజ ప్రభా * స్పదములయ్యెఁ
గగములంభోజదళ మోద * కరములయ్యె
శ్రుతులు శ్రీకారకలితవి * శ్రుతులఁ గనియెఁ
గంబుకంధర నడిజవ్వ * నంబు తఱిని॥ 48

చ॥ అఱవతనంబునం గొఱలు * నమ్ముద చన్నులు పొన్నుకొండకున్
గరువముఁ బావవేసుర న * గంబనుమన్ననఁ గాని వింధ్యభూ
ధరములకుంభసంభవుని * దర్శనమన్న వమూని భూమిపై
కొఱగక యున్న నున్నతికి * నోర్చునె పేర్చియషంగఁద్రొక్కవే॥ 49

చ॥ తమతొలిబాములందునను * దమ్ములుఁ దుమ్మెద లేమినోచనో
కొమరు చెలంగఁగా బయిటి * కుండలుఁ గొండలు దంటి నేమి పు
ణ్యముఁ గడ ముట్టఁ జేసెనొకొ * నీలము లేమి పనుల్ పొనర్చెనో
కమలను గంధియంగముల * కైవడిఁదామును రంగు మీఱఁగన్॥ 50

సీ॥ గజనిమ్మపండ్లతోఁ * గలహించు గుబ్బలు-దబ్బపండులతోడ * దెబ్బలాడె
కలువరేకులతోడఁ * దులఁదూఁగు కన్నులు-తమ్మిపూవులతోడ * దొమ్ములాడె

సింహమధ్యమ్ముతో* చెలులాడుశేఁ గాను-గగనభాగమ్ముతోఁ * గయ్యమాడె
దొండపండులతోవి * దండించుకెమ్మోవి-పలుదకెంపులతోడ * వాదమాడె

గీ॥ పూర్ణశశితోడ నెమ్మోము * మాటలాడె
సకియగోళులుదుర్వులతో * జగడమాడె
చెలఁదిపిఱుఁదులుఁ దిన్నెలు * వియ్యమందెఁ
గంబుకంధర నదిజవ్వ* నంబుతతిని॥ 51

చ॥ కలికివిశాలనేత్రములు * కల్వలచెల్వము గెల్వఁజూచెనా
చెలఁదుక నెమ్మొగమ్ము సర * విందముచందము నందముం గనెన్
మెలఁతుక మేని చాయలును * మేలిమిడాలును మేలమాడె నా
చిలుకలకొల్కి రూపమతి * చిత్రముగాఁ దనరారె నత్తఱిన్॥ 52

ఉ॥ చెక్కులయందు లేనగవు * చిందఁగ మారుని విండ్లతీరునన్
బొక్కుముమీఁటు కన్బొమలు * సొంపుగఁ దాండవమాచరింప నా
చక్కని కొమ్మతుమ్మెదల * చందమునొందిన వాలుచూపులన్
జిక్కులఁ బెట్టె కామిజన * చిత్తమృగంబుల నెల్లనత్తఱిన్॥ 53

వ॥ ఇట్లు నవయౌవన విరాజమానయగు తనకూఁతుం దాశరాజు తనకులక్రమాగతంబైన యమునానదీ తరణంబున నియమించుటయు నక్కన్నియ పిత్రాదేశంబున నట్టుచేయుచుండ నొక్కనాఁడు॥ 54

సీ॥ పుటతప్తకాంచనం*బును బోలునెమ్మేనఁ-గాషాయవస్త్రంబుఁ*గప్పినాఁడు
పింగలారుణమయిన * పృథుజటాజూటంబు-నెట్టనెత్తవలఁ * జుట్టినాఁడు
ముఖకంఠపార్శ్వాది *ముద్రలం దెల్లెడఁ-బొందుగా ధారిత*లందినాఁడు
పొలుచు రుద్రాక్షపుఁ*బోగులశ్రుతులందు-సంచితంబుగ ధరి*యించినాఁడు

గీ॥ దండమొకకయి పెర్కొక్క * మండలంబు
మూఁపుపైనిజ్జీర్ణచర్మంబు * బూనినాఁడు
నిఖిలతత్త్వావబోధని * నిర్మలాంత
రంగుఁడైనట్టి యొకమౌని * పుంగవుండు॥ 55

సీ॥ బహువిధఫలపుష్ప*భాసమానానూన-భూరుహప్రకరవి * భూషితంబు
శుకకేకి శారికా * పికమనోహరఖగ- కలకల ధ్వానప్ర * కాశితంబు
సకలప్రసూనర * సాస్వాదనోన్మత్త-కమనీయభృంగ * ఝంకారితంబు
చందనానోకహ * స్పంద గంధిలమంద-పవమానడింబవి * భ్రాజితంబు

గీ॥ మంజులనికుంజ పుంజాభి * రంజితంబు
పటుతరామేయ భవపాశ * బంధమోక్ష
దక్షనిరప్రవ్వాహాది * దారితంబు
ఘాతకలుషంబు యమునాన * దీతటంబు॥ 56

క॥ చేరఁజని యమ్మహానది । తీరంబునఁగొంత సేద * దీఱఁదదీయో
దారజలంబులఁ దృప్తుండై రహిఁనేగంగఁ దలఁచి * యాతండంతన్॥ 57

## ఆశ్వాసాంతపద్యములు.

విచిత్రవృత్తము॥ మహారాజరాజా మహీజామనోజా
యహీనాఢ్యతల్పా యహీనాభ్రకల్పా॥ 58॥

క॥ కుందశరదిందుచందన । మందారాంబుధినిమగ్న * మందరసంప
త్తుందిలకీర్తీయభినవ । కందర్పసమానమూర్తీ * ఖలనమవర్తీ॥ 59

ఉ॥ దండితచండదానవక * దంబ సదంబక భూమిమండలా
ఖండలఖండిత త్రిపుర * కంటక ధర్మసుధర్మ కర్మఠా
కుండలి మండనప్రణయి * కోమలమానస మానసాదరా
భండనపండితా సుకవి * ఖాండవరాట్క్రమణక్రమోద్ధతా॥ 60

ఇది

శ్రీసీతారామ కరుణాకటాక్ష సమాసాదిత సంస్కృతాంధ్రపరిపా
ట్యో శేటినారాయణశాస్త్రిపుత్ర వేంకటరామశాస్త్రి
ద్వివేదిరామచంద్ర బుధేంద్రపుత్ర రామకృష్ణ
శాస్త్రి ప్రణీతంబయిన వ్యాసాభ్యుద
యంబను శృంగారప్రబంధమ్మునఁ
ద్వితీయాశ్వాసము
సమాప్తము.

శ్రీ శాంకర్యైనమః

# వేంకటరామకృష్ణీయము.

## వ్యాసాభ్యుదయము.

### తృతీయాశ్వాసము.

క॥ శ్రీంకర సీతాముఖనాళీకరవీ! మునిజనావన * శ్రీకల్పకభూ
జా, కరివరవరదయశ । శ్రీకరసంశ్లిష్టవామ * సీతారామా!॥ 1

వ॥ దేవా! యవధరింపుము మనంతర కథావిధానం బెట్టులనిన నమ్మహాముని
తీరసమీపంబునకరిగి యచ్చట॥ 2

సీ॥ పున్నమచందురుం*బోలునెమ్మోమున- బొలుపుగాఁజిఱుచెమ్మ*టలు చెలంగ
గండుతుమ్మెదలచా*ల్గ్రంబుదిలకురుల్-కమనీయగండభా*గములఁ దూల
సింగారమయినమేల్*బంగారువర్ణ్యాంట-వటువుగుబ్బలగుట్టు *బైటఁ బెట్టఁ
దత్తరంబునజేరి * గుత్తులనలరారు- కంకణంబులు గల్లు * గల్లురనఁగ
గీ॥ డంబుమీఱినమురుని క * టారియనఁగఁ
బధికజనులకు నెల్లన * బ్రంబుగాఁగ
నావదాటింపుచున్న ది * న్నాణమైన
ఱేఁతవాయంపుజాలరి * లేమగాంచె॥ 3

ఉ॥ గల్లురు గల్లురంచుఁ గర * కంకణముల్ క్వణియింపుచుండఁగా
మెల్లననోడఁ ద్రోయుగవ * మీనవిలోచనఁ జూచినంతనే
జల్లుమనెన్మనమ్మునని * చంద్రునకుం దదనంతరంబమే
నెల్లఁ జెమర్చెఁ గంపముద * యించెఁ బదంపడియేమిచెప్పుదున్॥ 4

క॥ శీతలవాతాంకూర । వ్రాతముపోతరముమీఱ * వచ్చెవయింటన్
చేతుల చేతంచెనఁగఁగ । చేతంబవ్వారికయినఁ ' జెదరకయున్నే॥ 5

ఉ॥ చల్లనికమ్మతెమ్మెర వ * సంతునకుం బయ్యెదలాగుచుండఁ గా
నల్లనఁ దొంగితొంగికను * నంగవచస్థవ జూడమానిక
దొల్లిఁటిధైర్యమెల్లఁ జెడ * దోడనెకూడఁ దలంచనారయా
పల్లవపాణులంగనని * పట్టునమౌనుల గుట్టు సాగడిక॥ 6

గీ॥ తప్పటంచునుగురువులు * చెప్పలేదొ
ముక్తికామినికన్న యీ * ముగ్ధమేలొ
తపసినిదినాకుఁ దగదని * తలఁపదాయె
నా చెలువపొందు జడదారి * రాదకందు॥ 7

వ॥ మఱియు॥ 8॥

సీ॥ గురుకులవాసానఁ * గొన్నవిద్దెనుగుంటఁ- బెట్టియాపైగంటఁ * గొట్టినాఁడు
పటుతరాభ్యాస ల*భ్యంబైనయోగంబుఁ-జిటికలోమటుమాయఁ*జేసినాఁడు
తనయదృష్టమున జి*క్కినజ్ఞానమెల్లను- రూపుపోవగమచ్చ * మాపినాఁడు
పవలు రేయియుఁగష్ట*పడిచేసినదపంబు- గడియలోగంగలోఁ*గలిపినాఁడు

గీ॥ ధైర్యమెల్లను బోవగఁ * దఱిమినాఁడు
దిట్టమగుబుద్ధిఁ జెడఁద్రోవఁ * జెట్టినాఁడు
మిన్నయైనట్టి జాలరి * కన్నెఁగాంచి
భాసురతపోనురాగి య * ప్పరమయోగి॥ 9

క॥ తుంటవిలుదంటదైవము । వంటిబుషిక గడ్డిపరక * వలె నెంచుచువాల్
గంటియవలంబనంబున । నొంటరియైయతనిమీది * కొక్కపరియుతికెక్॥10

సీ॥ నిశ్చలుండై తపో*నియతినుండెడివాఁడు- మానినీధ్యానంబు * బూనివాఁడు
క్షతిలేని మోక్షసౌ*ఖ్యంబుఁగోరెడువాఁడు-క్షణసుఖంబునని*చ్చఁగొనినాఁడు
ప్రత్యూహంబును పేద*పరనఁజేపడివాఁడు కమలాక్షిఁబొగడంగఁ*గడగినాఁడు
భవపాశబంధమ్ముఁ*జాసియుండెడివాఁడు యువతిచూపులనుజి*క్కుపడినాఁడు

గీ॥ నిర్మలస్వాంతవంతుఁడై * నెగడువాఁడు
మందుఁడైచిత్తచాపల్య * మందినాఁడు
అహహ పలరాజుచర్యల * నభినుతింప
హరిహరహిరణ్యగర్భుల * కైనఁ దరమె॥ 11

వ॥ ఇట్లు తదధీనమానసుండై యయ్యాని తనమనంబున॥ 12

గీ॥ ఎవతె యీకన్నెమిన్న పూ * ర్ణేందువదన
కులుకుచున్న దీ మరునిరా * చిలుకవోలెఁ
వహ్వరేదీనిసొగసెన్న * వశముగాదు
నలువకైనను వేనోళ్ళ * చిలువకైన॥ 13

సీ॥ మోము చంద్రునివక్ర * ములనెంచుటయు కాక తమ్ములతోఁ డంబ * తమ్ములాఁడు
చనుదోయి పువ్వుగు * చ్ఛములఁ బోలుట కాక జక్కవకవ నెక్క * సక్కెమాఁడు
కురులు తేటులతోఁడ * సరసమాడుట కాక కటికి చీఁకటికిని * కక్కటులదిద్దు
కనుదోయి కల్వల * గారవించుట కాక హరిణులతోడ స * య్యాటలాడు
గీ॥ నానఁ నంపఁగి మొగ్గల * నీసడించు
దియ్యకెమ్మోవి తేనెలో * వియ్యమందు
నలరువిలుకాని చేతిరా * చిలుకవోలెఁ
బలుకు పలికిన నిదముద్దు * లొలుకుగాదె॥ 14॥

క॥ బంగారు బొంగరముల న । రంగారెడు దీని చనులు * రంజిల్లఁగాఁ డగ్గ
బొంగి కవుంగిలి నానఁగను । నంగజసామ్రాజ్యలక్ష్మి * కధిపతి యౌవఁడో॥ 15
ఉ॥ చిన్నతనంబునుండి పరి * శీలనముం బొనరించినాఁడనీ
చెన్నటి వేదజాలములఁ * జీరొక పన్నమునన్దుఁ గాసియూ
కన్నియమిన్న తేనియలఁ * గారెడు పల్కులతోడ నుద్దియౌ
వన్నియ కెక్కినట్టి యొక * వాక్యముముచ్చటకైననున్న దే॥ 16
సీ॥ నిక్కంబుగా మోక్ష * మొక్కచోనున్న దే- కామినీరత్న సం * గమము కాని
మేరుపర్వతమునా * వేఱొక్కఁడున్న దే- తొయ్యలి గుబ్బచం * దోయి గాని
పీయూషరసమంచుఁ * బెరచోటనున్న దే- పడఁతుక యధరబిం * బమునఁ గాని
మహితీరవంబంచు * మారొక్కఁడున్న దే- తరుణీమణీ మణి * తంబుగాని
గీ॥ అకట తెలియక కపట వే * దాంతములను
జదివి మిథ్యాసుఖాసక్తి * మది గలంచఁ
గాలమెల్లను వ్యర్థము * గాఁ గడపితి
నయ్యయో యచ్ఛవైదిక * మందచదివి॥ 17

క॥ ఏకక్రీడజాలరివంగడ । మేకక్రీడయ్యామునిభారక్రీ * మీరెంటిటికిన్
జక్కీడురుదారుకకికొని । నిక్కీవము వచింపుయాము * నీకుతీవదనా॥ 28

మ॥ అనమందస్మితసుందరాస్యయగుచు * ల్లాంభోజపత్రాక్షియుం
దనవృత్తాంతముఁ బూసగ్రుచ్చినయటుల్ * ధాత్రీముఖజ్ఞాతముల్
మునిచూడామణిలోడబాకిడియున * మోహద్ధంబసాధంబుగా
వినియంతంతనదివ్యదృష్టిగనియు * విప్రోత్తముండిట్లనెన్॥ 29

ఉ॥ చిత్తమునందునందియుముఁ * జెందుచుఁ గుందుచునుండనేటికిన్
బుత్తడిబొమ్మనీవయిని * బొందుగఁ జెంతము నిల్పినాఁడనే
నిత్తఱినీదుదాసునిగ * నేలెదొ లేక పరిత్యజింతొ నీ
చిత్తమునాదుప్రాప్తమిఁకఁ * జెప్పఁగనేటికి మాటిమాటికిన్॥ 30

వ॥ అనిననప్పంకజాక్షి సాశంకగ్లైతనమునంబున నిట్లనియె తలిక్రీంచె॥ 31

గీ॥ ఏలకోయిమ్మహాముని * యిట్లుపలుకు
పారమార్థికములఁ దలఁ * పంగఁబోఁడు
రాగహీనునకిట్టివే * లాగుగలిగె
నేమనుచునేరువచియింతు * నీతనితోడ॥ 32

క॥ కాదనినవగానియలుగుఁగ్రబ । మాదంబగు దానసకల * మాన్యులుమనుతిం
కేదిగతియనుచుఁ జింతా । మేదురమగుమనముతోడ * మెల్లననియెన్॥ 34

మ॥ అనఘా! యోగతిఁ బలక్రీఁ గాఁ దగునె స * త్యజ్ఞానసంపన్నుఁడౌ
మునిగేదానిబొందెనన్న జనులా * మోదింతురేజ్ఞాని వ
య్యనుమోహంబునఁ జిక్కిఁగాఁ దగునెయు * య్యోయింత చింతింప కిం
దును మోహాత్ముఁడు ముక్తినొందుటకుఁ బా * త్రుండౌనె మానీశ్వరా!॥ 34

క॥ తపసివిసతతము వరమా । ర్గపరుఁడవిదిగాక నిఖిల * ధర్మజ్ఞుఁడవీ
వపలేంద్రియవశ్యుఁడవై । దెపరంబున కెగ్గఁగాదె * దేవా! చెపుమా॥ 35.

ఆ॥ జన్మమందునగ్రి * జన్మంబునందిలి-నిఖిలధర్మశాస్త్ర * నిపుణ్యమరివి
అకటదాశకన్య * నాశించెదేమిది-కాంచిచూడఁబా * తకంబుగాదె॥ 36

క॥ జన్నంబులఁబొనరిచికడుఁ । బున్నెంబుగణించినట్టి * ప్రోడవువిషయా
పన్నుఁడవె యీజాలరి । కన్నెంగవఁగూడఁజెల్లుఁ * గాజడదారీ॥ 37

చ॥ చదివినవేదశాస్త్రముల * చక్కనిద్రొక్కకేమువుంబనల్
వదలిచరింపనీకుఁ దగ * వాతెగుశ్రానితవంబుబాదెలో
బోధిపినయత్నరుంబలెన * మూలమహామాఁవఁదలంచినావె యీ
మదవతికారణానమటు * మాయలబావఁడపాపమందదే॥ 38

ఆ॥ చదువలేదెయువని * షత్తులమాసింద్ర-వినఁగలేదెశాస్త్ర * విషులనెల్ల
అంటముట్టరాని * యగ్గిదయ్యముతోడ-జంటయొరులవాలు * గంటిగాదె॥

గీ॥ మేలుకీడులఁ దెలిసిన * మేటివీవ
మంచిచెడ్డలనెఱుఁగని * మగువనేను
పూనినిమదిద్దఁగాఁజాలఁ * గానివరుల
సతులఁగయికొన్నఁ బరలోక * గతులునున్న॥ 40

క॥ మునియఁటతానాకజాలరి । వనితంగవఁగూడెనంట * వహ్వారెయుని భూ
జనులెల్లనిందఁజేయం । గనివినియేవగిదిసైఁవఁ * గలవోచెపుమా॥ 41

చ॥ మునులమహాత్ములెవ్వదున * మోఘమువారలవీర్యమంచు నే
మునువినియున్నదానమిముఁ * బోలినపెద్దలసేవకర్మిఁగా
ననుజెడిపోవుకన్నియత * నంబుమనంబుననెంచిచూడుమా
మునికులసార్వభౌమకయి * మోహ్పదనన్ననుగ్రహింపుమా॥ 42

గీ॥ మౌనిశేఖరయిఁకనాక * మాటవినుము
పేర్మినీకోర్కిదీరిన * పిదపనీదు
దారినీవేగఁ గైననా * దారిఁజూచు
వారలెవ్వరుమునికుల * వర్య! చెపుమ॥ 43

వ॥ అనినంబరాశయుండు శంబరాంతకాంబకంబులంబీడితుండై సుట్టుచెడి యా
జాలరివట్టికిట్టులనియె॥ 44

ఉ॥ జాలముచాలునీతిపథ * చాతురిరీతులఁ గట్టిపెట్టుమీ
కాలవశంబునంగలుగు * కర్మములెల్లనవశ్యభోగ్యముల్
బాలహా! పెక్కులేటికిఁకఁ * బల్కెదనీయధరామృతంబు నేఁ
గ్రోలకతాళఁజాలఁగయి * కోగవవే మదహంసగామినీ॥ 45

చ॥ అనుచు మునీంద్రుఁ డెంతయు న * నంగశరాహతిమూఢచిత్తుఁడై
యనుపమసౌకుమార్యవిభ * వాతిశయంబున నాత్మ దానిఁ గై
కొని కదియంగఁ దీసి యవి * గాఢముగాఁ గవుఁగింటఁ జేర్చి చ
య్యనమధురాధరామృతము * నానఁగ నిచ్చఁ గొనంగ నంతటన్॥ 46

గీ॥ స్వేదబిందువు లెల్లెడఁ * జిందువందఁ
దనువు రోమాంచమున భాసి * తమ్ము గాఁగ
భయము లజ్జయుఁ జీకాకు * పఱువవాలు
గంటియుల్లనె గద్గద * కంఠియగుచు॥ 47

ఉ॥ చాలును మౌనిశేఖర వి * చార మొకింతయు లేదు నీచతన్
జాలరిలేమఁ గూడుటరయో * సజ్జనమాన్యము దానిలో నదీ
కూలమునందు నమ్మునన * గూఢముగా ననుఁగూడఁ బాడియే
మేలును కీడు లేదెయిటు * మేరను మీఱి చరింపఁ జెల్లునే॥ 48

గీ॥ మామకంబైన దేహంబు * మలినమగుచుఁ
జేపకంపున మీఱుటఁ * జేఁతఁ గాదె
కల్లగా కుండ నను మత్స్య * గంధి యండ్రు
జాపలకుఁ జేపవాసన * వదదు గాదె॥ 49

వ॥ అనిసలీలంబుగాఁ బలికిన నమ్మునిచంద్రుం డిట్లనియె॥ 50

క॥ ప్రకృతివిచారతఘనుఁడై । సకలాగమవేత్తయయి ప్ర * శస్తములను దం
డకమండలువులఁ గొనియె । సకినీకొక సుతుఁ డగల్గు * సన్మునిసుతుఁడై॥ 51

గీ॥ కన్యకాత్వంబు దానభం * గంబుఁ గొనదు
కురువంశంబునకుఁ బెద్ద * కోడలివయి
వేయి విధముల భువిఁ గీర్తి * నీయవగుచు
నలరెదవు నిక్క మిది నమ్ము * మామృగాక్షి॥ 52

వ॥ అని మఱియు నిట్లనియె॥ 53

క॥ నీతనువియ్యది మొదలుగ । నాతిరో ! మృగశాభిపుల్ల * నళినామరభూ
జాతసుమగంధబంధుర । మై తగు తావులను జిమ్ము * మామడవరకున్ 54

క॥ అనుమఁబరాశరమునియా। వనజాయతనేత్రకొక్కె * వరమిచ్చెమదా
ననెమత్స్యగంధియనుపే। ర్జనగంధియనంగఁబఱఁగె * జనపతివింటే॥ 55

వ॥ అంత॥ 56

క॥ ఆజటాధారియమునాళ * దీవలమునఁ
దానమొనరించి యాత్మజుం * దమునవనిల్పి
వార్ధియాప్సితదేవతా * వందనంబుఁ
జేసిప్రార్థించెనభిమత। సిద్ధిగాఁగ॥ 57

క॥ ఆతనితపఃప్రభావము। చేతన్ రవిజీర్ణుఁడయ్యె * జెచ్చెరబ్రహ్మ
జ్ఞాతలకునసాధ్యంబగు। నేతలఁపఁగనెట్టికార్య * మేనియుఁబుడమిన్॥ 58

చ॥ మునిజనవందనీయుఁడతి * మోహభరంబునదాశకన్యకన్
మనమునఁగొంకులేకదిన * మధ్యమునన్యమునానదీతటం
బునఁగలయంగఁ బూనెమన * బోఁటిఘనులకున్ రాదుపాతకం
బనుమదిఁ బోలెసూర్యుఁడప * రాచలగోచరుఁ డయ్యెనయ్యెడన్॥ 59

క॥ కడుఁగడుననురాగముచే। నడరినవసుహీనుఁడగుట * నాయాదిత్యున్
బడమటికడయనిరాఘుడువెల। వడతివియద్గృహమునుండి * వడినడిపించెన్॥

సీ॥ హరిహేతిహూతివి * స్ఫురదవియోగాగ్రయోగజాతవేదశ్శిఖా * జాలమనఁగ
దుంగాస్తనగబృహ * ద్భృంగపాపతదుత్పతంగసత్రివద్రక్త * ధారలనఁగ
పేయమైరేయపా * నీయపానారుణీ కృతవారుణీనేత్ర * ఘృణులనంగ
యామినీకామినీ * సోమాంతరస్థలా శాబలాభృతతిర * స్సరిణియనఁగ

గీ॥ ఘనజటాటీరనాట్యని * ర్గళితమైన
స్వర్ణదీస్వర్ణజలజర * జంబనంగ
సర్వజనులకులోచన * పర్వమగుచు
సాంధ్యరాగంబుదిక్కుల * సంస్ఫురించె॥ 61

ఉ॥ జక్కవపక్కికూటువల * సంతసమంతయు నుక్కెవింటిఁజే
రుక్కునఁ జక్కఁబట్టిమరుఁ * డొయ్యనఁ దొయ్యలిఁ వాయువారిపై
నెక్కుడెఁదమ్మికొమ్మమొగ * మెక్కుడుచొక్కుదకెక్కఁగక్కునన్
మిక్కుటమైనచీఁకటులు * మిన్నును మన్నును గ్రమ్మె నెయ్యెయిన్॥ 62

చ॥ కుసుకుసుముద్వ్రతీకుటిల * కుంతలఁజేతులఁదట్టితేవుచుఁ
గునగునలాడువధ్వనులఁ * గొవ్వునుబట్టి షరాభవింపుచుఁ
గనదభిసారికాంగనలు * గట్టిగఁదిట్టఁగఁ గొంగుబట్టుచుఁ
దనరెనుతూర్పుదిక్కున సు * ధాకరుఁడంతఁగలానయుక్తుఁడై॥ 63

వ॥ మఱియు నాతనిమంత్రోదకప్రభావంబునం జేసి వివిధమణిమయవేదికలు న నేకఫలపుష్పమంజుళవనంబులును సర్వసమారాధనసాధనంబులును బొడముటయు॥ 64

క॥ పొంగినమనమున నాముని। పుంగవుఁడా సరసిజాత * ముఖిఁగూడి ముదం
బుంగనియచ్చోవివిధా। నంగసుఖాంభోధిమగ్నుఁ * డయ్యెనృపాలా॥ 65

గీ॥ జ్ఞానిమైనపరాశర * మౌనియేడఁ
గలుకుజాలరికన్నెను * గూడుకేవ
అడవియుసిరికికడలియు * ప్పను జెప్ప
నట్టిసామెతలిట్టివి * యామహీశ॥ 66

వ॥ అంతఁ బ్రభాతంబగుటయు నమోఘంబయిన యమ్మునివీర్యప్రభావంబున నంతర్వత్నియైన యమ్మత్స్యగంధిక సద్యోగర్భంబున॥ 67

శా॥ మోదంబందసమస్తదేవతలు నా * మోదింపమౌనీశ్వరుల్
రోదోభాగమువారివాహచయసీ * రోధంబుగాఁగాములుం
ఖేదంబింమకలేక యుచ్చగతులం * జెంపొందివర్తింపగా
వేదవ్యాసుఁడుపుట్టెఁ గిన్నరవరుల్ * విభ్రాంతులైయున్నఁగన్॥ 68

క॥ జనవరధరలోవ్యాసుని। జననమువ్రాసినను వినిన * జదివినసౌఖ్యం
బునుబొందిపాపబంధము। లనుబాసినరుండు మోక్ష * లక్ష్మింజెందున్॥ 69

ఆశ్వాసాంతపద్యములు.

మాలిని.

సుగుణగణనిధానా * సూర్యవంశప్రధానా
నిగమగదితకీర్తీ * నీలమేఘాభమూర్తీ

జగదుపకృతికర్తా * సర్వలోకైకభర్తా
ఖగపరివృఢవాహః * కాంక్షితార్థప్రవాహః॥

ఇది
శ్రీసీతారామ కరుణాకటాక్ష సమాసాదిత సంస్కృతాంధ్రపరిపా
టీ్యలేటినారాయణశాస్త్రిపుత్ర వేంకటరామశాస్త్రి
ద్వివేదిరామచంద్ర బుధేంద్రపుత్ర రామకృష్ణ
శాస్త్రి ప్రణీతంబయిన వ్యాసాభ్యుద
యంబను శృంగారప్రబంధమ్మున
తృతీయాశ్వాసము
సమాప్తము.

కవితానుబంధము 7

శ్రీ

# పరాశరస్మృతి.

ఇది

రాజమహేంద్రవర సర్వకళాశాలా సంస్కృతపండితోపాధ్యా

యగాఖండి వ్యాసమూర్తిశాస్త్రి

విరచితము.

మొదటికూర్పు, ౧౦౦౦




కాకినాడ :

సుజనరంజనీ ముద్రాక్షరశాల.

1913.

వెల రు. 0-4-0.



# శ్రీపరాశరస్మృతి.

## ఆంధ్రము.

## ఆచారకాండము.

### ప్రథమాధ్యాయము.

ఋషులు పూర్వము హిమవత్పర్వతశిఖరమ్మున దేవదారువన గృహమున నేకాగ్రత గలిగి కూర్చుండిన వ్యాసుని నో సాత్యవతేయా! ఈ కలియుగంబున సకలకు మే లొనర్చు శౌచము, ఆచారము అనెడి ధర్మమ్ముల బూర్ణముగఁ దెలుపు మని యడిగిరి.

ఆ మాట విని శిష్యపరివృతుఁడును వేదధర్మశాస్త్రవిచక్షణుఁడును నగు నా మహర్షి "నే నన్నికలిధర్మమ్ముల యథార్థ మెఱుఁగను. ఎట్లీ ధర్మంబు వివరింతును? మా తండ్రియె యడుగఁ దగును" అని ప్రత్యుత్తర మిచ్చెను. అనంతర మా మును లందఱు ధర్మవిశేషము లెఱుంగఁ గోరి వ్యాసమునిని ముందిడుకొని బదరికాశ్రమమునకుఁ బ్రవేశించిరి. అది యెల్లపుష్పలతలతో నిండినదియుఁ బండ్లచేతఁ బూలచేత నలంకరింపఁ బడినదియుఁ బ్రవహించు నదులతోఁ గూడినదియుఁ బుణ్యతీర్థములచే శోభించునదియు మృగపక్షిధ్వనులచే నిండినదియు దేవాలయములచే నావరింపఁ బడినదియు యక్షగంధర్వసిద్ధుల యాటపాట

లచే నలంకరింపఁ బడినదియు నై యుండెను. ఆ యాశ్రమంబున ముని సభామధ్యంబున మునిముఖ్యులు పరివేష్టింప సుఖముగఁ గూర్చుండిన శక్తిపుత్త్రుఁ డగు పరాశరుని వ్యాసుండును మునులును జేతులు మోడ్చి ప్రదక్షిణనమస్కారములొనర్చి స్తుతివాక్యసుమమ్ములఁ బూజించిరి. దానిచేఁ బరాశరముని మనమ్మున సంతసించి కూర్చుండుఁడియె యాదరముతో "సుఖముగ వచ్చితిరా" యని యడిగెను, కుశలమునఁ గొఱఁత లేదని వ్యాసుం డిట్లడుగం దొడంగెను. భక్తదయాళూ! తండ్రీ! నాభక్తిఁ గని యైన నెయ్యమ్మున నైనను గ్రహింపఁ దగుదును. ధర్మముల నుపదేశింపుము మనువు, వసిష్ఠుఁడు, కాశ్యపుఁడు, గార్గ్యుఁడు, గౌతముఁడు, ఉశనసుఁడు, అత్రి, విష్ణువు, సంవర్తుఁడు, దక్షుఁడు, అంగిరసుఁడు, శాతాతపుఁడు, హారీతుఁడు, యాజ్ఞవల్క్యుఁడు, ఆపస్తంబుఁడు, శంఖుఁడు, లిఖితుఁడు, కాత్యాయనుఁడు, ప్రచేతుఁడును జెప్పిన ధర్మములను వింటిని. ఈ మన్వంతరంబునఁ గృతత్రేతాద్వాపరమ్ముల ననుష్ఠింపఁ బడు శ్రుతిస్మృత్యుక్తము లగు నగ్నిహోత్రము మొదలగు ధర్మమ్ములు మీ వలన నెఱింగి మఱవకున్నాను. అన్నిధర్మమ్ములును గృతయుగంబునఁ బూర్ణముగ ననుష్ఠింపఁ బడును. అవి యన్నియుఁ గలియుగంబున నశింప సాగును. కావున నాలుగువర్ణములకు సాధారణ మగు ధరమ్మునించుక వక్కాణింపుము. ధర్మవిశారదా! నాలుగు వర్ణములలోన సాధారణధర్మములఁ దెలిసినవారు చేయు సూక్ష్మము స్థూలము నని రెండు విధము లైన ధర్మములు విస్తరించి విశదపఱుపుము. వ్యాసుం డిట్లు ప్రార్థించిన పిదప మునివరుం డగు పరాశరుఁడు సూక్ష్మస్థూలధర్మమ్ముల నిశ్చయమును విస్తరించి వాకుచ్చెను కుమారా! నేను జెప్పెడునది వినుము. మునులారా! మీరును వినుఁడు. బ్రహ్మావిష్ణుమహేశ్వరులు ప్రతిమహాకల్పముతుదను నశించి మఱియుఁ

గల్పాదిం బుట్టుదురు. ఇట్లు వేదములను ధర్మశాస్త్రములను సమాచారములను నిర్ణయించు మునులును నాయా యవాంతరకల్పము తుదను నశించి మఱలఁ గల్పారంభమునఁ బుట్టుదురు. వేద మెవ్వని చేతను రచింపఁ బడలేదు. వ్యాసుండు వేదవిభాగము నె చేసెను. చతుర్ముఖుండును జగదీశ్వరుం డొసంగిన వేదమ్ములం దలంచి ప్రతిమహాకల్పంబు నను స్మృతిగ్రంథముల రచించును. మహేశ్వరుండును వేదాభివ్యక్తిమాత్ర మొనర్చె. ప్రత్యవాంతరకల్పంబునను మన్వాదులు స్మృతులు నిర్మింతురు. అనుష్ఠాత లగు నరుల శక్తితారతమ్యముం బట్టి కృతత్రేతాద్వాపరకలియుగధర్మములు భిన్నభిన్నప్రకారములగును. కృతయుగంబున (నుపవాసనిమిత్తశరీరశోణరూప మగు) తపంబును త్రేతాయుగంబున జ్ఞానంబును ద్వాపరంబున యజ్ఞంబును గలియుగంబున దానమును బ్రధానము లని చెప్పుదురు. కృతయుగంబున మనుధర్మములును త్రేతాయుగమున గౌతమధర్మములును ద్వాపరమున శంఖలిఖితధర్మములును గలియుగమునఁ బరాశరధర్మములును బ్రచురముగ ననుష్ఠింపఁ బడును.

కృతయుగంబునఁ బతితుఁ డున్న దేశమ్మును, త్రేతాయుగమ్మున నట్టి యూరిని ద్వాపరయుగంబునఁ బతితకులమును, గలియుగంబునఁ బాతకకర్తను విడువవలయును. కృతయుగంబునఁ బతితునితో సంభాషణమువలనను, త్రేతాయుగంబున వాని స్పర్శమువలనను, ద్వాపరమునఁ బతితాన్నభోజనమునను, కలియుగమున స్వయముగ హింసాది కర్మములఁ జేయుటచేతను పతితుఁ డగును. శాపము కృతయుగమునఁ దత్క్షణమును త్రేతాయుగమునఁ బదిదినములకును, ద్వాపరమున నొక నెలకును, గలియుగమున నొకసంవత్సరమునకును ఫలించును. కృతయుగమున దాతలు ప్రతిగ్రహీత లున్నచోటికిం జనియుఁ, త్రేతా

యుగంబున గ్రహీతం బిలిచియు, ద్వాపరంబున వచ్చి యాచించినను, గలియుగంబున సేవకునకు నొసంగుదురు. దాత గ్రహీతం జేరి యిచ్చుట యుత్తమము. పిలిచి యీవి మధ్యమము. యాచకున కొసఁగుట యధమము. సేవకున కీగి నిష్ఫలము. కలియుగమున నధర్మముచే ధర్మమును, అనృతముచే సత్యమును, చోరులచే భూవరులును, స్త్రీలచేఁ బురుషులును, చోరులచే భూవరులును జయింపఁబడిరి. అగ్నిహోత్రములును గురుపూజయు నశించుచున్నవి. అవివాహిత లపత్యములఁ గనుచున్నారు. కృతంబునం బ్రాణమ్ము లస్థులను, త్రేతన్మాంసంబును ద్వాపరమున రుధిరమ్మును, గలియుగంబున నన్నాదికంబును నాశ్రయించి యుండును, ఆయా యుగమ్ముల మారుచుండెడి ధర్మమ్ములం గాలవశత ననుష్ఠించు నప్పటప్పటి ద్విజులు నింద్యులుగారు. శేషమగు నన్యోన్య యుగమ్ముల సామర్థ్య మన్యములులచే విధినిషేధములతో సవిశేషముగ విధింపఁ బడ్డవి. వృద్ధపరాశరమున్నాదిహోత్రిక మగు ప్రాయశ్చిత్తము విద్వాంసులచే వివరింపఁ బడుచున్నవి. మునిశ్రేష్ఠులారా! నే నిప్పుడె మీ కర్వము చతుర్వర్ణసదాచారజనితధర్మముం దలంచి చెప్పెద నాలింపుఁడు. పరాశరగ్రంథమును బఠించిన నిష్టప్రాప్తికిని ననిష్టనివారణమునకుఁ గారణ మగు సుకృతము గలుగును. అర్థ మెఱింగినఁ దాము ధర్మమున నాచరించుటయుఁ బరుల కుపదేశించి యాచరింపించుటయు నను పుణ్యము నబ్బును. చాతుర్వర్ణ్యములకు సదాచారము (దయావినయాదులతోఁ గూడిన చరితవిశేషము) శ్రౌతస్మార్తధర్మములం బ్రోచును. తాదృశాచారహీనులు క్రోధనులు నిర్దయులుగ నుండుటం బట్టి వారికి ధర్మము ప్రవృత్తి మయ్యు విముఖమగు. బ్రాహ్మణుఁ డాఱు కర్మముల శ్రద్ధతో నాచరించుచు నిత్యము దేవతల నతిథులం బూజించుచు హోమావశిష్టము భుజించు చుండిన

నశింపఁడు. స్నానసహిత - సంధ్యోపాసనంబును, గాయత్రీజపంబును, హోమంబును, దేవతార్చనంబును, వైశ్వదేవము, నతిథిసత్కారము, ననెడి నిత్యము లగు నాఱు కర్మములు ననుదినమ్మును గర్తవ్యమ్ము లు. వైశ్వదేవాంతమున వచ్చినవాఁ డతిథి. అట్టివాని మిత్రునైన నమిత్రునైన, నజ్ఞునైనం బ్రాజ్ఞునైనం బూజించిన, స్వర్గము లభించును. పగలు వైశ్వదేవాంతమున సాయంకాలమున నెప్పుడైన గ్రామాంతరము నుండి దూరగమనంబున నాఁకొనియు డస్సియు వచ్చినవాఁ డతిథియని యెఱుఁగునది. పూర్వదినమున వచ్చినవాఁ డతిథి గాఁడు. ఎవ్వఁ డన్య గ్రామమునుండి భోజనాపేక్ష గలిగి వచ్చును వాఁడనిత్యముగ వచ్చుట నతిథిగఁ జేర్చికొనఁదగు. ఏకగ్రామవాసులు తిథివిశేషమ్ములద్రవ్యలాభ మపేక్షించి నిత్యము నత్తురు. కాన వారి నెన్నఁడు నతిథులుగ నవలంబింపఁజనదు. గృహస్థుఁడు తనయిలు సేరిన యతిథిని మేలురాక యడిగి, కాలు సేతులు గడిగికొన నుదక మొసఁగి పీఠంబునం గూర్చుండ నియమించి, సాదరంబుగ నన్నపానమ్ము లమర్చి, ప్రేమతో నెది యేని యడిగి, యతఁ డడిగినదానికి మనస్కారముతో నుత్తరముఁ జెప్పి, పయనమయినఁ గొంతదవ్వు సాగనంపి సంతసింపఁజేయవలయును. అతిథి, నే నితని గృహమున భుజింపఁగల నను నాస నాశమొందె యెవని గృహమువలన మఱలునో, వాని యన్నము దేవతలు పదియేనేఁడులదాఁక నారగింపరు. అతిథి యాశ భగ్న మొనరించినవాఁడు, వేయి కావళ్ళ సమిధలును, నూఱు కడవల నేయియు వేల్చినను ఫలము నందఁడు. సుక్షేత్రమున విత్తిన బీజము తద్దయు ఫల మిచ్చును. నశింపదు. అట్లె సత్పాత్రమునం దర్పింపఁబడిన యన్నము బహుపుణ్యద మగును. వ్యర్థము గాదు. సత్కరించు గృహి, యతిథిని, గోత్రము, ఆచారము, శాఖ, శాస్త్రము, దేశము, నామము నడుగక, మనంబున దేవుఁడుగ భావిం

పవలెను. అతిథి సర్వదేవస్వరూపుఁడు గద. సువ్రతుఁ డగు యతియు, వేదాధ్యయననిరతుఁ డగు బ్రహ్మచారియు, నతిథియు, ముప్వురు నను దినము పూజింపఁదగుదురు. వైశ్వదేవము చేయకమున్న, యతి బ్రహ్మచారులు వచ్చిన, వైశ్వదేవమునకు వలయు నన్నమును భాగించి, భిక్ష యిచ్చియె, వారిఁ బంపవలయును. వేదసంసారి, పెక్కండ్రు సన్న్యాసులు, బ్రహ్మచారులు వచ్చిన, మార్గస్థులైన యథాశక్తి తోఁచినట్లయిన సత్కరింపవలెను. కలిగియున్న లేదనకుండఁ బెట్టఁజనును. సన్న్యాసికిహస్తోదక మిచ్చి భిక్ష పెట్టి మఱియు హస్తమున నుదక మొసఁగవలెను. ఆభిక్షాన్నము మేరుపర్వతముతో సమానము. ఆ యుదకము సముద్రముం బోలును. గొడుగును గుఱ్ఱంబును గల రాజు అతిథిగ వచ్చిన సందేహింపక దేవతగ భావించి పూజింపవలెను. దాన నేమఁగు నెక్కుట యు నమృతపానము మొదలగు సమృద్ధియుఁ గల యింద్రరాజ్యముం బొందును. అధము లగు నేబ్రాహ్మణులు వైశ్వదేవము సేయక భుజించుచున్నారో వారు నిరర్థకులై యపవిత్రమగు నరకమునం బడుదురు. వైశ్వదేవములేనివారును, అతిథిసత్కారము చేయనివారును, నరకముల ననుభవించి కాకులై పుట్టుదురు. పాపి, చండాలుఁడు, బ్రహ్మహత్య చేసినవాఁడు, తల్లిదండ్రుల వధించినవాఁడు వీరిలో నెవఁడైన వైశ్వదేవాంతమున నతిథిగ వచ్చి పూజనొందిన స్వర్గము గలిగించును. తలకు బట్టఁ జుట్టుకొనిగాని, యెడమకాలిపై చేయి యుంచుకొనిగాని, దక్షిణదిక్కున కెదురుగఁ గూర్చుండిగాని, నిలుచుండిగాని, భోజనము చేసిన నది రాక్షసులకుఁ బెట్టిన యన్నమగును. ఏ గ్రామంబున వ్రతమును, వేదముఁ జదువుటయు లేక బ్రహ్మచారులు భిక్ష మెత్తుదురో రాజాయూరివారిని దండింపవలెను. వారు దొంగలను బోలినవారి కన్నముఁ బెట్టినవారుగద! క్షత్రియుండు ప్రజల కనురాగము కలిగిం

చుచు నాయుధము చేతం బట్టి శత్రుసైన్యములం గెలిచి క్రూరజంతువుల వధించి న్యాయంబునఁ బుడమిం బాలించునది. పూలదండలు గ్రుచ్చి యమ్మెడువాఁడు ఆరామంబునఁ బూవులు మాత్రము కోసికొనునట్లు రాజు ప్రజల లాభమునఁ గొంత యంశముం గొనవలెనుగాని బొగ్గులుచేయువాఁడు చెట్టుల మొదళ్ళు నఱికినట్లు మూలముం గొనఁ జనదు. కోమటి వడ్డిబేరమును, రత్నములవ్యవహారమును, పశువుల మేపుకొనుటయు, వ్యవసాయమును, వర్తకము ననెడు వృత్తుల జీవనముకొఱ కవలంబింపవలయును శూద్రునకు బ్రాహ్మణుల సేవించుట పరమధర్మము. వాఁడు విప్రులయందు భక్తిలేక యేమి చేసిన నిష్ఫలమగును. శూద్రునకు ఉప్పు, తేనె, నూనె, పెరుఁగు, మజ్జిగ, నేయి, పాలు, ఈవస్తువులను జీవనముకొఱకు కందఱకును నమ్ముకొనవచ్చును. దోషం బొందఁడు. శూద్రుఁడు జనుగకున్నను మద్యములను, మాంసములను అమ్మినను, తినఁగూడని గోమాంసాదులను దిన్నను, బ్రాహ్మణస్త్రీలు మొదలైనవారిం గూడినను తత్క్షణము పాపి యగును. కపిలగోవు పాలు త్రావినను, బ్రాహ్మణస్త్రీలం గూడినను, వేదము నర్థము విమర్శించినను శూద్రుఁడు తత్క్షణము పాపి యగు.



# శ్రీ పరాశరస్మృతి.

## ఆంధ్రము.

### ఆచారకాండము.

### ద్వితీయాధ్యాయము.

అనంతరము కలియుగమునందు గృహస్థునకు శాస్త్రీయమైన కృషి, నాలుగువర్ణములలోను గృహస్థుఁడగుటవలనఁ గలిగిన సామాన్య కర్మము. దీనిపూర్వము పరాశరుఁడు చెప్పినట్లు తేటగం దెలిపెదను. యజనము మొదలగునాఱు కర్మలతోఁగూడిన బ్రాహ్మణుఁడు కృషియును జేయవలెను. ఆఁకలిగొన్నది, దప్పిం జెందినది, అలసినది, కుంటిది, తెవులుగొన్నది, మగతనము లేనిది, యిట్టియెద్దులం గట్టి విప్రుఁడు దున్నరాదు. దృఢములగు నవయవములుగలవియు, తెవులులేనివియు, మేసి త్రావి తనిసినవియు, బలిసి ఱంకెలు వేయునవియు, మగతనముకలవియునైన యెద్దులం గట్టి రెండుజాములు దున్ని పిమ్మట స్నానముచేయింపవలయును. బ్రాహ్మణుండు శోషముపోవుటకై శక్తికొలఁది జపము, దేవపూజ, హోమము, వేదపారాయణము వీనిలో నొకటిచేసి కలిమికొలఁది నొకరిద్దఱు ముగ్గురు నలుగురు స్నాతకులకు భోజనము పెట్టవలెను. (సంతానముకై పెండ్లిచేసికొన ద్రవ్యము కోరువాఁడు, సర్వధనము దక్షిణ యిచ్చి యజ్ఞము సేసి దరిద్రుఁడై సొమ్మపేక్షించువాఁడు, తెరువరి, యజ్ఞము సేయ యాచించువాఁడు, గురువును దల్లి దండ్రులను బోషింపధనమాసించువాఁడు, వేదముచదువు నెఱవేర్చుకొనఁగోరువాఁడు, రోగి వీరుతొమ్మండ్రు స్నాతకులనఁబడుదురు.) తానుదున్నిన పొలమునబండినవియు, నితరులచే దున్నింపఁబడిన పొలమునఁ దానార్జించుకొన్నవియునైన ధాన్య

ములచేతను స్మార్తములైన పంచమహాయజ్ఞములను, శ్రౌతములైన యగ్నిష్టోమాదిక్రతువులను జేసి యాగము చేయఁగోరినవారికై ధాన్యమిచ్చి క్రతువులఁ జేయింపఁజనును. ఒకసంవత్సరము చేఁపలవేఁటాడువాఁ డెంతపాపమునొందునో యినుపకఱ్ఱు వేసినవాఁగటితో దున్నిన నొక్కరోజున నంతపాపముం జెందును. వల పన్ని మృగంబులం బట్టువాఁడు, చేఁపలవేఁటాడువాఁడు, వ్యాధుఁడు (మృగవధమే జీవికగలవాఁడు) పిట్టలం జంపువాఁడు, కృషిచేసి రాశియొద్దకు వచ్చినవారికిఁ బెట్టనివాఁడును సమాన మైనపాపముం బొందుదురు. వ్యవసాయము చేయువాఁడు చెట్లుకొట్టుటవలనను, నేల పగులఁగొట్టుటవలనను, జీవలను బురువులను జంపుటవలనను గలిగినపాపముల నన్నిటిని గళ్ళమున ధాన్యము ధర్మముచేయుటవలనఁ బోఁగొట్టుకొనును. బ్రాహ్మణులకుఁ గళ్ళమున ధాన్యము పెట్టనివానిని దొంగ యనియును, నతిపాపియనియును, బ్రహ్మహత్య చేయువాఁడనియును జెప్పవలెను. కృషి చేయువాఁడు రాజున కాఱవభాగమును, దేవతల కిరువదియొకటవభాగమును, బ్రాహ్మణులకు ముప్పదియవభాగమును, నిచ్చుటచే దోషముం దొలఁగించుకొనును. క్షత్రియుఁడును గృషిచేసికొని దేవతలను బ్రాహ్మణులను బూజింపవలయును. అట్లు గోమటియును, గాఁపును వ్యవసాయము, వర్తకము, శిల్పముఁ జేయఁదగుదురు. శూద్రులు విశేషలాభముం గలిగించుకృష్యాదులయం దాసక్తి గలిగి బ్రాహ్మణుల సేవ మానిన నల్పాయుష్యము గలవారై నరకముం బొందుదురు. సందేహము లేదు. ఇది నాలుగువర్ణములవారికని శాస్త్రోక్త మైనధర్మము.

# శ్రీపరాశరస్మృతి.

## ఆంధ్రము.

## ఆచారకాండము.

### తృతీయాధ్యాయము.

అశుద్ధి కలుగును గానం బుట్టువునందును, చావునందును శుద్ధిని జెప్పఁగలము. మయిలవచ్చిన బ్రాహ్మణులు మూఁడుదినములచేతను, రాజులు పంద్రెండుదినములచేతను, గోమట్లు పదియేనుదినములచేతను, శూద్రులు నెలదినములచేతను శుద్ధినిఁ జెందుదు రని పరాశరుండు పలికెను. బ్రాహ్మణులకు సంధ్యావందనాదికము ప్రసక్తించిన తత్కాలమున శరీరశుద్ధియును గలుగును. పురుడునందు బ్రాహ్మణులకు శరీరస్పర్శము నిందితముగాదు. పురుడు వచ్చిన బ్రాహ్మణులు పదినములచేతను, రాజులు పంద్రెండు దినములచేతను, గోమట్లు పదియేను దినములచేతను, శూద్రులు నెలతోను శుద్ధులగుదురు. మయిల వచ్చిన సాగ్నిహోత్రులును వేదంబులును గల బ్రాహ్మణుఁ డొకదినముతో శుద్ధుఁడగును. ఒకవేదము గలవాఁడు మూఁడుదినములతో శుద్ధుఁడగును. అగ్ని, వేదము రెండును లేనివాఁడు పదిదినములతో శుద్ధుఁడగును. గర్భాధానము మొదలగుకర్మలు లేక సంధ్యయు స్నానాసనంబు నాచరింపని (నామధారకుఁడు) బ్రాహ్మణుఁ డనుపేరుమాత్రము పొందినవాఁడు నగువిప్రుఁడు పదిదినము లాశౌచముగలవాఁ డగును. ఉత్తమవర్ణపురుషులవలన హీనవర్ణస్త్రీలయందుఁ బుట్టినవారు పితృసంబంధు లైనజననమరణములందుఁ బితృవర్ణమునకు విధింపఁబడిన యాశౌచమునే పొందుదురు. భిన్నజాతీయసంతతివిషయ మైనయాశౌ

చము మూఁడుతరములదనుక నె కలుగును. సజాతీయుఁ డైదవవాఁ డైన, నాఱవవాఁ డైన నేడవవాఁ డైనఁ బిండమువలన విడివడును. కూటస్థుఁడు మొదలుగ నాల్గవపురుషునియందు పదిరాత్రులలోను, అయిదవవానియం దాఱురాత్రులలోను, ఆఱవవానియందు నాలుగురాత్రులలోను, ఏడవవానియందు మూఁడురాత్రులలోను శుద్ధి గలుగును. బుద్ధిపూర్వకముగఁ గొండచఱులం బడియుఁ, జిచ్చునుఱికియుఁ జచ్చినను, అసపిండుఁడు దేశాంతరమున మృతినొందినను, నామకరణము కాని బాలుఁడును, సన్యాసియుఁ జచ్చినను, దత్క్షణము శుద్ధి విధింపఁబడుచున్నది. ఒకసపిండుఁడు దేశాంతరమున మృతినొందినట్లు వినవచ్చిన మూఁడురాత్రులు గాని రాత్రియుఁ బగలుఁ గాని యాశౌచము లేదు. తత్క్షణము స్నానంబున శుద్ధుఁడగును. బాలుడు పన్నులు రాకపూర్వము చచ్చినను, గర్భపాతము గలిగినను, వారికి దహనము, నాశౌచము, నుదకము నిచ్చుటయు లేవు. గర్భమునకు స్రావము గాని పాతము గాని కలిగిన నాగర్భ మెన్ని నెలలు నిలిచెనో యన్ని దినములు తల్లికిఁ బురుడు కలుగును. నాలుగు నెలలు వెడలువనుక గర్భముపోవుట స్రావము. అయిదవ యాఱవ నెలలయందు గర్భముపోవుట పాతము. ఏడవమాసము మొదలు గర్భము వెడలుట ప్రసవ మగును. ప్రసవమునఁ దల్లికిఁ బదిరాత్రు లాశౌచము కలుగును. బాలుఁడు పన్నులు వచ్చినవాఁ డైన రానివాఁ డైనఁ జూడాకర్మము చేసినపిదప మృతినొందిన దహనము చేసినట్టయిన సపిండులకు మూఁడురాత్రు లాశౌచము కలుగును. పన్నులు వచ్చుటకుఁ బూర్వము బాలుఁడు మృతుఁ డైన జ్ఞాతులకుఁ దత్క్షణముశుద్ధి. అది మొదలు చూడాకర్మము చేయకపూర్వము చనిపోయిన జ్ఞాతుల కొకపగలును రాత్రియు నాశౌచము. చూడాకర్మ మైనతరువాత నుపనయనమునకుఁ బూర్వము మృతినొందిన మూఁ

మురాత్రులతో శుద్ధి. ఉపనయన మైనపిదప బదిరాత్రులు మయిల యగును. బ్రహ్మచారికిని, ఎవరింట నగ్ని వేల్వఁబడునో వారికిని నాశౌచముగలవారితో సంపర్కము లేకున్న వారికిని మయిలయులేదు. బ్రాహ్మణుఁడు పుట్టువునందును, జావునందును సంపర్కమువలన దూషింపఁబడును. సంపర్కము మానుకొన్నవానికిఁ బుసుడును మయిలయు లేదు. శిల్పులు, (చిత్రములవ్రాఁత మొదలైనవి చేయువారు) వంటలు చేయువారు, వైద్యులు, దాసులు, (స్త్రీలు, పురుషులును) మంగలవాండ్రు, రాజులు, వేదము చదువుకొనుచున్నవారు తత్క్షణము శుద్ధిగలవారు. నియమము గలవాఁడును, యజ్ఞముచేఁ బవిత్రుఁడును, అగ్నిహోత్రము సంపాదించుకొన్నవాఁడును, రాజును, రాజెవరికాశౌచము లేకయుండఁ గోరునో వారు నాశౌచము లేనివారు. యుద్ధముచేయను ద్యుక్తుఁడైనవాఁడును, అన్నాదిదానము చేయమొదలుపెట్టినవాఁడును ఆపదను బొందినవాఁడును, ప్రత్యేకముగ భోక్తగఁ బిలువఁబడినవాఁడును, బదిరాత్రులాశౌచము పట్టినవారివలెఁ దత్క్షణము శుద్ధుఁగుదు రని ఋషులు విధించిరి. గృహస్థుఁడు పుట్టువునందు పురుటాలిని స్పృశింపకున్న స్నానముచే శుద్ధుఁడగును. ఆ స్త్రీ పదిదినములకు శుద్ధురాలగును. సపిండుల కంటఁబడుఁ బుట్టియుండదస్పృశ్యత లేదు. తండ్రికి స్నానమున శుద్ధి కలుగును. తల్లికిఁ బదిదినములకు శుద్ధి యగును. వేదము సాంగముగఁ జదివిన బ్రాహ్మణుఁ డైనఁ బ్రసవమైన భార్యతోఁ సంసర్గము చేసిన నతనికి సూతకము కలుగును. సంపర్కమువలన స్పృశింపఁదగమి సంభవించునుగాని బ్రాహ్మణునియందు మఱియొక దోషము లేదు. కావున నన్ని యత్నములచేతను విద్వాంసుఁడు సంపర్కము విడువఁ జనును. పెండ్లి, దేవోత్సవము, యజ్ఞము జరుగుచుండునపుడు పురుడుగాని మయిలగాని వచ్చినఁ బూర్వము విని యోగింపఁ

దలంపఁబడ్డ పదార్థము దేవతలకు బ్రాహ్మణులకు నిచ్చిన దోషము లేదు. పదిదినము లాచరింప వలసిన యాశౌచము నడుమ పురుడైన మైల యైన వచ్చిన మొదటి యాశౌచము పదిరాత్రులు గడచుదనుక నె యశుద్ధి గాని యితరాశౌచము లేదు. బ్రాహ్మణుల ప్రాణములు సంరక్షింప యత్నించి చచ్చినవారికిని, జెఱపెట్టఁ బడిన స్త్రీలను, బట్టఁబడిన యావులను విడిపింపఁ బోయి చచ్చినవారికిని, యుద్ధమున మరణము నొందినవారికిని నొకరాత్రి యాశౌచము. యోగాభ్యాసంబున నీశ్వరు నుపాసనము సేసిన సన్యాసియు, యుద్ధమున నెదురై మృతి నొందనాఁడును నీ యిద్దఱు సూర్యుని మండలము భేదించి బ్రహ్మలోకముం బొందుదురు. శూరుఁడు శత్రువులచే నావరింపఁబడి భయము దెలుపు పలుకు లాడకుండ జంపఁబడిన నంతములేని పుణ్యలోకములం బొందును. ఏ వీరుఁడు శత్రువు లాక్రమింప జడిసి చెదరి పాఱి పోవు సైన్యములు రక్షింప వచ్చునో వాఁ డశ్వమేధము చేసిన పుణ్యము నొందును. ఎవ్వని శరీరము బాణములు, గదలు, దుడ్డు మొదలగు నాయుధములచే నణఁకలు దెబ్బలం జెందినదో వాని నప్సరస్త్రీలు వరించి యా సంతసము నొందింతురు. యుద్ధమందుఁ జంపఁ బడిన శూరుం గూర్చి దేవతాస్త్రీలు వేలకొలఁది "నామగఁడు నామగఁడు" అని త్వరతోఁ బట్టఁగఁ గోరి వత్తురు. కోరిక లేని వారైన, స్వర్గము కోరిన వారైన యజ్ఞములు చేసియుఁ, దపము లొనర్చియు నేపుణ్యలోకము నేవిధమునఁ జెందుచున్నారో యాలోకము నట్లు యుద్ధమునందుఁ బ్రాణములు విడిచిన వీరులును క్షణముననే పొందుదురు. గెలిచిన రాజ్యలక్ష్మి గలుగును. చచ్చిన నచ్చరలతో సంభోగము లభించును. కావున యుద్ధమున మరణము నొందుటకు క్షణమున నశించుస్వభావముగల యీ దేహము మీఁది చింత యేల? నీతిశాస్త్రమున విధింపఁ బడిన యుద్ధమున ము

లికి నాటిన నొసటి నుండి జాఱిన రక్తము సోఁకఁ బడిన నది యజ్ఞమునందు సోమపానమువలె స్వర్గము నిచ్చును. బ్రాహ్మణులు దిక్కుమాలిన బ్రాహ్మణుని శవము మోచుచు నడచిన నడుగడుగున యజ్ఞఫలముఁ బొందుదురు. ఈ మంచిపని చేసినవారికి గీడుగాని, పాపముగాని లేదు. వారు స్నానము చేసిన తత్క్షణముననే శుద్ధి నొందుదురు. జ్ఞాతులు చుట్టములును లేని బ్రాహ్మణుని శవము మోచి దహనము చేసినవారు ప్రాణాయామంబున శుద్ధు లగుదురు. చుట్టము నైనఁ జుట్టము కాని వాని నైనఁ జనిపోయినవానిని దీసికొని పోవునప్పుడు కూడ వెడలినవాఁ డాబట్టుతో స్నానముచేసి యగ్నిని స్పృశించి ఘృతప్రాశనము చేసి శుద్ధి నొందును. బ్రాహ్మణుఁ డజ్ఞానంబున క్షత్రియశవముతోఁ గూడ వెడలిన నొకదిన మాశౌచము పట్టి పంచగవ్యము పుచ్చుకొన్న శుద్ధిఁ డగును. వైశ్యశవముతోఁ జనిన రెండు రాత్రు లాశౌచము పట్టి యాఱు ప్రాణాయామము లాచరించిన శుద్ధి నొందును. శూద్రశవముతోఁ గూడ జనిన మూఁడురాత్రు లాశౌచము పట్టి సముద్రసంగమముగల నదియందు స్నానము చేసి నూఱు ప్రాణాయామంబు లాచరించి నేయి ప్రాశన చేసిన శుద్ధుఁ డగును. శూద్రులు మృతుల కుదక మిచ్చి యాశౌచము పరిహరించుకొనినప్పుడు వారిని బ్రాహ్మణులు చేఁ జూడ వలయు నను నది శాశ్వతమైన ధర్మము.

తృతీయాధ్యాయము సంపూర్ణము.



# శ్రీ పరాశరస్మృతి.

## ఆంధ్రము.

## ప్రాయశ్చిత్తకాండము.

## చతుర్థాధ్యాయము.

స్త్రీయైనఁ బురుషుఁడైన మానభంగమువలనఁ గాని, యత్రకోపావేశమువలనఁ గాని, యతిస్నేహమువలనఁ గాని, యతిభయమువలనఁ గాని యురిపెట్టుకొని చచ్చినవారు దుర్గంధరక్తముతో నిండిన యంధతమ మను పేరుగల నరకమున మునిఁగి యరువదివేలేండ్లుందురు. వీరికి ఆశౌచముపట్టుట, యుదక మిచ్చుట, దహనము, కన్నీరు విడుచుట మొదలుగల పనులు చేయరాదు. వీరిని మోచువారు, దహనము చేయువారు, ఉరిత్రాటిని గోసెడివారును దప్తకృచ్ఛ్రముఁ జేసిన శుద్ధులగుదు రనిచతుర్ముఖుండు చెప్పెను. (మూఁడు దినములు వేఁడినీరును మూఁడు దినములు వేఁడిపాలును, మూఁడుదినములు వేఁడినేయియును ద్రావి మూఁడుదినము లుపవసించుట తప్తకృచ్ఛ్రము.) గోవులచేతను బ్రాహ్మణునిచేతను జంపఁబడిన వారిని నురిపెట్టి చంపఁబడినవానిని స్పృశించువారు, మోచువారు, దహనము సేయువారు, కూడఁ జనువారు, నురిత్రాడు గోయువారలును దప్తకృచ్ఛ్రము చేసి బ్రాహ్మణుల కన్నము పెట్టి వృషభముతోఁ గూడిన యావును దానము చేసిన శుద్ధు లగుదురు. మనుష్యుఁడు పతితులు మొదలగు వారితోడఁ బ్రామాదికముగఁ బ్రయాణముచేయుట, కూర్చుండుట, శయనించుట మొదలగు సంపర్కము, ఐదు, పది, పండ్రెండు

దినములు, నెల, అరనెల, రెండునెలలు, అరసంవత్సరము, కొంచెముతక్కువసంవత్సరము చేసిన క్రిందఁ జెప్పఁగల ప్రాయశ్చిత్తము లాచరింపవలయును. సంవత్సరముకంటె నెక్కువకాలము సంపర్కము చేసినపతితునితో సమానుఁడే. మొదటిపక్షమున త్రిరాత్రకృచ్ఛ్రము (మూఁడు దినములు భుజింపకుండుట) చేయవలెను. రెండవపక్షమున ప్రాజాపత్యము (మూఁడు దినము లుదయంబున మూఁడు దినము లస్తమయంబున భుజించి మూఁడు దినము లడుగక దొరకిన యన్నముఁ దిని మూఁడు దినము లుపవసించుట) జరుపవలయును. మూఁడవపక్షమున సాంతపనకృచ్ఛ్రము (గోవుయొక్కమూత్రము, గోమయము, పాలు, పెరుఁగు, నేయి, దర్భజలము వీని నాలుగోజులు భుజించి సప్తమదినమున నుపవసించుట) చేయఁదగును. నాల్గవపక్షమునఁ బది దినము లుపవాసము చేయవలెను. ఐదవపక్షమున పరాకకృచ్ఛ్రము (మనోనియమముగలిగి యితరచింతలేక పండ్రెండు దినము లుపవసించుట) చేయనగును. ఆఱవపక్షమున చాంద్రాయణము (దీనిలక్షణము గ్రంథకర్త ముందుఁజెప్పఁగలఁడు) చేయునది. సప్తమపక్షమున రెండు చాంద్రాయణము లాచరింపవలయును. ఎనిమిదవపక్షమున శుద్ధికొఱకు నాలుమాసములకాలము వ్యాపించు ప్రాజాపత్యకృచ్ఛ్రములు పదునైదాచరింపవలెను. ఏ స్త్రీ ఋతుస్నానము చేసి భర్తచేఁ బిలువఁబడి రాదో యాస్త్రీ మృతి నొంది నరక మనుభవించి పెక్కుజన్మంబుల విధవయగును. ఏ పురుషుఁడు రోగిగాక సమీపమున నుండి ఋతుస్నానము చేసిన భార్యతో సంగమింపఁడో వాఁడు భయంకర మగు శిశుహత్యాయను పాపమున మునుఁగును. ఈ యర్థమున సంశయము లేదు. పేదవాఁడని, రోగియని, తెలివిలేనివాఁడని భర్త ననాదరించిన స్త్రీ మృతి నొంది కుక్కయుఁ బందియు నై మఱిమఱియుం బుట్టును. ఏ స్త్రీ

పతి బ్రతికియుండఁగా సతిని శుశ్రూష యుపేక్షించి నోములు నుపవాసములుచేయునో యాస్త్రీ భర్తయాయువును హరించును. నరకమునుబొందును. భర్తయనుమతిని బొందక యే స్త్రీయైన వ్రతముచేసిన సదియంతయు రాక్షసులం జెందు నని మనువుచెప్పెను. ఏ స్త్రీయైన చుట్టములకు జ్ఞాతులకు విషముపెట్టుట మొదలైన చెడుపనులు చేయునో గర్భపాతముఁ జేసికొనునో యట్టిదానితో సంభాషింపరాదు. బ్రహ్మహత్యవలనఁ గలుగు పాపమునకు రెండంతలు పాపము గర్భపాతముచేసికొనుటవలనఁ గలుగును. కావున నా పాపమునకుఁ బ్రాయశ్చిత్తములేదు. దానిని విడుచుట విహితము. ఎవ్వఁడు, "అగ్నిచేతను, అగ్నిహోత్రాదికర్మలచేతను నీ లోకమున ఫలములేదు; పరలోకమున ఫలమున్నదో లేదో యెవఁ డెఱుఁగును?" అని వేదోక్తధర్మమువలనవిముఖుండై యాచరింపఁడో వాఁడు కర్మచేఁ జండాలుండగును. జలప్రవాహమువలనఁ గాని, పెనుగాలివలనఁ గాని కొట్టుకొని వచ్చిన విత్తన మెవనిక్షేత్రమున మొలచునో యాక్షేత్రస్వామి యాబీజఫలమునందును బీజస్వామికి భాగములేదు. అట్లే పరస్త్రీయందుఁ గనఁబడిన కుండగోళకులు క్షేత్రపతియొక్క పుత్త్రులే యగుచున్నారు. వారిలో క్షేత్రవంతుఁడు బ్రతికియుండ జారునివలన బుట్టినకొడుకు కుండుఁడు. క్షేత్రి చనిపోయినపిదప జారునివలనఁ బుట్టినవాఁడు గోళకుఁడు. పెండ్లియాడినభార్యయందుఁ దాను గన్నకొడుకు ఔరసుఁ డనఁబడును. మృతుఁడు, నపుంసకుఁడు, రోగి వీనిలో నేవానియొక్కయైన స్వధర్మముచే నియమింపఁబడిన భార్యయందు నితరునివలనఁ బుట్టినకొడుకు క్షేత్రజుఁ డనిచెప్పఁబడును. తల్లియైనఁ దండ్రియైన నిచ్చినవాఁడుదత్తుఁడు తగువివేకముగలవాఁడు పుత్త్రుఁడుగఁ జేర్చుకోఁబడినవాఁడుకృత్రిముఁ డగును. అన్న పెండ్లి చేసికొన

కుండఁ బెండ్లాడినతమ్ముఁడు పరివేత్త. అట్టియన్న పరివిత్తి. అట్టితమ్ముని వివాహముచేసికొనినస్త్రీ పరివేదిని. దానినిచ్చుతండ్రి మొదలగువారు పెండ్లిచేయించువాఁడు ఈయైదుగురు నరకముంబొందుదురు. పరివిత్తియు, పరివేత్తయు రెండుకృచ్ఛ్రములు, కన్యయొకకృచ్ఛ్రము, ఇచ్చినవాఁడు కృచ్ఛ్రాతికృచ్ఛ్రము; (ఇరువదియొకదినములుపాలుఁ ద్రాగియుండుట) యాజకుఁడు చాంద్రాయణము చేయవలయును. అన్న కుఱుగుజ్జవాఁడు, మిక్కిలి పొట్టివాఁడు, నపుంసకుఁడు, నత్తినోటివాఁడు, మందుఁడు, పుట్టుగ్రుడ్డివాఁడు, చెవిటివాఁడు, మూఁగవాఁడు గాని యై పెండ్లి లేకున్నఁ దమ్ముఁడు పెండ్లాడిన దోషములేదు. పితృసోదరునికొడుకు, సవతితల్లికొడుకు, పెంచుకోఁబడినవాఁడు. వీరు పెద్దవారై పెండ్లి లేకుండినను తమ్ముఁడు పెండ్లాడినను అగ్నులు సంపాదించినను దోషములేదు. జ్యేష్ఠభ్రాత ఆధానములేకున్నఁ దమ్ముఁడు ఆధానముచేయరాదు. అన్న సమ్మతినొంది యగ్నుల సంపాదించుకొనఁదగునని శంఖుఁడు చెప్పెను. పతి దేశాంతరము వెడలి వార్తఁ దెలియకున్న, మృతినొందిన సన్న్యసించిన నపుంసకుఁడైనఁ బాపియైన నీయైదాపదలయందును స్త్రీలకు వేరొకపతి విధియింపఁబడుచున్నాఁడు. ఏస్త్రీ పెనిమిటి మృతినొందిన మఱల వివాహమాడక బ్రహ్మచర్యము చేయునో యాస్త్రీ మృతినొంది బ్రహ్మచారులువలె స్వర్గముఁ జెందుచున్నది. మనుష్యునియందు మూఁడుకోట్లు నేఁబదిలక్షలు లోమములుండును. పెనిమిటి చనిపోయిన సహగమనముచేసినస్త్రీ యన్నివేలసంవత్సరములు స్వర్గమున నివసించును. పాములవాఁడు బలిమిని కలుగునుండి పామును బైకి లాగులాగున ననుగమన మొనర్చినస్త్రీ భర్తను బాపనిముక్తునిఁ జేసి వానితోఁగూడ నానందమొందును.

చతుర్థాధ్యాయము సంపూర్ణము.

